శ్రీరస్తు

# అనిరుద్ధచరిత్రము.

## పీఠిక.

---



నిత్యోత్సవమందిరంబు లగులక్ష్మీమోహనాపాంగ వీ
క్షానీలోత్పలమాలికావళులు శృంగారంబుగా నంగపూ
జానైపథ్య మొలర్పఁ దత్తనులతాసంశ్లిష్టకేళిం బ్రియా
నూనుండై తగుమంగళాచలనృసింహుం డిచ్చు మాకోరికల్ 1

చ. సరసతఁ గౌఁగిలింప గిరిజాకుచపాళి నిజాంగలిప్తభా
సురభసితాంత మై కులుకుచున్ వెలిదామరమొగ్గజోడు సుం
దరత వహించుమండ మమతం బలుమాఱును జూచి సౌఖ్యశం
కరుఁడు ప్రసన్నుఁడై యొసఁగుఁ గావుత మాకు నభీష్టసంపదల్ 2

మ. అకలంకం బగుచిత్తశుద్ధికొఱకై యశ్రాంతమున్ మ్రొక్కెదన్
సకలస్థావరజంగమాత్మకజగత్సంసారనిర్మాణక
ర్తకు నానాదురితౌఘహర్తకు సమస్తామ్నాయసంవర్తకున్
బ్రకటస్మార్తమనోవిహర్తకును వాక్పద్మేక్షణాభర్తకున్. 3

చ. కలిమికిఁ బుట్టినిల్లు సురకన్యల కెలికసాని ముజ్జగం
బులకును గన్నతల్లి కృతపుణ్యులకున్ ధనధాన్యరాశి వి
ద్యలగని కత్తగారు కలశాబ్ధికిఁ గూరిమిపట్టి శౌరికిన్
గులసతి యాదిలక్ష్మి దయ గుల్కెడు చూపుల మమ్ముఁ బ్రోవుతన్ 4

శా. శ్రీవిద్యాబగళాముఖీ భగవతీ చింతామణీ శ్యామలా
దేవీ వశ్యముఖీ సమాహ్వయములన్ దీప్యన్మహామంత్రయం
త్రావిర్భూత నిజాంశ లాశ్రితులకిష్టైశ్వర్యముల్ చేయఁ జి
ద్భావాకారత నొప్పు శాంభవి నను బ్రజ్ఞాన్వితుం జేయుతన్ 5

చ. రసరమణీయకీరసుకరంబు నభీష్టఫలోదయంబు మా
ర్దవసుమగంధయుక్తము సుధాసమవర్ణముగల్గి వర్ణనీ
యవిబుధలోకకల్పతరువై తగుపద్మజురాణి వర్తనో
త్సవము వహించుఁగాత నిరతంబునుమద్రసనాంచలంబునన్. 6

ఉ. అంబుజగర్భవిష్టరవరాదులచేత సపర్యలందు హే
రంబుఁ గృపాలవాలంబు మునిరాణ్ణికురుంబమనోంబుజాళిరో
లంబు దరస్మితాననకరాజితశారదచంద్రబింబు భూ
షాంబరరుగ్విడంబు విజితారికదంబు భజింతు విద్యకై 7

మ. దినరాత్తేజులఁ గాళిదాసు భవభూతిన్ దండి బాణున్ మయూ
రుని శ్రీహర్షుని సోము భారవిని చోరున్నన్నపన్ దిక్కశ
ర్మను శ్రీనాథుని సోము భీమకవి నెఱ్ఱాప్రెగ్గడన్ భాస్కరున్
వినుతింతున్ హరిభక్తినిష్ఠుల మహావిద్వత్కవిశ్రేష్ఠులన్ 8

చ. చతురకవిత్వతత్త్వపటుసంపద యొక్కరి సొమ్ముగాదు భా
రతిదయ సౌధవార్ధికవిరాజుల మానసముల్ ఘటంబు లా
యతము కొలంది లబ్ధమగు నయ్యమృతం బటుగాఁ దలంచి య
ద్యతన కవీంద్రులార కృప దప్పక మత్కృతి నాదరింపుఁడీ. 9

తే. కాళిదాసాదులకునైనఁ గలవుతప్పు
లనిరి పెద్దలు మాదృశులనఁగ నెంత
తప్పు గల్గిన దిద్దుఁడీ యొప్పుగాను
బాలునకు బుద్ధి నేర్పినభంగి గవులు. 10

తే. భగవదర్పితకావ్యంబునట్టె నెరసు, లున్న దూషింప వలదు మాయన్నలార
ఘనకిరీటంబు ధరియించుకొనిన తలకు, సుళ్లలెక్కలు వెట్టుట చొప్పుగాదు. 11

చ. సుకవుల సూక్తులందు సరసుల్ నెరసుల్ వెదుకంగబోరు మ
క్షికవితతుల్ వ్రణంబు పరికించుగతిం గొదవల్ గణించుటల్
కుకవుల నైజబుద్ధి తెరలో కథ సొప్పున బొమ్మలాడఁగా
నొకకడ హాస్యపుం బ్రతిమ లుండనె పెక్కులు వెక్కిరించుచున్. 12

వ. అని యిట్లు ప్రధానదేవతానమస్కారంబును బురాతనాద్యతనసుకవిపురస్కారణం
బును గుకవితిరస్కారణంబును గావించి యనంతరంబ 13

సీ. శ్రీమంగళాద్రి లక్ష్మీనృసింహుల కటాక్షాంచలామృతవృష్టి నంకురించి
సంగీతసాహిత్యసరససౌష్ఠవయుక్తి శాఖోపశాఖలఁ జాలఁ బ్రబలి

రసికరాజన్యముఖ్యసమాజబహుమానసతతవసంతాభిరతిఁజిగిర్చి
దైవనామాంకిత స్తవమనోహరభావపదవాక్యసుమములఁ బరిమళించి
యభినవస్థితిఁ బెంపొందు నస్మదీయ, భాగధేయసారస్వతపారిజాత
తరువునకుఁదగు సత్ఫలోదయము గాఁగ, సముచితంబుగ నొక ప్రబంధమురచింతు.

క. చదువులకు మేర యెయ్యది, చదివినమాత్రంబె చాలు సరసవచస్సం
పదఁ దా నేర్చిన కొలఁదిని, యదనఁగవితఁ జెప్పి హరికి నర్పింపఁ దగున్ 15

మ. అతి దాక్షిణ్యఁ దతిండు పూర్వకవికావ్యప్రౌఢ వాచారసో
న్నతులం దేలినఁ దేలుఁగాక యెపుడున్ నావంటికించిజ్ఞచేఁ
గృతి విశ్వాస మెఱింగి చేకొనియెడున్ శృంగారవద్వల్లవీ
రతులం జొక్కియుఁ గుబ్జమేను వగమీఱన్ దీర్చి చేపట్టఁడే 16

క. భగవంతుని సద్గుణములు, పొగడు వివేకంబె తమ కపూర్వైశ్వర్యం
బగుట నరస్తుతి సేయరు, జగతిన్ సత్కవులు తుచ్ఛ సంపదకొఱకై 17

మ. హరినామాంకితకావ్య మెట్టిదయిన న్మాంసమై సజ్జనా
దరణీయం బగుఁబుష్పమాలికలలో దారంబు చందంబునన్
నరనామాంకిత మైనకావ్యము రసోన్నత్యస్థ మయ్యు న్నిరా
కరణంబై చను హీనజాతిపురుషుం గైకొన్న వేశ్యంబలెన్ 18

చ. కృతులు నిజాంకితంబు లొనరించిన నిష్టధనంబు లిచ్చి స
స్తుతిఁ బ్రభువుల్ కవీశ్వరుల మన్ననసేయుట కీర్తిఁగోరి ని
శ్చితమతి దేవతాస్తుతియె సేయుకవీంద్రుల నాదరించి స
త్కృతి యొనరించు సత్ప్రభుని కీర్తికిఁ గీర్తి ఘటింపకుండునే 19

గ. అని తలంచి యొక్కనాఁటిరాత్రియందు నాయిష్టదైవం బైన శ్రీమంగళాచలనృ
సింహదేవు దేవాలయంబునకుం జని వివిధమణిగణవిరాజితంబును, ప్రదీప్తహాటక
మయంబును నై నయనారవిందంబులకు నూతనంబైన యానందవికాసంబు సంపా
దించుచున్నగోపురప్రాకారశిఖరగర్భగృహాంతరాళికాముఖమండపప్రభాసౌభాగ్యం
బులవలోకించి యాశ్చర్యంబునొందుచుఁ బ్రదక్షిణంబులుచేసి స్వామిదర్శనంబు
సేయుచు నుత్సాహంబున నంతర్గృహంబున కరిగి యందు. 20

సీ. సంపూర్ణపూర్ణిమాచంద్రబింబము వంటి మోమునఁ జిఱునవ్వు మొలకలెత్త
నంకసీమమున సుఖాసీనయై యున్న యిందిరావిలాసవిభ్రమ మెసంగ
శంఖచక్రగదాబ్జసంశోభితములైన బాహాచతుష్టయప్రభలు నిగుడ
గ్రైవేయమకుటకంకణకుండలాంగదహారావళులు మేన నందగింప
బాలికాహస్తపంకజాలోలచామర, చామరానిలమోదితస్వాంతుఁ డగుచు
దివ్య సింహాసనంబునఁ దేజరిల్లు, మోహనాకారు నరసింహమూర్తిఁ గంటి 21

క. కని సాష్టాంగముగా నం, దనములు గావించి లేచి తత్సామీప్యం
బున నిలిచి కొలిచియుండఁగ, ననుఁ జల్లనిచూడ్కిఁ జూచి నయముగఁ బలికెన్.

క. బాలత్వమందె నీకు ద, యాళుఁడనై యొసఁగితిన్ మదర్పితకవితా
ఖేలనమును మద్భజనా, శీలంబును దృఢముగాఁగఁ జేసితి వత్సా 23

క. అనిరుద్ధచరిత్రముఁ జ, క్కనిముచ్చట విస్తరించి కడఁగి ప్రబంధం
బొనరింపుము శ్రేయోవ, ర్ధనమగు మాపేర నంకితము సేయుఁ దగన్ 24

వ. అని పలికినఁ బరమానందభరితహృదయుండనై తద్వచనంబు మహాప్రసాదంబుగా నంగీకరించుకొని యిట్లంటి 25

ఉ. ఓకమలామనోరమణ యో పరమేశ్వర యో జగత్పతీ
యో కరిరాజదైన్యహర యో శరణాగతవజ్రపంజరా
యో కరుణారసామృతపయోధి పునర్జననంబుమాకు సా
ఖ్యాకరమైనసత్పదము నందఁగఁజేసి కృతార్థుఁ జేయుమీ 26

వ. అని పునఃపునఃప్రణామంబులు చేసి తదనుజ్ఞవడసి యంతనుండి మరలి గృహంబునకు వచ్చితి నని యాదృశంబైన స్వప్నంబుఁ గాంచి మేల్కని యపరిమితప్రమోదరస మగ్నాంతరంగుండనై కొంతదడవు తదీయ దివ్యమంగళవిగ్రహంబు భావించుచుం డితి నివ్విధంబునఁ దదనుగ్రహంబు వడసినవాఁడనై యేతత్ప్రబంధరచనాక్రమం బునకు నుపక్రమించి మద్వంశప్రకారంబు వర్ణించెద 27

సీ. శుభకరాపస్తంబ సూత్రుండు కౌండిన్య గోత్రుండు నార్వేల కుల పవిత్రుఁ
డగు బసవన మంత్రి కమరప్పయమ్మన పెద్దన యెల్లప్ప ప్రీతితనూజు
లా కుమారచతుష్టయంబులో ముమ్మనామాత్యుండు సత్కీర్తిమండనుండు
తత్తనూజాతుఁ డుత్తమధర్మశీలుండు నిర్మలచరితుండు నిమ్మనాఖ్యుఁ
డతని నిజసాధ్వి యగుకొండమాంబగర్భ, మందు జనియించె వినయవిద్యావిశాలుండు
హరిహరధ్యానసేవాపరాయణుండు, మహితగుణశాలి యబ్బయామాత్యమౌళి 28

ఉ. నిండుమనంబు సత్యమును నీతియు శాంతముఁ గల్గి కీర్తిసం
తుండయి భోగభాగ్యములతోఁ జెలువొందుచుఁ గొండవీటి భూ
మండల నాయకుల్ మిగుల మన్ననసేయగఁ బెంపుమీఱె న స
త్పండితుఁ డబ్బమంత్రి కనుపర్తిపురాన్వయ వార్ధిపూర్ణచం
ద్రుం డని లోకులందఱు నెఱుంగుటకున్ నుతిసేయ నేటికిన్ 29

తే. అగ్నిహోత్రుని గేహిని యైనపుణ్య, వతికి లక్ష్మాంబ కుదయించె సుతయుగంబు
మహితగుణశాలి రాయన మంత్రివరుఁడు, నిరుపమగుణోజ్జ్వలుం డగు నిమ్మఘనుఁడు.

క. ధనినిధిరాయనమంత్రికి, మానవతీమణికి నరసమాంబకు జననం
బైనారమిరువురమె యో, గానంగుఁడు నబ్బనార్యుఁ డనదఁగు సేమన్. 31

క నరసింహపాదభక్తుఁడ, నరసింహకృపాప్రసాదనయలబ్ధమతిన్
నరసింహార్పితహృదయుఁడ, నరసింహునికరుణఁజాలనమ్మినవాఁడన్. 32

వ ఇట్టి నాచేత విరచనీయంబగు నేతత్ప్రబంధ సామ్రాజ్యంబునకు మూర్ధాభిషిక్తుండగు మహానుభావుని ప్రభావంబు వర్ణించెద 33

సీ శ్రీవైష్ణవాలయశ్రేణులందుఁ జెలంగు ద్రావిడగ్రంథనాదములవలన
వరమహీసురయజ్ఞవాటికాంతరములఁ గోమగాదహోమధూమములవలన
విపణివీధులయందువినిహితంబైనట్టి ఘనధాన్యముఖపదార్థములవలన
నేలాలవంగతాంబూలవల్లీచందనముఖశోభితవనాంతములవలనఁ
గమలకైరవకల్హారకలితలలిత, విమలజలసాంద్రకాసారవితతివలన
భాసురంబగులక్ష్మీనివాసమగుచు, దివ్యతిరుపతిమంగళాప్రసిద్ధింబు 34

క. తిరుపతులునూటయెనిమిది, పురుషోత్తమశేషశైలములు మొదలుగ నా
తిరుపతులలోన మంగళ, గిరి విష్ణునిజస్థలంబు కేవలమరయన్ 35

మ జగదానందకరంబు మోక్షపదవీసోపానమార్గంబు యో
గిగణాంకర్ణగుహాంతరంబు శిఖిప్రక్రీడావినోదాలాస్యరో
మ్యగసేత్రాసుకగాంగులీచలితతంత్రీవాతవీణారవా
నుగుణాంచత్పికనాదమద్రి చెలువొందుగన్ మంగళాభిఖ్యతన్ 36

ఉ అమహనీయశైలశిఖరాగ్రమునం గునృసింహమూర్తి తే
జోమయదివ్యవక్త్రమునశోభిలుచున్ నిజభక్తకోటి శ్ర
ద్ధామతిఁజేయుపానకముఁదానెలమిన్ సగమారగించి తె
ల్పొమిగిలెమల్ గలింపఁగసగంబుఁ దగన్ దయసేయునారికిన్ 37

చ. గిరిదిగువన్ వినూత్నమణికీలితమండపమధ్యభాగభా
సురతరపీఠమందునతిసుందరమూర్తిధరించియిందిరా
తరుణియుఁదానునుండునిరతంబునృసింహుఁడుదివ్యహారనూ
పురకటకాంగుళీయకవిభూషణపుంజవిరాజమానుఁడై 38

తే. ఇట్టిమంగళగిరియందునెగువదిగువ, తిరుపతులనెంటిమధ్యప్రదేశమంగ
శంకరుఁడుసర్వమంగళాసహితుఁడగుచు, నుండునెప్పుడుసహవాసయోగ్యుఁడగుచు.

సీ కల్యాణసరసిలోఁ గదిసిమజ్జనమాడి ధౌతవస్త్రంబులందముగఁదాల్చి
కుధరాగ్రమెక్కి మార్కొండలక్ష్మీభజించి నరసింహునకువందనములు చేసి
మిరియంబు లేలకుల్ మెదిపిచక్కెరతోడఁ గలిపితియ్యనిపానకములు చేసి
స్వామికర్పించి శేషంబైనసగమును నక్షులకెల్లనుబంచిపెట్టి
నగముదిగివచ్చి శివదర్శనంబుచేసి, దిగువనరసింహునిందిరాదేవిఁ గొలిచి
భోగమోక్షంబులనుభవింపుదురుజనులు, సత్యమిదిమంగళాచలస్థలమునందు 40

సీ. వేంకటాచలమున వేసటనొందక యెలబుభుజింపఁగాఁబోడముదప్పి
శ్రీరంగమున నాసతీఅంగఁబొంగళ్లు భోజనంబొనరింపఁబోడముదప్పి
కాంచీపురంబులోఁ గాంతుకొద్దినిఁజేరి యిడ్డెనల్ భక్షింప నెసఁగుదప్పి
యళగిరిస్థలమునఁ నాపోవగాదోసె లారగించనఁబుట్టినట్టిదప్పి
యర్చకస్తోమహస్తశంఖాగ్రముక్త, లలితగుడజలధారాఘుళంఘుళాయ
మానపానీయమహిమచేనణఁచికొనుచు, జలజనాభుండుమంగళాచలమునందు. 41

ఉ. ముంగిటికల్పభూరుహము మూలధనంబు నివేశనంబులో
బంగరువాన చేతికగపడ్డతలంపులమానికంబుముం
గొంగుపసిండి భక్తులకుఁ గోర్కులపంట జగంబులందు మా
మంగళశైలవల్లభుసమం బగుదైవము లేదు చూడఁగన్ 42

## షష్ఠ్యంతములు.

క. ఈదృగ్విధకల్యాణగు, ణోదారప్రాభవునకునుద్యల్లీలా
సాదరకటాక్షవీక్షా, పాదితవిబుధేంద్రకమలభవవిభవునకున్. 43

క అతులితమతియుతనుతగుణ, యతికృతసుధ్యానగతనిరాకారునకున్
శ్రితకమలాసితకమలా, యతవిమలాంబకసుఖప్రదాకారునకున్ 44

క భూపాలంకారునకును, దోషాటఘటచ్ఛటామదోత్కటగజహృ
ద్భీషణకంఠీరవగళ, ఘోషితకృతిపాంచజన్యఘూంకారునకున్ 45

క. మందారకుందచందన, మందస్మితసుందరైకమందిరనయనా
నందవదనారవిందున, కుందామరసోద్భవాస్యకుముదేందునకున్ 46

క. పరసుగుణభక్తజనకృత, సరసగుణాంభోర్ధపానసౌఖ్యునకుశుభా
కరమంగళాచలస్థల, నరసింహాఖ్యునకుసద్గుణశ్లాఘ్యునకున్. 47

## కథాప్రారంభము.

వ. అంకితంబుగానేరచియింపంబూనిన యనిరుద్ధచరిత్రంబునకుఁ గథాప్రకారం బెట్టి దనిన ఖగనత్కథాసుధానుభవకుతూహలసాంద్రులగు శౌనకప్రముఖమునీంద్రులుసకల పురాణేతిహాసప్రసంగవచనచాతురివిఖ్యాతుండగు సూతునింగనుంగొని యిట్లనిరి.

చ. జలజభవాభవప్రముఖసంస్తవనీయవిశేషవిష్ణుని
ర్మలగుణకీర్తనామృతముమామకకర్ణరసాయనంబుగాఁ
బలుమఱునీవుదెల్పుటకుఁబాత్రులమైతిమిపూర్వపుణ్యముల్
ఫలితమునొందెనీవలనధన్యగుణాగ్రణిరౌమహర్షణీ 49

క అనిరుద్ధునిచారిత్రము, వినుటకుమాహృదయములువేడుకపొడమెన్
వినుపింపుసవిస్తరముగ, వినుతబుధవ్రాతినూతవినయోపేతా. 50

వ. అనిన విని యమ్మునీంద్రుల కతం డిట్లనియె 51

క. మీరడిగినసత్కథ వినఁ, గోరి పరిక్షిన్నృపాలపుంజరుఁ డడుగన్
గారుఁడు శుకయోగి సని, స్తారంబుగఁ దెలుపఁదలఁచి తా నిట్లనియెన్. 52

సీ. ప్రాకారగోపురప్రాసాదసద్మరాగప్రభాచుంబితగగనతలము
సంతతఫలపుష్పసాంద్రనానావిధోర్వీరుహాకలితశృంగారవనము
చంద్రకాంతోపలసోపానకలితశోభితజలపూర్ణవాపీవ్రజంబు
సరససౌందర్యలక్షణలక్షితాకారభామినీపురుషసౌభాగ్యకరము

తే. గంధసింధురసైంధవబంధురంబు, సారసారసరసకాసారవిసర
మంఘుజలనిధిపరిఖాసమావృతంబు, పుణ్యనిలయంబు ద్వారకాపురవరంబు 53

ఉ. లోకములన్నియుం దనవులోనుగనుండెఁగఁదన్నులోనుగాఁ
బైకొనెఁజక్రవాళమనిపావకసన్నిధిఁజాఁదిసంబుర
త్నాకరమానవగ్గిరితదావరణావృతిఁజేసినిల్పెరో
కాకయజుండుచుట్టునఁగాఁదగునద్ధిముగ ప్రమాపమై 54

మ. అల్లసుధాపయోధిపపురంతిరమా జనకాబ్ధియాంక హ్మ
ద్వల్లభురాజధానియగుద్వారకిఁ గోసుభియించ మందు సం
పల్లలితాంగియెప్పుడును బాయక పుట్టినయిల్లు న త్తిగా
రిల్లును నేకదేశమగునింతులవేడ్క సంగొ అంతయే. 55

మ. అలకాన్నత్యపురీపుంపుణరేఖాగ్రప్రదేశంబులం
గలయన్ గొమ్మసందులేర్పఱిచి మార్గశ్రేణిఁగల్పించుటన్
నలినీకైరవిణీమనోహరులయానంబుల్ నిరోధంబులే
కలఘుస్ఫూర్తిఁదదంతిరంబులఁబొసంగన్ నిర్గమించుంగదా 56

క. అగణితతారాగణచయ, గగనాంతము నిశలఁ దనరు ఘనలీలఁబురిన్
దగఁగోటకొనలఁగట్టిన, వగజిగిముత్యములచందువాచందమునన్. 57

సీ. సహచరీశంకాప్రసక్తామరీహూయమానకర్బురపుత్రికానుతములు
ఇనవాహహేషాప్రహేళితప్రతిబింబధారణతోడదర్పణములు
సామంతినిభ్రాంతిసల్లాపకృత్తారకామిళద్వప్రముక్తాఫలములు
దైవతపారావతప్రతిస్వనసంభ్రమప్రదవిటవిటీమణితోరణము

తే. లంబుజకదంబశాత్రవబింబమున్న, హరిణకబళితసుహనాతృణాంకురాయి
తస్ఫురద్గారుడోపలాతతవితర్ది, యూథములసౌధముఁ పురినొప్పుమీఱు 58

చ. ఉదయనగేంద్రమెక్కియినుఁడున్నతమైగగనంబుఁదాఁకు ద
త్సదమలహర్మ్యభూముల్గనిరథంబున కడ్డమునిల్చునంచుఁదా

మఱిఁదలపోసితిన్నఁగుమార్గమునంజనుఁడంతకంతకున్
జదలను నిక్కి యవ్వలనుసందిగిపోవుచునుండునిచ్చలున్ 59

మ. పగలున్ రేయిసమప్రకాశతనుజీనంజీనబంధుండు సొం
పగుముత్తెంబులచేరుచుక్కగమియున్ వ్యాళంబునన్ జేరు మ
క్కగుమింగూడియనేకరూపములతోఁగన్పట్టెనానొప్పగున్
నగరీహేమశిరోగృహాగ్రవిహరన్నారీముఖాంభోజముల్ 60

ఉ. నిర్మలభర్మభిత్తిమయనిర్మితవిస్ఫుటహర్మ్యసంచయాం
తర్మదనాహవశ్రమగతప్రమదారమణచ్ఛటాతనూ
ఘర్మనివారిణియైవినుతిఁగాంచునుపాంతనిలింపనిమ్నగా
హర్మ్యఖపద్మగంధవిభవానుభవాంచితగంధవాహముల్ 61

తే. మీఁదనున్నట్టికుంభసింహాదికములు, తారకామండలంబునఁ దగిలియుండఁ
జంద్రబింబంబునంటెనాసౌధచయములు, సురపురముమీఁదఁదనరుగోపురవిభాతి. 62

సీ. అతనిజన్మస్థానమగువిష్ణునాభికి నూర్ధ్వమౌముఖమున నుదయమైరి
అతఁడు నల్గొగముల నభ్యసించినయట్టి చదువేకముఖమునఁ జదువుకొనిరి
అతనిరాజసగుణస్థితికంటె నుత్తమంబగు సాత్వికమున శుద్ధాత్ములైరి
అతఁడు మున్ జిరతపోగతిఁగన్నహరినిభావితభక్తిపరదుఁగావించుకొనిరి

తే. పెద్దపిన్నతనంబురూపించుకొనిన, యధికనన్నచ్చహంసవాహనునికంటె
సకలసౌజన్యగుణసుధాసారనిధులు, భూసురేంద్రులు గలరు తత్పురమునందు. 63

సీ. సముదీర్ణచంద్రహాసకళావినోదముల్ ముఖములందునురణోన్ముఖములందు
ధర్మగుణానుసంధానతాచతురతల్ శయములందును హృదాశయములందు
బుధగురుచక్రావనధురీణచిహ్నంబు లాఖ్యలందునిజాన్వయాఖ్యలందుఁ
బ్రకటపంచాననప్రక్రియావిభవముల్ భటులందు విక్రమార్భటులయందు

తే. వెలయవెలయుదురనివార్యవీర్యశౌర్య, ధైర్యగాంభీర్యసముదికౌదార్యతుర్య
ధుర్యులైనట్టిబాహుజవర్యులెపుడు, సిరులఁజెలువొందునప్పురవరమునందు 64

సీ. తనలోనిరత్నసంతతులధోగతిఁగోలుపడుచుకోఁడేనిసాగరుఁడుసాటి
తనమూలధనముకుఁదగినలాభముఁగూర్చుకొనెనేనిధననాయకుండుసాటి
తనకున్నబంగారమునువక్కడకియ్యఁజాలినఁగాంచననాచలముసాటి
తనమహత్త్వమునకుఁదెనయైనభోగానుభవముంచెనేనిఁగల్పకముసాటి

తే. గానియితరులుతాదృశుల్ గారనంగ, నర్థసంపదతోడవిఖ్యాతసుకృత
సంపదలనంతములుగాఁగసంగ్రహించు, వైశ్యులుండుదురప్పురవరమునందు. 65

సీ. జన్మస్థలంబునిర్జరశిఖాకుసుమగంధావాసితంబైనవారిపదంబు
పైదోడుప్రకటధూర్జటిజటామకుటరంగదభంగనిజభంగగగనగంగ

ప్రారంభమఖిలవర్ణాశ్రమజనతిర్యగాదిజీవన మైనహాలికంబు
స్వాచారమిష్టకామ్యార్థసిద్ధిద మైనయనిరుద్ధమూర్తియభ్యర్చనంబు
బుద్ధిబ్రాహ్మణాళిభక్తియుభూతిదయయు, శాంతమునుగల్గిచెలువొందుసత్పథంబు
గాఁగసౌజన్యశీలురై కలిమిబలిమిఁ, గలిగిసుఖియింపుదురుశూద్రకులజాలంగు. 66

సీ. రంజితాధరసుధారససమేతంబులై ముఖచంద్రబింబముల్ ముద్దుగులుకఁ
నవతంసకుసుమతారావళీయుతములై కచభారతమసముల్ గిరిమఁజూపఁ
గమనీయమణిమాలికారుచిరాంచితములై కుచకుంభశైలముల్ కొమరుమిగులఁ
గంకణేంద్రోపలాంకమిళిందచణములై పాణిపద్మంబులుపరిఢవిల్లఁ
గలితమోహనరూపరేఖావిలాస, విభ్రమంబులుజగమెల్లవినుతిసేయ
నతులగతివారశృంగారవతులువేన, వేలువిహరింతురెప్పుడునవ్వీటియందు 67

సీ. పలువరుసలకుందములఁజూడఁబ్రియమయ్యె వెలయింపుసొంపునఁబలుకఁగదవె
నగఁజూపునల్లగల్వలవినోదముతోనె వలపుపుట్టించెనవ్వారిగాఁగ
మేలుచేఁదమ్మిక్రొమ్మిన్నలుగులెక్కుడు సూరిచిదయసేయుపేరుగాఁగఁ
చెంబొంచెనాసనంపెఁగనిగన్నిగలచే ముద్దియవేఁడెదమొగినొసంగు
మనుచునచుముదంబుననంటిపలుకు, జాణలవచశ్చమత్కృతిసరణిఁదెలిసి
తెలివిఁజిఱునవ్వులొలయంగనలరియుంటు, లమ్ముగురుపుష్పలావికలప్పురమున. 68

మ. పటుదంతప్రచురప్రభాప్రకటశంపాజాలముల్ ఘీంకృతా
స్ఫుటగర్జారవముల్ సమగ్రమదధారాసారవర్షంబులు
త్కటధాటీనటియింపభూవిహరణోద్యత్ప్రావృషేణ్యాంబు[illegible]
త్కృటిమన్ దత్పుటభేదనద్విపదయూథంబొప్పునక్రోధమై 69

మ. పురసీమన్ బుధపోత్తమానువహనస్ఫూర్తిన్ విడంబించుమున్
సిరికిన్ మూలములై సుజీవనకరాస్నిగ్ధంబులై సుందర
స్ఫురితావర్తములై విలాఘుతివనొప్పున్ వాహినిసంగతిన్
దెరమైసార్థకనామధేయగుణభాతిన్ సైంధవవ్రాతముల్. 70

చ. అలఘునిజస్వజాంచితపటాంచలజాతసమీరవారితా
మలగగనస్థలీయుతవిమానవిహారినిలింపదంపతీ
సులలితపంచబాణరసనంజలితోగుపరిస్రమఁబులై
యలరుఁబురిన్ శతాంగములుదగ్రవిరోధిచమూవిభంగముల్. 71

ఉ. బాహుబలోద్ధతుల్ సమరభాగనటద్రిపుచాతురంగిక
వ్యూహవిభేదనక్రమసముజ్జ్వలవిక్రమవిస్ఫురన్మహా
సాహసికుల్ ధనుఃప్రముఖసాధనధారణకౌశలుల్ సము
త్సాహరసాకృతుల్ సుభటసంఘము స్ఫురసుందసంఖ్యముల్ 72

వ. మఱియు నన్నగరీలలామంబు వైకుంఠపురంబునుంబోలె నాగనగరంబువిధంబున ననంతకల్యాణగుణాభిరామంబై, నభోమండలంబు తెఱంగున సుకవికల్పితప్రబంధంబుచాడ్పునఁ గలితకవిరాజవిరాజితంబై, చంద్రబింబంబుపోలికఁ గుముదమిత్రభ్రమంబులీల విరాజమానసాగరంబై, యలకాపురంబుభాతి జలజాకరంబురీతిఁ బద్మాలంకృతంబై, యధ్యయనవిద్యావిశేషంబుకైవడి సంగీతశాస్త్రాకరంబుచెలువున వర్ణక్రమప్రశస్తంబై, రామాయణకావ్యంబుగతి భార్గవాంశంబుకరణి రామాభిరామంబై, మిత్రభావప్రకాశంబయ్యును గువలయానందంబై, రాజాభ్యుదయంబయ్యును గమలాంచితంబై, హరివిహారంబయ్యును బుణ్యజనరంజనంబై, విబుధావిరాజితంబయ్యును సమస్తగోత్రప్రచారంబై, గురుప్రదీప్తంబయ్యును గవిహితంబై, సంపదలకుం గోటారును, సౌభాగ్యంబులకుఁ బుట్టినిల్లును, సౌఖ్యంబులకు నాలవాలంబును, సారస్యంబులకుఁ గాణాచియు, సంతోషంబునకు నాటపట్టును నై వసుంధరాసుందరీలలాటతటసంఘటితముక్తాలలామంబుపోలికఁ జతుర్ముఖనిర్మితప్రపంచాభరణంబై యొప్పుచుండు 73

ఉ. ఆపురలక్ష్మికిన్ రమణుఁడై విలసిల్లుచునుండు బ్రహ్మలీ
లాపరిపూర్ణమానుషవిలాసుఁడు భక్తగృహాంతదృశ్య ని
క్షేపము రూపమోహనవశీకృతగోపవధూకదంబుఁడు
దీపితకీర్తిశాలి వసుదేవతనూజుఁడు కృష్ణుఁ డున్నతిన్ 74

సీ. ఏలీల దేవకీవసుదేవులకుఁ బుట్టి నందయశోదలున్నతిగఁ బెనుపఁ
బెరిగి దైతేయులఁ బెక్కండ్ర వధియించి యమునానదీతీరమందమంద
బృందావనక్రీడఁ బెంపొందగోవులఁ బాలించి మురళీవిలోలుఁ డగుచు
పల్లవకాంతల నలరించుచు రమించి భక్తజనావనప్రౌఢిమెఱసి
రుక్మిణీసత్యలాదిగా రూపవతులఁ, జాలఁ బెండ్లాడి సంసారసౌఖ్యనిరతి
నెలమిఁ ద్రిభువనసామ్రాజ్య మేలుచుండెఁ, గృష్ణుఁ డంచితకీర్తివర్ధిష్ణుఁ డగుచు 75

మ. హరికిన్ రుక్మిణికిన్ దనూభవుఁడు మీనాంకుండు లోకైకసుం
దరలీలాసుకుమారమూర్తి రతికాంతాపద్మరాగోపమా
ధరసారామృతపానకేళిరతుఁ డుద్యద్విక్రమాటోపశం
బరసంహారుఁడు దాత్తకీర్తి నమరున్ బ్రద్యుమ్ననామాంకుఁడై. 76

ఉ. ఆతనివల్లభుండును శుభాంగి యనందగు రుక్మికూఁతు నం
భోరుహనేత్రఁ గూడి కులభూషణుఁ డైనకుమారుఁ గాంచె శృం
గారరసంబు విగ్రహము గా నొనరించినమాడ్కి నొప్పు నొ
య్యారము వానిభాగ్యవిభవాదికలక్షణలక్షితాంగునిన్ 77

క. అనిరుద్ధనామధేయుం, డనిరుద్ధవిముఖ్యకేతనిసరివీరులు డా
యనిరుద్ధతులన్ జేసెడి, యనిరుద్ధస్ఫుటపరాక్రమాఢ్యుం డగుటన్ 78

వ. మఱియు బ్రహ్మజ్ఞానసూచనాసమర్థుండు గాఁగలవాఁడని బ్రహ్మనామకుండును, ఋశ్యమృగచిహ్నితకేతుండు గాఁగలుగుటం జేసి ఋశ్యకేతుండునునని గురుజనంబులు నామనిర్దేశంబు చేసి రక్షఁ గుమారుండు శరత్సమయ శుక్లపక్షసుధాకరుచందంబున నహరహఃప్రవర్ధమానుండై క్రమంబున జననీజనకమనోరథసాఫల్యంబైన బాల్యంబును స్వబంధుజనమనానందకరసుకుమారంబైన కౌమారంబును నతిక్రమించిన యనంతరంబ

సీ. ముఖచంద్రమండలంబునకు నూనూఁగుమీసపుఁ జాలు సహజలాంఛనము గాఁగ
నమరువక్షోరక వాటమునకు నేవళంబులు పొందనపుఁ డీఁగె మోడి గాఁగఁ
జెక్కుటద్దములకుఁ జెలువంబు మీఱిన చిఱునవ్వు తేఁటక్రొంజికిలి గాఁగ
సరసమౌక్తికచయరదంబునకు నవతరంగదీధితతటిద్వల్లి గాఁగ

తే. నలజయంతుని చందంబు నలుని సొబగుఁ, జందురుని మేలుఁ గందర్పు చక్కఁదనముఁ
దనకు సరిసేయఁదగిన సౌందర్యమహిమ, నతఁడు చెలువారె నవయౌవనాగమమున. 80

సీ. కనుమెఱుంగులు తళుక్కున నేమఱించు చూపులకు గుండియలు జల్లు జల్లుమనంగి
నగుదుగా నాభిముఖ్యమునొందు మోముకు వాలుకన్గవలు దక్కొలుపడఁగ
జెలికాంత్రతో నాడుపలుకుల చేపీన లాగివశ్యమంత్రప్రయోగమందఁ
బ్రతిలేని రూపసంపదఁ జిక్కి తలఁపులు సుడివడ్డ గతిఁ జుట్టి చుట్టి తిరుగ

తే. నందుకొనరాని ప్రాపిపం డైన యతని, ప్రభుతచేనూర్పులూష్మదీర్ఘతవహింపఁ
గొలువునకువచ్చు వారకన్యలక యోగ, విరహమొదవించెఁ దద్రూపవిభ్రమంబు 81

తే. వాలుఁజూపుల చేతిని వాలులోసఁగి, ప్రమదజలములనర్ఘ్యదానములొనర్చి
యొలముభావంబులుపహారముగఁ జేసి, వనితలు భజింతురిష్టదైవముగనతని 82

ము. తరుణుల్ వాని విలాససంపదకు నాంతర్యంబునం జొక్కి తత్
త్పరిరంభానుభవంబుఁ గోరుచు విధాతా వీని మజ్జీవితే
శ్వరుగా నేటికిఁ జేయవైతివను మర్మసంతాపముం జెంగును
స్స్మరుగాడ్పుల్ విధికంగ దాహమొదవించున్ మండువేసంగియై. 83

ఉ. బింబము మోవిసంప్రతిబింబము కంఠము తారకాధిరా
డ్బింబము మోము సన్మురబింబములాదరహాసపుంగపో
లంబులు యక్షనందనకళానిధిముఖ్యులఁ జూతుమేక దా
శంబరవైరినందను నిసామ్యము గాంచియింపఁ బోలునే 84

ఉ. సాహసధైర్యబాహుబలసంపదచేఁ జెలువొందువాహనా
రోహణహేతిధారణనియోగ్యదనర్చినచోఁ విభూతిశో
భాహితకీర్తిఁ జెలంగిజగదాదరణీయగుణాభిరాముఁడై
యాహరిపౌత్త్రుఁ డొప్పెఁ దనయభ్యుదయంబు సదాభివృద్ధిగాన్. 85

వ. అంత. 86

వ. అని శుభలేఖ లంత విని హర్షము మానసమున నంకురించ గ్ర
క్కున బ్రతిలేఖ లంపి యనుకూలపు లగ్నము నిశ్చయించి య
య్యనబలకృష్ణముఖ్యులు రయంబున హృచ్చతురంగయుక్తులై
యనుపమవాద్యఘోషము దిగంతములందు బ్రపూరితంబుగాన్ 97

సీ కుండినపురికి నేగుటయు వైదర్భు లెదురేగి నివారలఁ దోడి తెచ్చి
విడుదల విడియించి వివిధవస్తువ్రాతసామగ్రి నడపించి సంభ్రమమున
లగ్న వేళకు మంగళస్నానయుతులైన పెండ్లికుమారకుఁ బెండ్లికొడుకు
కెలమితో బాసికంబులు గట్టి కంకణబంధముల్ గావించి ప్రాజ్ఞులైన
తే విప్రముఖ్యులు ఖండోక్తవేదరవము, చెలఁగ నుచితప్రయోగముల్ సేయుచుండి
రప్పుడు తెరవట్టి చాటునకతివఁ దోడి, తెచ్చిరి పదాంగదధ్వనుల్ చెలఁగ 98

చ విచికిలగంధియున్ విభుఁడు వేడుకతోఁ దెరరెండువైపులన్
రుచిరకటాక్షసంతతుల మెఱుంగులు నిండఁగ నిల్చిరయ్యెడన్
బ్రచురరతానురాగరసబంధురతం దెరచీరదూతి పా
యుచు హృదయాబ్జముల్ మొగిని మెఱుంగని చుట్టరికంబు సేయఁగాన్. 99

క గ్రక్కునఁ దెర వాపుటయుఁ ద, ళుక్కున వెలుఁగొందె మృగవిలోచనముఖస
మ్యక్కాంతి మెయిలు దొలఁగినఁ, జక్కఁగఁ జెలువొందు పూర్ణచంద్రుండనఁగన్

ఉ బంగరుపళ్లెరంబున సుగ్రాఢిగనించిన ముత్తియంబులు
పొంగు మహాస్తయుగ్మములఁ బూర్ణముగాఁ బలుమాఱు ముంచుచున్
రంగుగ నొక్క రొక్కరి శిరంబుపయిం దలఁబ్రాలు వోసిర
య్యంగి మరేచివన్యమణులై దిగుపాఱఁగ నవ్వధూవరుల్ 101

క ఈవిధ్యమునను ... శాస్త్రము, గావించి వివాహవేదికాస్థలమునకున్
రావించి గృహ...ంచను, హోవాద్యధ్వనులు బహుళమై మొరయంగన్. 102

క చెలిపాదము చెలువుఁడు కర, జలజంబునఁ బట్టి నడపె సప్తపదంబుల్
... లయిలు నదీర్చి నాఁటికి, యలవడునని వావి యైన యతివలు నవ్వన్ 103

వ తదనంతరంబ ప్రధాన హోమాదికంబులైన వైదికలౌకికప్రయోజనంబులు నడిపె వివి
ధవి... భక్ష్యభోజ్యాదిపదార్థంబుల సకలజనసంతోషంబుగా భోజనోత్సవంబు గావించి
రందు 104

మ పరమాన్నంబులుఁ బిండివంటలు నుపాపంబుల్ గమాయించు పం
డ్లగసంబుల్ మధురామ్లశాకములు బెల్లం బాజ్యమున్ దేనె క
ప్పురపుం దోయము మీఁగడల్ పెరుగులుం బ్లంగాయలున్ ముస్సుగాఁ
బరిపూర్ణంబుగ నారగించి రనువొప్పం బెండ్లివారందఱున్. 105

సీ చెలిపయోధరకుంభములు దాఁచుకొన నేల ఘనమయ్యెఁ దృష్ణ చేకొనఁగ నిమ్ము
లతకూన మధురలీలాఫలరసంబులు చాల నభిలాషఁ బొడమఁ జేసె

నలివేణి నీచేతి యతిరసరుచిరస జ్ఞానందమయ్యె నేమనఁగవచ్చు
రాకేందుముఖి విను మాకారమంతచక్కని దెన్నఁడేలుఁగ ముకన్నులాన
యనుచుభోజనసమయంబులం దుభాష, గర్భితములాడు సరసులకాంతలొల్లి
ననుభవింపుఁడు కొదవలేదని సమర్చ్య, యస్త్రులై భోనకత్తెలు భక్ష్యులిడిరి 106

శా. తాంబూలంబులు వారికేళికదళీ ద్రాక్షాదినానాఫలా
ఘుంబుల్ చంపక మల్లికాదిసుమనఃకస్తూరికాగంధసా
రంబుల్ శర్కరలిక్షుఖండములు వస్త్రంబుల్ సువర్ణంబు నె
య్యంబేపారఁగఁ బంచిపెట్టిరి జనం బానందమున్ బొందగాన్ 107

వ. ఇవ్విధంబున 108

భుజంగప్రయాతము

వివాహప్రయత్నంబు విధ్యుక్తరీతిన్, నివర్తించి ప్రోద్యాబ్జనేత్రల్ నిషేకో
త్సవారంభమున్ బ్రేమసంధిల్లఁ జేయన్, నవోద్గారతుల్ మోహనంబై చెలంగన్. 109

తే. గంధమాల్యాదివాసనల్ గ్రమ్ముకొనఁగఁ, దోడుకొని వచ్చిరప్పుడాతోయజాక్షి
సరసుఁడున్నట్టికేళికాసదనమునకు, బలిమిచే నేర్పుచే తనుబద్ధముఖులు. 110

ఉ. ఎవ్వరికో సమీపగలకేమియుఁ గన్బదమంచు నెచ్చెలుల్
నవ్వుచుఁ ద్రోచిపోవుటయు నాథుని చెంగట నిల్చియుండెఁ బా
లివ్వలనవ్వలన్ దొలఁగనియ్యక మన్మథుఁ డానవెట్టి న
ట్లవ్వనజాక్షి సిగ్గుబరువానినరీతి శిరంబు వాంచుచున్ 111

ఉ. శయ్యకుఁ జేరఁ దీసి పతి సారెకు వేఁడఁగ నించుకైన మో
మియ్యక గుబ్బలంటుకొననియ్యక నిష్ఠురతిన్ గమింపఁగా
నియ్యకరొంతసేపెనలయించి నపిష్మట సౌఖ్యదాయకం
బయ్యె నునారికేళఫలపాకము లోఁగదకన్యకారతుల్ 112

తే. విభుని లమకంబుతో నిట్లు వెలఁది సిగ్గు, పోరుపెల్లనువట్టియా స్వైరమయ్యెఁ
దుదనిలుపలేక నొందులు దూటియుండెఁ, గానన బలాత్క్రియమున భంగము ఘటించు

వ. తదనంతరంబ 114

సీ. అధికప్రయత్నసంశిథిలనీవీబంధమాభిముఖకుంచితాస్యాంబుజాత
మాలస్యకరగృహీతాంచితకుచకుంభమనురాగరసనిగూఢాంతరంగ
మాయాసలబ్ధబాహాలతాపరిరంభమాకుంచితభ్రూయుగాభిరామ
మామోదబాష్పధారాపూరితాంబకమలఘుసీత్కారమోహననినాద

తే. మచిరసంభూతమదనతోయప్రవాహ, మవగతోష్ణాంగజాతఘర్మాంబుకలిక
మాత్మపరవశజనితనిద్రాభిలాష, మగుచు నయ్యింతి ప్రథమసమాగమంబు. 115

క. ఆమోదంబొనరింపఁగ, నామోదము విరియుఁబోలె నైక్యస్థితితో
దామోదరపౌత్రుఁడును, ప్రేమోదయహృదయుఁడగుచుఁ బెనఁగెన్ రతులన్. 116

వ. తదనంతరంబ యాదవసమూహంబు బహువిధానుకూలంబు లొనర్చి కతిపయప్రయాణంబుల
ద్వారవతీపురంబు నప్పంజని యథోచితసుఖంబులనుభవించుచుండి యయ్యనిరుద్ధుండును

చ. విలసితలగ్నవేళఁ గడువేడుకతో గృహప్రవేశ మిం
పలరఁగఁ జేసి యవ్వనవిహారనఁ గూడి యతండు ప్రేమచే
సులలితకేళికావనులసారసరోవరంబులం
జెలువగు రత్నగేహములఁ జిత్తము రంజిలఁగా రమించుచున్. 118

సీ. కేళనంటఁగఁ గానిగిలిగింతచేమాఱు పెనఁగుటలో కొన్ని దినములందు
నేమిచేసినఁగాని హితముచేసుక సన్నుతించుటలో కొన్ని దినములందుఁ
జవుసీతిబంధవిశ్రాంతిమార్గములన్ని దెలిసి చూడుట కొన్ని దినములందుఁ
దానపైకొని సురతప్రౌఢిఁ దమిగొని పెనయుటలో కొన్ని దినములందు
నగుచు నారుక్మనయ నాసమానమంబు, తనమనంబునకెంతకెంతకుఁ బ్రమోద
రసముకొలుపంగ గాఢానురక్తిమెంగె, రసికశేఖరుఁ డారతిరాజసుతుఁడు 119

వ. అని శుకుండు పలికిన ననినం బ్రమోదహృదయులై శౌనకాదులు సూతుం గనుంగొని
యయ్యనిరుద్ధుని విహారంబెవ్విధంబున నుండె నటమీఁద టివృత్తాంతంబుఁ దేఁట
పఱుపుమనుటయు 120

చ. వరవరదానశీలమదవారణవారణకృజ్జలాటభీ
కరకరచక్రజన్మలయకారణకారణనైజలీలసా
దరదరహాసదుష్టరిపుదారుణదారుణకోటితేజభూ
ధరధరయుగ్మసాగరసుతానవతానవభోగసంగమా 121

క. నిలయీకృతవైకుంఠా, బలవద్రిపుభయదశౌర్యపటుతాకుంఠా
కలితరుచికంబుకంఠా, సలలితలక్ష్మీప్రసంగజనితోత్కంఠా. 122

మాలిని. మునిహృదయనివేశా మోక్షదానప్రకాశా
వినుతగగనకేశా వీతసంసారపాశా
పనయమునిజనిదేశా చారుశేషప్రదేశా
మనుజచరవినాశా మంగళాద్రిస్థలేశా 123

గద్య. ఇది శ్రీమంగళాచలనృసింహకృపాప్రసాదసంప్రాప్తవిద్యావైభవ కనుపర్తిరా
యనమంత్రితనూభవసుజనహితకృత్యనిత్య యబ్బయామాత్యప్రణీతంబైన యని
రుద్ధచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

శ్రీరస్తు

# అనిరుద్ధచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

---



శ్రీరమణీహృదయంగమ
చారుతరశ్యామలాంగ సముదంచితధామ
ధీరకటకాంగుళీయక
హారాంగదవలయమంగళాచలనిలయా. 1

తే॥ అవధరింపుము శౌనకుండాదియైన, మునివరేణ్యులతోడ నిట్లనియె సూతుఁ
డా పరీక్షిన్మహారాజు నాదరమునఁ, జూచి విజ్ఞాననిధియైన శుకుఁడు పలికె 2

మ॥ పరిఖాగాధకబంధసంవృతమహాప్రాకారభాగంబు గో
పురకంఠీరవరూపపాటవపరాభూతేంద్రనాగంబు భా
సురవిస్తారమణిప్రకీర్ణకిరణాంశువ్యాప్తదిఙ్మండలం
బరిసంత్రాసకరంబు శోణపుర మొప్పారున్ ధరామండలిన్. 3

శా॥ బాణుం డుద్ధతసత్త్వనిర్జితజగత్ప్రాణుండు సాతత్యశ
ర్వాణీవల్లభపాదపద్మభజనారంభప్రవీణుండు గీ
ర్వాణవ్రాతమనోభయంకరధనుర్బాణుండు సంగ్రామపా
రీణుం డప్పుర మేలు మంచు విజయశ్రీనిర్భరాక్షీణుఁడై. 4

తే॥ తనసహస్రభుజాబలోద్ధత్యమహిమ, నేఁచి ముల్లోకములయందు నెదురులేక
బలితనూభవుఁడైనయబ్బాణదైత్యుఁ, డుగ్రశాసనుఁడై యుండి యొక్కనాఁడు. 5

వ॥ భవానీమనోహరుండగు హరుండు సంతుష్టాంతరంగుండై ముఖరితమృదంగంబును, రణితోపాంగంబును, సంగీతప్రసంగంబును, బరితోషితాశేషభూతాంతరంగంబును నగు నృత్యరంగంబున దక్షప్రాణాత్మకంబును, మూర్తిత్రయకారణ్యంబును, లఘుగురుప్లుతసమేతంబును, దత్తకధికతకఝుఝుశబ్దబంధురంబు నగు గ్రహయుత్యాదిక ఝంపాత్రిపుటాటతాళైకతాళసింహనందనచంచుపుటాదితాళంబుల చలువలు కడకట్టు మురికలు సికల ద్రుతమధ్యవిళంబకాలపరిమాణంబుల దండలాసకవందలిప్రేరణీప్రముఖమార్గంబుల రంగరక్తులు సహింప నాట్యంబు సలుపు నవసరంబున భక్తికధురీణుండగు బాణుం డావజం బారజంబున నం బుచ్చుకొని శ్రుతిప్రమాణంబు నిలిపి తకధిమికిట శబ్దాక్షరసముచ్చారితముఖుండగుచుఁ గరప్రహారంబులఁ జిత్రవిచిత్రంబులై చెలంగు తాళవ్యాప్తులు ఘుమంఘుమాయమానంబై నాదబ్రహ్మంబు జనియింప హృదయారవిం

దంబున కానందసంపాదకంబై తెఱయ మెఱయించిన యప్పరమేశ్వరు నాట్యంబు
జగన్మోహనంబై ప్రవర్తిల్లెనప్పుడు. 6

ఉ. బాణుని వాద్యవిద్యకు ననపారముదంబునఁ బొంది శాంకరీ
ప్రాణవిభుండు మెచ్చి తిదయన్ వరమిచ్చెద వేఁడుమన్న గీ
ర్వాణవిరోధి నానగిరివాకిటఁ బారిషదాళి గొల్వ శ
ర్వాణియు నీవు భక్తజనవత్సల కావలియుంట వేడ్కపన్ 7

తే. అనుచు మ్రొక్కిన నగరుణించి సాంబశివుఁడు, దానవేంద్రుని పట్టణద్వారమున ను
గాపురంబుండె నిది లఘుకార్యమనక, యెంత సుభుండు పార్వతీకాంతుఁడహహ 8

తే. ఏమహాత్ముని మహిమ బ్రహ్మేంద్రముఖ్యు, లెఱుఁగఁగాఁ జాలరట్టి సర్వేశ్వరుండు
నిజపురద్వారపాలుఁడై నిలువ మెలఁగె, నౌర వానిది గాక భాగ్యాతిశయము 9

లఘుస్రగ్ధర. ఆలింబూర్వదేవుండతులదశశతోదగ్రదోర్దండహేతి
జ్వాలాదందహ్యమానస్వరధిపశిఖివైవస్వతక్రవ్యభుక్కీ
లాలాపత్యక్షదదిక్పాలకగణహృదయశ్లాఘ్యవైక్రమ్యలబ్ధ
త్రైలోక్యప్రాభవుండై తినరభువనసాధారణస్ఫూర్తితోడన్. 10

క. సురవైరమతియుఁ గొన్నాళ్లు, తెలుఁగఁగ నొకనాఁడు మదనహరుఁ బొడగని త
చ్చరణమున కనతిభక్తిం, బరిణతులొనరించి వినయభాషాపరుఁడై 11

మ. గిరిజామానసహంసహంసనరయోగిధ్యేయచిద్రూపరూ
పరుచిశ్రీజితముక్తముక్తిభుజదర్పవ్యాఘ్రదైత్యేంద్రయిం
ద్రరమావల్లభమిత్రమిత్రరజనీరాట్చక్రచక్రాబ్జసుం
దరరేఖాకరపద్మపద్మశరభానాశంకరాశంకరా 12

వ. అని బహుప్రకారంబుల స్తోత్రంబు గావించి యిట్లనియె. 13

క. లోకములెల్ల జయించితి, సౌకర్యము గాఁగ సకలసౌభాగ్యంబుల్
చేకొంటిఁ గీర్తి నొందితి, నీకారుణ్యమునఁ జేసి నీలగ్రీవా 14

ఉ. ఆహవభూమి మామక సహస్రభుజాబలతీవ్రధాటికిన్
సాహసలీలతో నెదిరి శౌర్యముఁ జూపఁగఁ జాలినట్టియ
వ్యాహతవిక్రమాఢ్యుఁడొకఁడైన లేఁడొక నీవు దక్క హా
లాహలలాంఛనాంచితగౌరిరంభిలసర్వమంగళా. 15

ఉ. అంతవైరివీరసముదగ్రకరోగ్రధృతిహేతిభూతసం
ఘాతవిముక్తరక్తజలకాంతులు కెంకుపద్మరాగసం
జాతముగిమలంగయసంగరకేళిఘటింపఁ జేసినా
చేతులతీఁట కొంతశమము సేయఁగ దేరజతాద్రియుండిరా 16

వ. అని ప్రార్థించుచున్న యద్దోషాచరుభాషణంబులకు రోషించి శేషభూషణుండిట్లనియె.

క. నాయంత వానితోనని, సేయంగలిగెడు నీదు చేతులపురుల్

జాయుభవదీయకేతన, మేయెడఁ ధరగూలునపుడు హీనవివేకా 18

వ. నిర్విచారుండవై యుండుము పొమ్మని యానతిచ్చిన బలినందనుండు డెందంబున నానందంబు
నొందుచు నందివాహనునకు దండవందనంబు లాచరించి మరలి నిజమందిరంబునకే తెం
చి యాత్మీయ శ్రేయోహానిహేతుభూతంబైన కేతుపాతంబున కెదురుచూచుచు నీచాః
కలహమిచ్ఛంతి యనువచనంబునకు నగ్రసాక్షియై యుండె నంత 19

ఆ. అతనికూర్మికూఁతు రందంపుబిత్తరి, ముద్దుగుమ్మ భువనమోహనాంగి
కుందనంపుబొమ్మ కుసుమకోమలి యుషా, కన్యయనఁగ నొప్పు కపుతనయన 20

ఉ. ముద్దులమాటలుం జిఱుతమోమున నున్న నిలేఁత చెక్కులుం
గొద్దిగ నున్న వెన్నడుము గోఁకటి కందక ఫాలపట్టికం
విద్దెము సేయు ముంగురులు విప్పగు కెంపుల గొప్ప కన్నులుం
బ్రొద్దొక వింతయై యమరుఁ బుష్పసుగంధికి బాల్యవేళలం 21

సీ. అరవిందములు మన్మథాస్త్రంబులైనట్లు వాలుఁగన్నొనలఁ గ్రొవ్వాఁడి పొడమె
హరినీలములు పేరులైన చందమున నించుకలైన కురులు పెం సోగలయ్యె
వీణాశ్రుతులు మేళవింపైనవగ ముద్దులలుకులు ప్రౌఢసంపద వహించెఁ
గనకంపుఁగణిక కుందనమైన రీతిఁ జాయలమేను నిండు తేపల వహించె

తే. నిమ్మపూపలు ముదిరి ఫలమ్ములైన, గతిఁ జనుమొగ్గ నిగిడి పొంకము వహించె
బంధుజీవాధర యతీతబాల్య యగుచు, నిండుజవ్వనమున నొప్పుచుండునపుడు. 22

మ. కలవాక్కీరహయంబు గన్నమకరీకస్తూరికాపత్రస
ల్లలితాంకంబు నితంబబింబపటు లీలాచక్రమాలోకనాం
చలబాణౌఘము భూలతాయుగ మహాచాపంబునై శోభిలం
జలజాతాననవిగ్రహంబు గతి రాజస్యందనప్రక్రియం. 23

ఉ. తేనియలొల్కు మోవియును దియ్యనిమాటలుఁ బువ్వునంటి సె
మ్మేనును ముద్దుఁ జెక్కులును మెచ్చులుఁ గుల్కెడు గుబ్బచన్నులుం
మీనులఁబంటి కన్నులును మిక్కిలియైన పిఱుంగు సన్నపుం
గౌను నొయారపున్నడపుఁ గల్గి వెలుంగు మనోహరాంగియై 24

తే. ఒలపుగుబ్బచంగుబనిచంది మోము మోము, నలరు చైత్రాలలిలఁ [illegible] నాగు
వరిమళీఖుగుబ్బకెంపురంపుఁ [illegible], కలికిరాపులు [illegible] 25

సీ. ఘనసారమును సారఘనము నాక్షేపించుఁ గలికిపల్కులయింపు కెమ్మొవింపు
పద్మరాగము రాగపద్మము నదలించు రమణంపుమోవి పాదములరీవి
మృగమదంబును మదమృగమును హసియించుఁ గొమ్ముఁ పునలపుకన్దోయి మొలఁపు
వరనాగమును నాందవరముఁ జుల్కఁగఁ జేయునవకంపునూఁగారునడపు తీరు

చక్రసామ్యతవెలయుకుచంబులందు, సామ్యచక్రతఁదగువుక్కసప్పుఁబిఱుఁదు
రూఢినారోహిణియునవరోహిణియుఁగ, నెలతచెలువంబుసారెవర్ణింపఁదగును 26

చ మలయజగంధిబిత్తరపుమాటలుపీనులుసోఁకినంతనే
చిలుకలుపల్కినట్లువిలసిల్లునసంతపువేళఁగోవెలల్
చెలఁగినయట్లుకిన్నరలుచిత్రవిధంబునమీటినట్లువీ
ణెలు మొరయించినట్లుమదినిండుఁబ్రమోదరసప్రవాహముల్ 27

ఆ. ఇరులుసిరులుదొరలుకురులఁతియ్యఁదనంపుఁ, దీవిరీవితావికావిమోవి
కులుకుపలుకులొలుకుపలుకుమెలఁకువనసుమచాపు, తూపురూపుమాపుచూపుకోపు 28

చ కొలుకులకెంపుసొంపురహిఁగుల్కెడుతారలనీలిమంబుక
న్బెళుకుమెఱుంగులుంగలసిపెంపమరెన్ హరిణాక్షిచూపు
వ్వలదొరముజ్జగంబుగెలువన్ నవచూతదళంబుమేచకో
త్పలమరవిందమొక్క మొగిఁబట్టిప్రయోగముసేయుకైవడిన్ 29

సీ మునుకారునునుకారుకొనిమీఱుఘనచారుతనుమారుకొనికెరుఁదగుణికురులు
నలకుందముకులయందములచందములుముదములఁనొందఁగాఁజేయుఁజెలిరదాళి
తెగరానివగమేనితొగరేనిజిగిఁబూనితగుదానిసొగసైననగుమొగంబు
నెలపెంపువెలయింపుకళగుంపుకులికింపుబలుదింపుఁదలఁపెంపుఁబణఁతిమోవి

తే సింగములభంగములనొందఁజేయునడుము, కీరములదూరములదొలఁగించుబలుకు
జక్కవలఁదక్కువలఁజేయుఁజన్నుదోయి, ముదితరూపంబుత్రిభువనమోహనంబు

సీ ఇంపుసొంపులప్రస్ఫురింపుమాటలువీణపలుకులకుకత్తురాభ్యాసమొసఁగు
మందంపునడపులుమాయూరగతులకుఁబాఠమాఱుతెన్నొనిఘనశితిఁజూపు
సరసంపునాసికసంపెంగమొగ్గలకెక్కువతక్కువల్ చక్కదిద్దుఁ
జొక్కంపుగుబ్బలుజక్కవకవలకుదిట్టలైనంబుపదేశమిచ్చు

తే. హొంతబాడుటవనవిహారోత్సవంబు, సలుపుటయుఁబుష్పవితతివాసనలుగొనుట
నెఱసరసిఁగ్రీడలాడుటనెపములుగను, నతనిసౌందర్యమింకనేమనివచింతు. 31

క ఇటువంటియానయావంబుల, నిటువంటివిలాసవతులనెననేయఁగరా
నటునంటివగనురజన, విటువంటిమొగంబుగలిగివెలఁదుకయొప్పెన్ 32

ఉ. మేరువునెక్కుదేవిస్వరమేళకరానిషిద్ధతిలంబుభాం
డారముకోవాళియువ్యాకము రివిగిఁ గావ్యమునాటకంబులం
కామశాస్త్రముల్ మొదలుగామతియభ్యసనంబొనర్చెశ్రీం
గారపువిద్యలద్దనుజకన్యకపన్ బరమానురక్తయై 33

ఆ. ఆడఁబాడనేర్చియభినయింపఁగనేర్చి, సరసకవితచెప్పఁజదువనేర్చి
బాణదనుజపుత్రిబాలికయయ్యును, సకలకళలయందుజాణయయ్యె 34

చ పలుమఱు నీవు పంటఁ బగఁ బట్టినకైవడి నిట్లు మొల్ల మొ
గ్గలు చిదుమంగ నేల కసుగందని యీచిగురాకు లెల్లఁ జే
తులకసిదీఱఁ గోఁగణఁగఁ ద్రుంపఁగ నేటికి మానవష్టము
క్కులమునహించి యిందుకొఁడిగట్టిన దానవు మాన నేర్తువే 52

వ అని యివ్విధంబున సరససల్లాపంబులు సేయుచుఁ జంద్రకాంతోపలప్రకల్పితసోపా
నసముదయకూలంకషమధురజలతరంగచ్ఛటాసంచలితపద్మకైరవకల్హారవనవిహారమాణ
మరాళచక్రవాకబకసారసద్విరేఫమిథునసంసారంబైన కాసారంబుఁ జేరి జలక్రీడా
సక్తచిత్తంబులనమ్మత్తకాశినులు దత్తీరంబున విహరించుచు 53

చ జలములఁ జల్లులాడుచును సారసపత్త్రములం బ్రేటులాడుచున్
బలుమఱు నీఁదులాడుచును బక్షికదంబముఁ దోలియాడుచున్
జలదలిమాలికామధురఝంకరణధ్వనితోడలియ్యమై
కలసిలయప్రమాణములఁ గంకణనిక్వణముల్ చెలంగఁగన్ 54

వ విహరించిరప్పుడు 55

సీ శంపాలతాంగులచరణకాంతులు కుశేశయకదంబముతోడ సరసమాడఁ
దారుణ్యవతులముత్తఱులయందము తరంగావళితోడ సయ్యాటలాడ
విచికిలగంధులకుచపాటవము చక్రసంఘంబుతో నెకసక్కె మాడఁ
గలహంసగమనలకన్నులబెళుకులు మీనపఙ్క్తులతోడ మేలమాడ

తే. రాజవదనలవేణీభరములసొబగు, ప్రబలశైవాలలతలతోఁ బందెమాడ
బాలికాజాలజలకేళిలీలఁ జాల, శ్రీకరంబయ్యె నప్పయోజాకరంబు. 56

మ కుచకుంభస్థలపాటవంబు దనరన్ గ్రొమ్మించు దంతచ్ఛటా
రుచులొప్పన్ గరపుష్కరాంతరసమారూఢాంబువుల్ మీఁదఁ జ
ల్లుచుఁ గ్రీడించిరి తత్సరోవరమునన్ లోలేక్షణల్ మందమం
దచలద్ధ్యానములన్ మదద్విరదయూథస్ఫూర్తి పత్తిల్లఁగన్. 57

వ అంత 58

చ పొదివెకలించు మన్మథునిపుష్పశరంబులలీల నీలతో
యదమున నతిక్రమించి పొలుపారెడు శంపలగుంపుసొంపు సం
పదఁ దెరవానివచ్చు జిగిబంగరుజంత్రపుబొమ్మలట్లు స
మ్మదమున నెచ్చెలుల్ సరసిమధ్యము వెల్వడి యుజ్జ్వలాంగులై 59

క కేళీవిహారచేష్టలు, చాలించియుపాత్తాంగిసరసాంబరభూ
షాలంకరణోజ్జ్వలలై, యాళిజనసహితముగ గృహంబునకరిగెన్. 60

వ ఇట్లు చనుదెంచి సరసాన్నపానగంధమాల్యాదిభోగంబులం బరితుష్టలై యొనాఁటిరాత్రి
తపనబింబోపమానతపనీయవిరచితకుడ్యంబును, మహేంద్రనీలోపలఖచితస్ఫూర్తస్తం

చి జృంభితంబును, వివిధవిచిత్రవాతాయనరేఖామనోహరంబును, గనకపంజరాం
తర నివాసశుకశారికానికరసరససంగీతసాహిత్యవిద్యాప్రసంగరంబును, తాంబూల
చందనప్రసూనదానాద్యుపచారప్రయోజనప్రవీణచైతన్యసూత్రవిచిత్రకాంచన
పాంచాలికాలంకృతంబును, గంధకర్పూరకస్తూరికాప్రముఖపరిమళవస్తుసంతాన
వాసనాఘుమఘుమాయమానంబును, నిబిడతమఃపటలపరిహరణచణమణిగణదీపి
కావిరాజితంబును, నగునిజమందిరంబునందుఁ దరవణుల దివిచిన వజ్రంబుకోళ్లును,
గోళ్లయందమరించినహరిపీలంబులపట్టియలును, బట్టియలనల్లవరించి యల్లినపట్టుపట్టె
డయును, బట్టెడపయిం బఱచినహంసతూలికాతల్పంబును, దల్పంబుపై శిరశ్చరణ
పార్శ్వదేశంబులకు నుపధానంబులుగా నుంచిన సూర్యపుటంబుదిండులును, నుపరి
భాగంబున నలంకరించిన చిత్రచిత్రాభిరామంబగు చందువాపటంబును గలిగి మనోహ
రంబై వెలయు శయ్యాతలంబున శయనించి 61

చ. అలకలొకింతజాఱి నిటలాంతముఁ గ్రమ్మఁగఁ దావియూరుపుల్
జలువలు చల్లఁగా మెయి నలందినగందము సన్నవల్వపై
న్వలువము సుంగుపై నిగిడి వాసన లీనఁగ లోచనాంబుజం
బులు ముకుళించి యమ్మగువ ముద్దుగ నిదురించు మంచకన్. 62

మ. కలలో నొక్క త్రిలోకసుందరశుభాకారుండు మాణిక్యకుం
డలశోభాంచితమందహాససరసవత్స్నిగ్ధగల్లద్వయీ
లలితాస్యుండు సుగంధబంధురసుమాలంకారవేల్లోపలో
జ్జ్వలధమ్మిల్లుఁడు కామినీహృదయపాంచాలుండు లీలాగతిన్ 63

సీ. తాంబూలరసరంజితంబైన కెమ్మోవి యానుచో మొనపంటనానియాని
కుంకుమాంకితకుచకుంభముల్ గ్రహణంబు సేయుచో నఖపఙ్క్తిఁ జెనకి చెనకి
మకరికాకలితకోమలగల్లములముఖంబును చుంబనంబొసఁగి యొసఁగి
లలితభూషణచయాలంకృతాంగము నెదనలముచో మర్మంబు లంటి యంటి
తే. కుసుమసాయకశాస్త్రానుగుణవిచిత్ర, బంధనైపుణిసురతప్రపంచసౌఖ్య
లీలఁ దనుఁ జొక్కఁజేసి లాలించెననుచుఁ, గలికి కలఁ గాంచె నాశ్చర్యకరముగాఁగ 64

క. ఈలీలం గలలోపల, నాలోకింపంగఁబడిన యతఁ డనిరుద్ధుం
డాలావణ్యనిధిన్ సను, హేలావతి వినియుఁ గనియు నెఱుఁగదు మదిలోన్ 65

వ. ఇత్తెఱంగున నక్కురంగనయన స్వాప్నికసంభోగసంజనితానందపారవశ్యంబును, ని
ద్రాపరవశత్వంబును నేకీభవింప సుఖశయనంబు గావించి కించిదవశిష్టయామినీచతుర్థ
యామసమయంబున శతపత్రంబులతోన నేత్రంబులు వికసింపన మ్మనోహరాంగుండు
తనకౌఁగిటనున్నవాఁడ కాఁ దలంచుచు మేలుకాంచి పొడగానక గుండియ జల్లుమన ది
గ్గన లేచి శయ్యాతలంబునం గూర్చుండి నిద్రాముద్రాయమానంబులగు విలోచనప్రభాజా
లంబులు లోలంబులై కీలాలకుల నలంకరింప నలునంకలం గలయఁ బునఃపునరవలోకనం

బుఁ జేయుచు విభ్రాంతియు విస్మయంబును విషాదంబును విరహంబునునంత
రంగంబునం బెనంగొన నంతరంతికను నతిశయంబు మోహావేశంబునఁ దదీయసౌందర్య
సౌకుమార్య విలాసహావభావంబులు పలుమాఱుఁ దలంచుచు నాజగదేకసుందరుండు
తనముందరం బొడగట్టిన ట్లైనం బట్టరాని తమకంబున బట్టబయలు కౌఁగిటం బట్టఁ
బోయి భుజలతాయుగంబునకు నప్రాప్తంబైన డెందంబు దిందఁబందఱయై నయనా
రవిందంబులం బొరంగు నశ్రుజలబిందుసందోహంబు మందంబై ప్రవహింపన లవిగా
నిపరితాపంబున వేఁడి నిట్టూర్పు లొదవించుచు నిట్లని తలంచు. 66

ఉ. నిద్దురవోవుమన్న రొయెడ నిశ్చయమైనవిధంబు దోఁపన
న్నొద్దికిఁ జేరి కూడి సుఖ మొందఁగఁ జేసి భ్రమించినట్టియా
ముద్దులగుల్కు జవ్వనపు ముమ్మరపుం దెఱజాణ యెవ్వఁడో
పెద్దయు నాకు వానిపయిఁ బ్రేమమనంబున నేమి సేయుదున్. 67

శా. ఆచక్కందనమా వయోమధురిమం బామందహాసామృతం
బాచాతుర్యము నావయోవిభవమా హా మోహముం జేయఁ గే
యేచంద్రాస్యలకైనఁ బొందఁగలదా యీ మేనితో వానితో
నేచందంబున నామనోరథఫలం బీడేఱునో దైవమా 68

వ. అని చింతించుచు 69

క. లలనామణికూటమిలీ, లలనామణి నూపురాంగులలిఁ గలసినయా
కలమాటలు నిక్కంబుగఁ, గలమాటలు గాఁ దలంచుఁ గడుఁ బ్రేమ చేతన్. 70

సీ. మొనపంటికొలఁది నొక్కిన నొక్కఁ జేఁ గెంపుటధరంబు చిమచిమయనినట్లు
చెలువారుగోళ్లనాటులు తేఁట చెక్కిళ్లపై నెలవంక లేర్పడినయట్లు
చెలఁగేగి యలమిన చేపట్టు బిగువుచే గబ్బిగుబ్బలు కసుగందినట్లు
కళలసోకు ద్రవించుగాటంపు రతులఁ బూవంటి దేహము వసివాడినట్లు
తే. భావమునఁ దోఁచు స్వప్నలబ్ధంబులైన, సౌఖ్యములు మిథ్యలయ్యు నిశ్చయము గాఁగఁ
బురుషసంగతి చేసినకరణి నపుడు, పద్మదళనేత్రి కరుణానుబంధమునను 71

క. అంతసఖీప్రేరితయై, సాంతత్యంబైన యట్టిసమయోచితముల్
స్వాంతమున నిచ్చలేకయు, దంతావళయాన యొకవిధంబున నడపెన్ 72

సీ. బింబోష్ఠి దర్పణబింబంబుఁ జూపుచోఁ జెలువుని ముద్దుచెక్కులు దలంచి
కలకంఠి మృగమదతిలకంబు దిద్దుచో సరసుని మేనివాసనఁ దలంచి
కలికి ముక్తామాలిక లలంకరించుచో రమణుని మందహాసముఁ దలంచి
పొలఁతి నీలోత్పలంబుల దండ లొసఁగుచో రాముని చికురభారముఁ దలంచి
తే. గంధగజయాన హృదయంబు కరిగి కరిగి, యసురసురమంచుఁ బారవశ్యంబు నొందు
నిగిడి పుంఖానుపుంఖంబులగుచుఁ దాఁకు, దర్పకుని పువ్వుటమ్ములఁ దాళలేక 73

వ. మఱియును. 74

సీ. విన్నఁదనంబుఁ గైకొన్న నెమ్మోమునఁ బొడమని చిఱునవ్వుఁ బొందుకొలుపు
దీనభావంబు నొందిన వాలుఁగన్నులతేని వికాసంబుఁ బూనఁ జేయు
గద్గదస్వరము సంగతమైన మాటల నొదవని చాతుర్యయుక్తిఁ జూపు
నుల్లాసభంగమై యున్న చిత్తంబునఁ గొలుపని యుత్సాహగుణము నెఱపు

తే. ఘనవియోగవహ్నిఁ గ్రాఁగుచునుండియు, మఱుఁగు సేయు నితరులఱుఁగకుండ
సఖులు తెలిసి రేని సంశయింపుదురను, భయమువలనఁ గుముదబంధువదన 75

సీ. ఎలనాగ వీణ వాయించుచో నాహిరిఘంటారవంబునఁ గలసి చెలగు
జలజాక్షి కావ్యంబుఁ జదువుచోఁ బాంచాలగతి వోటబాహాటక్రమము దొనకుఁ
నెలఁత చిల్కకు మాట నేర్పుచో గీర్వాణభాషలోనఁ దెనుంగుఁ బలుకు గలయుఁ
జెలియ పద్యంబు రచించుచో శృంగారరసముపై బీభత్సరసము నిల్చు

తే. విరహవిభ్రాంతి కతమున విద్రుమోష్ఠి, యొకటి సేయంగఁ బోవ వేఱొకటి దోఁచు
నగ్గలపుఁ జింత హృదయంబు నంటియున్న, నిట్టి పాటకు మది సంశయింప నేల 76

తే. దర్పకుని బాణతీవ్రత దాళలేక, యంగనామణి శివశివా యనివచింపఁ
గలికి కోవెల రొదలఁ జేనలసి సొలసి, రామపలుమాఱు శ్రీరామరామ యనును 77

క. సెగలయ్యెఁ జలువ వెన్నెల, పొగలయ్యెను గప్పురంపుఁ బొడికన్నులకుం
బగలయ్యెఁ జిలుక మాటలు, వగలయ్యెను సుఖములెల్ల వనితామణికిన్. 78

చ. కలకలగాక నిశ్చయము గా మదిఁ దోఁచిననాఁటనుండి తా
గలకలకంఠకీరశుకకంఠములం జనియించు దట్టపుం
గలకలము ల్చెవింబడఁగఁ గాయజునమ్ముల గాయముల్ మదిం
గలకలనొంప యామములు కల్పములై చెలియుండె ఖిన్నతన్. 79

వ. ఆసమయంబున. 80

మ. అమరారీశ్వరుఁడైన బాణునకమాత్యశ్రేష్ఠుఁడై బాహువి
క్రమకేళీవిజితాహితప్రకరుఁడై ప్రాఢింజతుష్షష్టితం
త్రమహామంత్రకలాపలక్ష్యపరుఁడై రాజిల్లు గుంభాండనా
మమునం దైత్యవరేణ్యుఁ డొక్కరుఁడసామాన్యప్రభావంబునన్ 81

ఆ. వాని యనుఁగుఁబట్టి వరసుందరాకార, రేఖ నొప్పుఁ జిత్రరేఖ యనఁగఁ
దండ్రివలన మంత్రతంత్రయోగక్రియ, లభ్యసించియుండు సాంగముగను. 82

శా. ఆనీలాలకబాణకన్యక సుబాహ్యప్రాణమోనాఁగ నెం
తే నేస్తంబొనరించియున్న దగుటం దీనాననాంభోజయై
గ్లానిం బొందుచునున్న యారమణియాకారంబు వీక్షించి చిం
తానిర్మగ్నమనోంబుజాత యగుచుం దత్కార్యమూహించుచున్. 83

తే. ఇంగితజ్ఞానియగుటనా యిందువదన, వలపుమర్మంబు గామదిఁ దెలిసి యప్పుడు
పలికె నేకాంతమునఁ జేరి పడఁతితోడ, బడలికలు దీఱఁ జల్లని భాషణముల. 84

ఉ. ఎన్నఁడు లేని విన్నఁదన మేల మొగంబున దోఁచె నమ్మ రి
కెన్నఁడు లేని చింత మది నెక్కడనుండి ఘటించె నమ్మ ముం
దెన్నఁడు లేని యీ కృశత నేటికి దేహము చిక్కె నమ్మ నీ
యున్న విధంబుఁ జూచి వగనొందెడు నా హృదయంబు కోమలీ. 85

సీ. కమ్మని చిగురాకు కమ్మోవి కసుఁగందెను సురసురని వెచ్చ నూర్చకమ్మ
కనకంపు నెమ్మేను కాఁక చేతఁ గరంగె విరహానలంబుచేఁ వేఁగకమ్మ
తళుకు నిద్దంపుటద్దపు మోము కళదప్పె వలవల కన్నీరు విడువకమ్మ
వెలిదమ్మికన్నుల తెలివి మందము నొందె చెదురుము మేఘము క్రమ్మఁ బోరలకమ్మ
తే. పలుకఁగదమ్మ వేసట పడకమ్మ, సొలయ నేలమ్మ మోమెత్తి చూడవమ్మ
యేలి చేసెదవమ్మ నమ్మేటికింత, జాలిపెట్టెదవమ్మ యో చంద్రవదన 86

క. పరిరంభణమృదుచుంబన, సరసాలాపాదిసురతసౌఖ్యంబుల చేఁ
గరఁగించు విభునిఁ బాసిన, విరహిణి చందంబు దోఁచె వెలఁది నీపట్ 87

శా. బాలా నిన్ను మదీయజీవముగ నే భావింతు నెల్లప్పుడున్
జాలా నేఁగలుగంగ నెంతపనికిన్ సంతాపముం బొందఁగా
నేలా సిగ్గున గుట్టుఁ జేసి హృదయంబింకిట్లు చింతించుటల్
మేలా దాఁపక తెల్పు నీ తలఁపు నెమ్మిం బూనికావించెదన్ 88

వ. అని యివ్విధంబునం జిత్రరేఖావధూటి పలికినఁ దద్వచనౌషధంబు ప్రియానుపానసహితంబై యాత్మీయహృదయసంజనితమదనజ్వరంబు శాంతింబొందించుటయు సేద దేఱి నిజాభిప్రాయమార్గనిరోధకంబైన లజ్జాప్రవాహంబు ధైర్యప్లవంబువలన నుత్తరించి కించిద్గళితశ్రుతివిపంచికాంచితస్వరోపమానంబగు గద్గదస్వరంబున నిట్లనియె.

తే. పాన్పుపై నొక్కనాఁడు నేఁ బవ్వళించి, నిదురపోవంగ లావణ్యనిధి యొకండు
చేరి నా యౌవనంబెల్లఁ జూఱగొనియెఁ, గలయనుచుఁ దోఁచు నిక్కంబుగాఁగఁ దోఁచు

సీ. సొగసైన చెక్కిళ్ళు చుంబించి చుంబించి చేరి మోమున మోముఁ జేర్చి చేర్చి
కరమునఁ బాలిండ్లు గదియించి కదియించి యధరపల్లవరసం బాని యాని
కేలి మైఁ గౌఁగిటఁ గీలించి కీలించి గళమున నఖపఙ్క్తి నిలిపి నిలిపి
చెలఁగి గళధ్వనుల్ చెలఁగించి చెలఁగించి నిద్దంపుఁ బొక్కిలి నివిరి నివిరి
తే. పోఁకముడి విచ్చి దేహంబు పులకలొందవ, నవయవంబులు గదియంగ నదిమి యదిమి
యవల నేమేమొ చేసె నయ్యాగడంబు, నెట్లు చెప్పుదు సిగ్గు నోరెత్తనియదు. 91

చ. అటువలె వానికౌఁగిటసుఖానుభవంబునఁ జొక్కి యుండి యం
తటఁ గనువిచ్చి మేలుకొని తన్మహనీయవిలాసమూర్తి నా

దటఁబోడగాన నైతిఁబరితాపభరంబున నాఁటనుండి నే
నిటువలె నున్న దానఁ గృశియించుచు జీవము వాని సొమ్ముగన్ 92

చ మదగజవైరి వంటి నడుమా కమలంబుల వంటి కన్నులా
యదనశశాంకు వంటి మొగమా ముకురంబుల వంటి చెక్కులా
మదనుని వంటి చక్కఁదనమా మధురాధర వా నిరూపు నా
హృదయపటంబునందు లిఖియించిన కైవడిఁ గానవయ్యెడున్ 93

తే ప్రాణసఖివైన నీకు దాపంగ నేల, విన్నవించితి నా మదినున్న విధము
వానిఁ గన్నులఁ జూపి జీవంబు నిలుపు, మనుచుఁ గన్నీరు దొరఁగ దైన్యంబు నొందె 94

ఉ అయ్యలివేణి దైన్యమునకాత్మఁ గలంగుచు బాష్పబిందువుల్
పయ్యెదకొంగునం దుడిచి భక్తి మెయిన్ శిశిరోపచారముల్
సయ్యనఁ జేసి నెమ్మది విషాదము దీఱఁగ నూఱడించి తా
నయ్యెడఁ గొంత సేపు హృదయాబ్జమునం దలపోసి నేర్పునన్ 95

శా రంగుల్మీఱు పటంబునన్ వివిధవర్ణద్రవ్యముల్ గూర్చి సా
రంగాంకానన వ్రాసె ముజ్జగమున్ రాజిల్లు రాజన్యులం
బంగారంపు మెఱుంగు వ్రాఁతజిలుగుల్ పైపైఁ గళద్దేఱఁగా
శృంగారంపు రసంబు వెల్లివిరియం జిత్రక్రియా వైఖరిన్ 96

చ కళలు వెలుంగు మోములు వికాసవిలాసముఁ జూపు కన్నులుం
జెలువము గుల్కు మేనులును జెక్కుల పైఁ బ్రసరించు నవ్వులున్
దళుకులు చల్లు భూషణవితానముఁ గల్గి సజీవచిత్రముల్
నిలిపిన యట్లు వ్రాసెం మణీమణి నేర్పు వచింప శక్యమే. 97

ఆ వ్రాఁత కజుఁడు కర్త సేఁతకుఁ దాఁ గర్త, యనుట కిది విరోధమైన నేమి
సేఁత కజుఁడు కర్త వ్రాఁతకుఁ దాఁ గర్త, యనుచుఁ జిత్రరేఖ ననఁగవచ్చు. 98

వ ఇవ్విధంబున ద్రిభువనంబులం గల్గు పురుషశ్రేష్ఠుల లిఖియించిన యప్పటంబు ను
షాసుందరి ముందట నుంచి యిట్లనియె. 99

చ త్రిభువనవాసులై వెలయు దేవమనుష్యభుజంగకోటిలోఁ
బ్రభుతయు రూపసంపదయుఁ బ్రాజ్ఞతయుం గలవారి నెల్ల నే
ర్చి భగవతీ మహామహిమచే లిఖియించితి నిప్పటంబునం
దభినవమూర్తియై తగిన యాఘనుఁ డెవ్వఁడు వీరిలోపలన్ 100

వ అని మఱియు నిట్లని వివరింపం దొడంగె 101

ఉ. దివ్యవిమానయానములు దివ్యసుగంధవిలేపనంబులన్
దివ్యలతాంతవాసనల దివ్యధుని జలకేళిలీలలన్

దివ్యవిలాసినీరతులదివ్యశరీరములన్ సుఖాత్ములై
దివ్యపథంబునన్ మెలఁగుదేవతలన్వివరించిపల్కెదన్. 102

శా. ఆనందాకరవైభవానుభవురంభాద్యప్సరోనాట్యలీ
లానిత్యోత్సవుఁ బారిజాతకుసుమాలంకారహారున్సుర
స్థానావాససుఖోన్నతుం ద్రిభువనసామ్రాజ్యసింహాసనా
సీనున్నిర్జరభర్తఁ జూడుమితనిన్శీతాంశుబింబాననా 103

ఉ. ఆవహనీయదక్షిణసమాఖ్యలచేఁ జెలువందిమంత్రపూ
తాహుతులన్సరోరుహభవాదులఁదృప్తివహింపఁజేసియ
వ్యాహతలీలసాధకజనాళికిసౌఖ్యములిచ్చుపుణ్యుఁడు
స్వాహగుణాసమానుఁడుకృశానుఁడితండిటుచూడుకోమలీ 104

వ. అని తెలిపి వారియందనాదరంబైన తదీయహృదయంబుఁ దెలిసి శేషించినదిక్పాలక
దేవతాగణంబుల వేర్వేర వివరించెద ననుచు నిట్లనియె. 105

చ. అతులితధర్మవంతుఁడుకృతాంతుఁడనూనుఁడు యాతుధానుఁడా
యతశుభుఁడంబురాశివిభుఁడంచితదేహుఁడుగంధవాహుఁడు
న్నతమతిగుహ్యకాధిపతి నాగధరుండుహరుండునుంజుమీ
యితఁడునితండితండితఁడునీతఁడునీతఁడుసుందరీమణీ 106

ఉ. కామునిమించుసుందరముకంజవనాప్తునిగెల్చుతేజమున్
సోమునిఁగేరునెమ్మొగముశోభిలువాఁడలకల్పవృక్షచిం
తామణికామధేనుసహితంబగుసంపదలింటఁగల్గుసు
త్రామునికూర్మినందనుఁడితండుజయంతుఁడుసరసిజాననా. 107

శా. భారాంతస్స్పృహులైననిర్జరులపైపై సోఁకియెవ్వానినిం
డారంబై కొనునర్తనాభినయభావారంభసంరంభరం
భారంభోరుముహుర్ముహుస్తరళితాపాంగచ్ఛటామాలికా
సారంబానలకూబరుండితఁడుతత్సౌందర్యమీక్షించితే 108

సీ. కంబుకంధరవీరుకమనీయనిరతయౌవనమదోద్ధతులుగీర్వాణతతులు
సరసిజేక్షణవీరుసంగీతనృత్యవిద్యాధురంధరులుగంధర్వవరులు
కుటిలకుంతలవీరుఘుటికాంజనాదిక్రియాసుసాధకులువిద్యాధరేంద్రు
లమృతాంశుముఖివీరుసుమహితాష్టవిశేషసిద్ధిప్రసిద్ధులుసిద్ధవిభులు

తే. గరుడకిన్నరరుద్రకింపురుషసాధ్య, యక్షరక్షోభుజంగగుహ్యకులువీరు
నీకటాక్షాంచలంబులునిగుడఁజేసి, కెలనవీక్షింపుమోరాజకీరవాణి. 109

వ. అనిపలికి యనంతరంబ పాతాళలోకనివాసులవ్రాసినపటంబుఁజూపి యిట్లనియె

మ. భువనాలంకృతనూత్నరత్నరుచిసంపన్నాంబురాజీవకై
రవకల్హారమరందపానమధుపవ్రాతస్వనోదారభో
గవతీతీరమనోహరంబఖిలభాగ్యశ్రీనివాసంబునై
ప్రవణంబొందినయట్టిలోకముగదా పాతాళమబ్జాననా 111

వ. తద్భువననివాసులైన నాగపుంగవులవివరించెదం గనుంగొనుము. 112

శా. పారావారవిహారియైనహరికిం బర్యంకమై ద్వీపశై
లారణ్యాంబునిధిప్రయుక్తమహనీయక్షోణికిన్నిల్వనా
ధారంబై యురగేంద్రలోకమునకుం దా సార్వభౌమాంకుఁడై
శ్రీరంజిల్లు ఫణాసహస్రకలితు శేషున్విలోకింపుమా 113

చ. అతులసుధాపయోధిమథనావసరంబున మందరాద్రిక
ప్రతిహతలీలనావరణపాశలతాకృతిఁ దాల్చి దానవా
హితులకు వాంఛితంబు ఫలియింపఁగఁ జేసిన కీర్తిశాలి భా
సితసితదీర్ఘదేహు ఫణిశేఖరు వాసుకిఁ జూడుమీతనిన్. 114

వ. అని మఱియుం దక్షక కర్కోటక ప్రముఖులైన చక్షుశ్శ్రవశ్శ్రేష్ఠుల రూపనామం
బులు చక్షుశ్శ్రవంబులకు గోచరంబుగా దృష్టంబును శ్రుతంబును గావించిన దదీ
యరూపనామంబులు వేదాంతసిద్ధాంతప్రకారంబున నాత్మకు వేఱై యస్థిరంబగుట
యు దదీయముఖవిహ్నంబులవలనం దెలిసినదై తదనంతరంబ మధ్యమలోక పురుష
పరివృఢులం దెలుపం దలంచి యిట్లనియె 115

చ. శుకపికశారికానినదశోభితకేళివనాంతరంబులన్
వికసితపద్మకైరవనవీనసుగంధసరోవరంబులం
బ్రకటసువర్ణగేహములభద్రగజేంద్రతురంగమాదులన్
సకలసువస్తుసంపదలసౌఖ్యదమై తగుమర్త్యమంగనా 116

వ. ఏతద్భువనంబునం గలుగు రాజశేఖరుల నాలోకింపుము 117

చ. నిజగజనాథయూథపదనిర్దళితోన్మదవైరిపార్థివ
వ్రజచతురంగసైన్యుఁడు విరాజితరత్నవిభూషణప్రభా
విజితవిభాకరుండు పరవీరభయంకరఖడ్గవిస్ఫుర
ద్భుజుఁడు కళింగభూభుజుఁడు తోయరుహాననవీఁడె చూడుమా 118

చ. లలితలవంగకోమలవిలాసలతాపరిణద్ధచందనా
మలమలయక్షమాభృదసమానసుగంధివిశేషశీతలా
నిలవిలసద్గవాక్షచయనిర్మితహర్మ్యవిహారి పాండ్యుఁడీ
యలఘునిఁ జూడవమ్మ దరహాససుధారసరంజితాననా. 119

శా. గంధేభేంద్రసమానయాన తెలియంగాఁ జూడుమీనిం జతు
ష్కంధిప్రాప్త మేదినీవలయవిశ్రాంతప్రతాపాబ్జినీ
బంధుంయుద్ధకృశప్రసిద్ధబలవత్ప్రత్యర్థిరాజన్యని
ర్బంధుంసాంబశివార్చనానుగతసంబంధుంజరాసంధునిన్ 120

శా. చౌదంతిన్యగదంతిగాఁగొనిసహస్రాక్షుండుయుగ్మాక్షుఁడై
మోదంబొప్పఁగరక్షరించుగతిఁబెంపుసొంపుసంధిల్లఁగా
వేదండోత్తమవాహుఁడైవెలయునీపురంబ్రభాభాసమా
నాదిత్యుంభగదత్తుఁజూడుమునితంబాభోగహేమాంసకా 121

శా. ప్రాజ్యంబైతగుకౌరవాన్వయమునం బొల్పొందజన్మించిసా
మ్రాజ్యంబేలుసుయోధనుందెలివిమీఱంజూడుమొక్కింతది
వ్యజ్యోతిర్మయసాధనువ్విహితబాహాదండకోదండదం
డజ్యానిర్యదఖండచండతరకాండప్రోద్భటాయోధనున్ 122

ఉ. తోయజగంధిచూడుమువిధూతతమోగుణదివ్యతేజుఁడై
ధీయుతిమూర్తియైవసుమతిన్విహరించుపయోజబాంధవుం
జేయితఁడంచునెంచఁదగుకీర్తివెలుంగుచునున్నవానిరా
ధేయునిదానవైభవవిధేయునివర్ణితభాగధేయునిన్ 123

సీ. జయముచేధర్మనిశ్చయముచేవైభవోదయముచేఁదగువాఁడుధర్మజుండు
దిటముచేభుజబలోత్కటముచేరణజయార్భటముచేఁబెంపొందుపవనజుండు
యుక్తిచేవిబుధానురక్తిచేశరబాహుశక్తిచేనధికుండుసవ్యసాచి
బుద్ధిచేనతులప్రసిద్ధిచేభాగ్యాభివృద్ధిచేఁబొగడొందుకవలయనకులుఁ
తే. వసమశరసమసుకుమారరసమనోహ, రాంగతాంగుండుసహదేవుఁడంబుజాక్షి
వీరలేవురుపాండవవీరవరులు, పెంపుసొంపారనిట్టువిలోకింపవమ్మ 124

చ. సుమహితధాళధళ్యరుచిసుందరకోమలవిగ్రహంబుపై
నమలతరేంద్రనీలనికరాసితవర్ణఘనాంశుకంబుతో
నమరిననీలమేఘరజతాచలరాజముఁబోలెరేవతీ
రమణునిఁజూడవమ్మబలశాలినిఁ గోమలపాటలాధరా 125

సీ. లలితరేఖాత్రయీకలితకంఠమువాఁడుధవళవిస్తారనేత్రములవాఁడు
ఆజానులంబిబాహావిలాసమువాఁడుకమనీయనీలాలకములవాఁడు
హారశోభితవిశాలోరస్థలమువాఁడుతరుణారుణాంఘ్రిపద్మములవాఁడు
మహనీయనీలకోమలశరీరమువాఁడునవదరస్మితసుధాననమువాఁడు
తే. సరసకల్యాణగుణవిశేషములవాఁడు, మదనశతకోటిసౌందర్యమహిమవాఁడు
దేవకీనందనుఁడుకృష్ణదేవుఁడితఁడు, వనితగనుఁగొమ్మునేత్రోత్సవంబుగాఁగ 126

మ. త్రిజగన్మోహనరూపవైభవునిసాంద్రీభూతకీర్తిం బ్రతా
పజయార్కున్ రతికామినీకుచతటీపాటీరముద్రాకరాం
బుజునిం గంఠవిలంబమానవిలసన్ముక్తామణీమాలికా
వ్రజునిన్ స్మారకకృష్ణమూర్తి యగునీ ప్రద్యుమ్ను నీక్షింపుమా 127

ఉ. చక్కనివారిలో మొదలిచక్కనివాఁ డగు చంద్రికన్న సుం
జక్కనివాఁడు భవ్యగుణసంపదఁ దాతను బోలువాఁడు పెం
పెక్కినకీర్తివాఁడు కమలేక్షణపౌత్త్రుఁడు శంబరారికిన్
మక్కువనందనుం డితఁడు మానవతీ యనిరుద్ధుఁ జూడుమా 128

వ. అని యివ్విధంబున నవ్వనిత యవ్విలాసినీతిలకంబునకు భూలోకపురుషపుంగవుల వేర్వేఱ వివరించుచు ననిరుద్ధకుమారపర్యంతంబును జూపునప్పుడు. 129

సీ. అంగవంగకళింగబంగాళనృపులపై సాగంగ గతులఁ జేఁ జౌకళింప
గౌళనేపాళపాంచాలభూభుజులపై నుబ్బెట్టిల్ల తచ్చేఖ నవఘళించి
మగధమత్స్యవరాటమద్రనాయకులపై మత్స్యపుటంబుల మహిమ నిగిడి
యాదవవృష్ణిభోజాంధకశ్రేణిపై యలతేఁటిదాఁటుల నెళవుచూపి
తే. మఱియు గోపాలదేవునమ్మగులమీఁద, నాట్టెకోలలగతి వాఁకిమిట్టి తిరిగి
వ్రాలి యనిరుద్ధునందుఁ గ్రొవ్వాఁడిచిలుకు, ములికినైనా నైకకంఠి చెఱుకుఁ జూపు.

చ. కనుఁగొనఁ గా నెజల్లుమనెఁ గైరవలోచనగుండె దేహమె
ల్లను బులకించెఁ గన్నులజలంబులు జాలయి పాఱె మోమునం
బెనఁగొని దైన్యరేఖ వనితగతిం గరఁగెన్మనంబు మ
న్ననుపడియున్న తాపశిఖి ప్రజ్వలభావము నొందె వింతగై. 131

ఉ. కన్నుల ఱెప్పలాఁగ నివికాసపుఁ జూపు నుమానముద్రతో
నున్న మొగంబు నిశ్చలతనొప్పు శరీరము గాఁ బటంబుపై
నున్నతలీల వ్రాసినప్రియుం గని సొక్కినఁ దాను నట్లయై
చిన్నెలు దక్కి యుండె సఖి చేసినజంత్రపుబొమ్మకైవడిన్. 132

తే. అతనిలావణ్యసరసి యందతివచూపు, నిండుకొని బారులయ్యె నుగండుమీలు
నుప్పతిలి గుంపులయ్యె నీలోత్పలములు, పాదుకొని మూఁకలయ్యెఁ బుష్పంధయములు

ఉ. చూచుఁ జలించి పైఁబడఁగఁ జూచుఁ గుచంబులనొత్తిపట్టఁ గాఁ
జూచు నఖాలి మైఁ జెనకఁ జూచు సుధాధరబింబ మానఁ గాఁ
జూచుఁ గవుంగిటం బెనఁగఁ జూచుఁ గపోలము ముద్దుపెట్టఁ గాఁ
జూచు లతాంగి యమ్మదనసుందరరూపముఁ జూచి భ్రాంతితోన్. 134

వ. ఇత్తెఱంగున నక్కోకపచత్రవరుచిరావలోకనంబున పరమశాంతుని హృదయంబు
వంబోలె దత్సౌందర్యలహరీమగ్నంబై యానందలహరిం దేలుచున్న నెచ్చెలులను మఱ
లించి కుంభాండకతనూభాముఖాంబుజంబున నిలిపి యిట్లనియె 135

ఉ. వీఁడుగదమ్మ నా నిదురవేళ ఘటించిన వాఁడు కోమలీ
వీఁడుగదమ్మ పంచశరవిద్యలు చూపినవాఁడు తొయ్యలీ
వీఁడుగదమ్మ నా హృదయవిత్తము నాచినవాఁడు యుగ్మలీ
వీఁడుగదమ్మ యీ విరహవేదనఁ గొల్పినవాఁడు నెచ్చెలీ 136

క. నిన్నుండి వీనిరూపముఁ, గన్నులఁ జూడంగఁ గలిగెఁ గానేటికి నో
క్రొన్ననఁబోఁడి రోసబుగా, మెన్ని సవంబులకునైన నీఁగంగలనే. 137

వ. మేఘాగమనంబునకు నెదురుచూచుచున్న మయూరంబువిధంబున సంపూర్ణపూర్ణి
మా చంద్రబింబోదయంబుఁ గోరుచున్న చకోరంబుకైవడి, స్వాతివర్షంబు నపేక్షిం
చుచున్న మౌక్తికశుక్తిచందంబున, హృదయంగమాకారుండైన యీరాజకుమారు
తోడి సంభోగంబునకు నాహృదయంబు నిరంతరవ్యాపారంబై యభిలషించుచున్న
యది. దురంతంబైన విరహపారావారంబు నీఁదవశంబుగాక మునుంగుచున్న నాకుం
దెప్పవిధంబున నాభాగ్యవశంబున నీవు సంఘటించితివి. ఏయుపాయంబుననైన ని
నిం దెచ్చి మామకమనోరథం బీడేర్చి ప్రాణదానంబు సేయవలయు నిదియనుచితంబని
విచారించెదవేని నాకర్ణింపుము 138

సీ. కలలోనఁ గన్నవార్తలకింత వలవంతకేమి కారణమని యెంచుకొంటి
నాయునికిఁ గనుఁగొన్న నాసాటివారిలో నిది లాఘవంబని యెంచుకొంటి
మదిలోన నామాట మఱచియుండెదఁగాక యెంతలేదని బుద్ధి నెంచుకొంటి
గుఱుతెఱుఁగని వానికూర్చి కాశించిన నేమి ఫలంబని యెంచుకొంటి

తే. నేమి సేయుదు వానికనోమనోజ్ఞ, వదనపూర్ణేందుచంద్రికావ్యాప్తిఁ జంద్ర
కాంతరత్నంబుకైవడిఁ గరఁగియున్న, భావమున ధైర్యమింపైనఁ బాగుకానగు. 139

ఉ. కావునఁ బక్వబింబఫలకాంతులఁ దోఁదులఁ దూఁగు వానికె
మ్మోవిసుధారసంబు మది మోహము దీఱఁగ నానకుండిన న్
భావభవజ్వరజ్వలనబంధురతీవ్రశిఖాకలాపతా
పానహమైన నాదుహృదయవ్యథ దీఱునె యెన్నిభంగులన్. 140

మ. కలికీ మాటలు వేయు నేమిటికి నీ కాయంబుతో వానితోఁ
గలయన్నాభాగ్యము గల్గకున్న విభునింగాఁ జేయుమీ వీనిరాఁ
గలజన్మంబున నంచు బ్రహ్మకు నమస్కారంబుఁ గావించి యు
వ్వలదేహాంతరతీవ్రలబ్ధికుచితవ్యాపారముం జేసెదన్. 141

తే. అనుచుఁ జెలిపల్కు ఖేదవాక్యములతోన, వేఁడినిట్టూర్పుగాడ్పులావిర్భవించె
నూరుపులతోనకన్నీరుతేటులయ్యె, నశ్రువులతోనపరశంబయ్యె మేను. 142

తే. అతివిదురనస్థఁగనుఁగొనియాత్మఁగలఁగి, యువతివిపశతదిఁజంగనుపచరించి
యనుగుణంబైనమధురవాక్యములమనసుఁ, జల్లఁజేయుచునుండెనాసమయమునను

వ. అని శుకుండుపలికెననినఁ దదనంతరవృత్తాంతంబెట్లయ్యె నెఱింగింపుమనుటయు.

చ. చతురవిహారహారమణిసాంద్రలసద్భుజమధ్యమధ్యని
ర్జితమృగరాజరాజసరసీరుహమిత్రసునేత్ర నేత్రశో
భితవసుభద్రభద్రగజభీతిహరాదరభావభావజా
హితమతివాసవాసవమణిద్ధరుచిస్ఫుటకేశ కేశవా 145

క. దురితపరితాపపరిహర, చరితాభరితాదరాత్మ శంకరహృదయ
స్మరితహరిదశ్వకోటి, స్ఫురితాస్ఫుటితారినినదసంశ్రుతివినుతా. 146

భుజంగప్రయాతము మహామంగళాకారమాన్యేహమోహా
నహోభూధరోత్సాహవారాహదేహా
గుహాత్త్రిజ్ఞసాంచిత్యఘోరాఘదాహా
మహామంగళాద్రిప్రమావత్సుగేహా. 147

గద్య. ఇది శ్రీమంగళాచలనృసింహకృపాప్రసాద సంప్రాప్తవిద్యావైభవ కనుపర్తిరాయనమంత్రితనూభవసుజనహితకృత్య నిత్యాబ్బయామాత్య ప్రణీతంబైన యనిరుద్ధచరిత్రం బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు

# అనిరుద్ధచరిత్రము

## తృతీయాశ్వాసము

---



వత్సవై జయంతి
శ్రీవనితాకౌస్తుభాదిశృంగారవిలా
సావహవక్షస్స్థలభువ
నావనసంభ్రమణమంగళాచలరమణా 1

తే. అవధరింపుము శౌనకుండాదియైన, మునివరేణ్యులతోడనిట్లనియె సూతుఁ
డాపరీక్షిన్మహారాజు నాదరమునఁ, జూచి విజ్ఞాననిధియైన శుకుఁడు పలికె 2

వ. అంత 3

సీ. వినతాతనూజకేలనకరాసంప్రాప్తజనితానురాగవిస్తారమునఁ గ
వపరదిక్పలధినాయకసమర్పితఫుల్లహల్లకమాల్యప్రభాంకమునఁ గ
సమరసన్నాహరక్షశ్ఛటావిదళనకోపాగ్నికీలాకలాపమునఁ గ
తత్కాలతాండవోద్ధతమహాబిలకేశవరమణిమకుటరుగ్వ్యాప్తియనఁగ
తే. భాపరిగ్రహణార్థసమీపవర్తి, గంధవహబంధుతేజఃప్రకాశమనఁగ
నస్తశైలాగ్రమునభాస్వదరుణదీప్తి, మండలంబయ్యెమార్తాండమండలంబు. 4

చ. ఇనుఁడుకరంబులంబొదివియింపుగసంగమమాచరింపఁబ
ద్మినివదనంబునన్నగవుమీఱవికాసవిలాసమూనిలో
నన ద్రవముబ్బిసొక్కి నయనంబులుమూయుచునిద్రఁజెందఁగా
యనముకుళించెదివసాంతమునందుఁబయోజషండముల్. 5

చ. ఇనునకుఁబద్మినీసువలయేక్షణపైమదినెంతమోహమో
తనునెడఁబాసియెంతపరితాపమునొందునొనాల్గుయామములఁ
జనినపునస్సమాగమముసంఘటనంబనితెల్పుచుండెఁదాఁ
బనిచెసుస్పష్టాంతతిరుచుల్కులనీడలపేరిదూతలన్. 6

క. కమలినిపయిఁ గూరిమిచే, రమియించెం గాననఘచిరాహిత్యముగా
నమరందానమొనర్చిన, క్రమమునఁ గమలాప్తుఁ డపరకంధిం గ్రుంకెన్ 7

తే. అంబురుహసంభవాండగేహాంతరమున, దీపకంబైనభాస్కరదీపకళిక
యపరదిక్కునఁ జేరిన నంధకార, బంధురంబయ్యె దశదిశాభాగమునను 8

చ. అనయము జీవకోటికి భయంబుగ దొంగలు గట్టికొల్లఁగై
కొనఁ జెలవిచ్చెఁ జోరులకుఁ గూర్మిపరాంగనలన్ రమింపఁగాఁ
బని చెవిటానలిచ్చు భవనబంధుఁడు లేనియరాజకంబుచేఁ
దనరఁ బ్రచరించె సుధాస్థలిఁ జీఁకటిపాలెగాఁడొగిన్ 9

సీ. ఆదటఁ దీరంగ నంభోజగంధుల బటువుగుబ్బలమీఁదఁ బ్రోఁకి ప్రోఁకి
కోరికఁ ఫలియింపఁ గుంభీంద్రయానలయధరపల్లవముల సానియాని
ముచ్చటదీఱంగ ముకురబింబాస్యలనిద్దంపుఁ జెక్కిళ్లు నివిరి నివిరి
యభిలాషదనియంగ హరినిలవేణులమవ్వంపుఁ గొప్పులు దువ్వి దువ్వి

తే. యంధకారాఖ్యకామాంధుఁ డన్యసతుల, నలముకొనుచుండెఁ గాని దోషానుభవము
తపనకరఘాతనెపమున దాఁకుననుచు, నెఱుఁగలేఁడయ్యెఁ దామసుండేమి యెఱుఁగు.

క. జీవనమె జీవనంబై, యీవిధమున నున్నపుష్పు నెడ చేసెనయో
దైవమని ఖేదమొందెడు, కైవడి నమరెన్ రథాంగకరుణరవంబుల్. 11

సీ. విరునిరాకరునిశావాసకసజ్జకమింటఁ బఱచినవెన్నెలపానుపనఁగ
గగనకేశునిమస్తకమునదిక్కాంతలు పూజచేసినయట్టిపువ్వులనఁగ
దట్టమై తిరుగుచున్నట్టి ఖేచరకోటిముత్యాలగొడుగుల మొత్తమనఁగ
దమముఁ గిర్వమడంప దండెత్తి రేరాజు ముందరనడపించు మూఁకయనఁగఁ

తే. గొరలిమయఁ బూర్వలోకము గ్రొలువపింజ, పింజఁ గొనసేయుపుష్పాస్త్రవితతి యనఁగఁ
గన్నులకుఁ బండువై తోఁచె గగనభాగ, మండనంబైన తారకామండలంబు. 12

సీ. అధిపలాలితలైన స్వాధీనపతికలు నలుకదీఱనకలహాంతరితలు
పతినిరాకలు గోరు వాసకసజ్జికల్ పతివంచకలు విప్రలబ్ధసతులు
పొరుగూరవిభులున్న ప్రోషితభర్తృకల్ కలహించి విడనాడు ఖండితలును
ధవులు వేగంబరానివిరహోత్కంఠితల్ సంకేతగతలభిసారికలును

తే. రమణసంభోగవిప్రలంభములనొంది, రెట్టివిధనాయికలు నిట్టులతిశయముగఁ
గుసుమయానందభావానుగుణ్యకేళల, విలసితంబైనయన్నిశావేళయందు 13

శా. మందాక్షాంచలముల్ గ్రమించి కులధర్మస్ఫూర్తి సుద్దాఁటి త
న్నిందాభీతిమహాటవుల్ గడచి పొందెన్ పుంశ్చలీకోటి ని
స్పందేహాస్పదగణ్యభంగి నివిశత్సంకేతిక స్థానముల్
కందర్పుండను మంత్రదేవత సమాకర్షింపఁ గా నయ్యెడన్. 14

ఉ. చీఁకటివేళ సంచరణ సేయుచు నిక్కువలైన చోట్లనె
ట్టాఁకల నిల్చుచుం జనుల యల్కుల కొయ్యన లోఁగియుండుచుం
గాఁకఁ దయార్ద్రులు స్ఫురణఁ గావిటకోటి భుజంగభావముల్
గైకొనియుండె నింక [illegible] భుజంగనామముల్ 15

సీ. గళరవంబులు రగ్గిగాఁ జెలంగంగఁ [illegible] మెల్ల నెసఁగుసుమనుచుఁ
దమి కొద్ది నధరబింబము గంటువడఁగ మొనపంట నొక్కి యంతఁ జూపుచును
గుబ్బచన్నుల మీఁద గోరు లేర్పడఁగ నేర్పుతో నొయ్యన నివురుచును
రతిసుమాళమున నార్భటము గావింపక నిలుకడ వల్లఁ గాఁగలియుచుఁ
తే. గాముకుల యందుఁ బూర్ణులు గలిగియుండి, యనురహస్యంబు బయలుగున నెడభీతిఁ
గలసి రిబ్బంగి సాంకేతికములయందు, జారకాంతలు మోహితస్వాంతలగుచు 16

ఉ. ఆసమయంబునం గుసలయు ప్రయమైన ప్రభుప్రరేఖను
ల్లాసనసంబు మోమునఁ దొలంగఁగఁ జల్లనిరాఁకటంపువి
శ్వాసముతోడ లోకులు ప్రశంసలు సేయఁగఁ బూర్వశైలసిం
హాసన మెక్కెఁ జంద్రుఁ డనిజాభ్యుదయంబు జగత్ప్రసిద్ధిగన్ 17

సీ. భూనభోంతరములఁ బూర్ణిమ వించు తమంబులను చ్చాటనంబు చేసెఁ
వసతుల మెలఁగు జీవంజీవవిహగకదంబంబు నాకర్షణంబు చేసెఁ
గివగూడి చెలఁగు జక్కవల క్రీడావిలాసంబులను సంస్తంభనంబు చేసెఁ
సలిలమధ్యంబులఁ జెలువొందు కైరవారామంబుల వశీకరంబు చేసెఁ
తే. నలినపఙ్క్తికి విద్వేషణంబు చేసెఁ, దమ్మిచేరాశి కెలమారణమ్ము చేసెఁ
బొసఁగ వెన్నెల మంత్రవిభూతిఁ జల్లి, మహిమఁ జూపె సుధాకరమాంత్రికుండు 18

సీ. జతనంబుతోఁ దేఁటి సంచిణీహాసము భిన్నదుము దారు గానిసుడి నడుమఁ
గలువల దొరిచల్ల గాలివజీవులు పూనిరా స్తానుచపాను గొలువఁ
బెంపుమీఱు వసంత ఘషువాహజుయునను డిచెలానసి హౌనరు దెలువ
నెమ్మిఁ గోవెల నిశాని దారుగములు కర్నాటీడమారములు నాదు సేయ
తే. సరణి కావాలు రంగు రుఘుల్చాపుటములు, రహిగ నటియించు చిలుక పింఛాక్షి సక్కి-
కెంజిగురు సైపుంటనంకించు కొనుచు, మదనుపాదుసహా దండు గదలె నపుడు. 19

వ. అంత. 20

మ. చణబాహాబలశాలియున్మఘుఁడు చంచచ్చంచరీకచ్ఛటా
గుణటంకారరవప్రచండసుమనఃకోదండనిర్ముక్తదా
రుణచూతాంకురబాణముల్బఱపె సక్రోధాత్ముఁడై మానినీ
మణిధైర్యంబను జోడు చించుచు మనోమర్మంబు లందూఱఁగన్. 21

మత్తకోకిల. మత్తకోకిలశారికాశుకమంజుమోహననాదసం
వర్తికిన్ మలయాచలానిలపద్మశాత్రవచంద్రికో
ద్వృత్తికిన్ సుమబాణనాపదవీభ్రమద్భ్రమరస్వనో
త్పత్తికిన్ మదినోర్వఁజాలకతల్లడిల్లుచునుండఁగాన్ 22

క. వగనొందుమఁజెలికత్తెలు, మృగమదఘనసారగంధమృగుసుమాదుల్
తగఁదెచ్చి శిశిరవిధులా, మిగులనెసఁగావించిరి ప్రముదమతియున్నతియున్ 23

సీ. విభునికౌఁగిటికినై వెతఁజెందు మేనికిఁజందనపంకంబలందనేల
చందనంబునఁగసుగందెఁగదాయని గ్రక్కనబన్నీటఁగడుగనేల
పన్నీటిపలనఁదాపంబుమించుటఁజూచి చంద్రరజంబుపైఁజల్లనేల
చంద్రరజంబుచేజనియించెసెకలంచు వెసఁదారస్నాంతముల్వాసనేల
తే. తాళవృంతములనువడదాఁకెననుచు, వగవఁగానేలసేరనివైద్యకరణిఁ
దనుగుణమెఱుంగఁజాలకతమరుసేయు, మందులకెనుందుమొనరించిరిందుముఖులు.

తే. ఎన్నియుపచారములుచేసిరిందువదన, యున్నయునుజాడమునుపటికన్నమిగుల
బాధకములయ్యెదయలేనిప్రభువుతోడ, మందలించినమనవులచందమునను. 25

వ. ఇక్కరణి నక్కమలాయతాక్షి విరహాతిశయంబున నోర్వంజాలక పరితపించుటకు సఖీ
జనంబులు విచారమగ్నాంతరంగలై కుసుమసాయకు నుద్దేశించి యిట్లనిరి 26

ఉ. తల్లిసమస్తభాగ్యనిధితండ్రిదయాపరమూర్తిని చెలుల్
చల్లనివారివీవుకడుఁజక్కనివాఁడవుపొంకమైనవి
విల్లుసమాధురింబరిషవిల్లుమృదుత్వముసీగువర్తినం
బెల్లనయోగ్యమౌనిది నేటివరోయవుమానకేతనా 27

చ. పురహరదేవునింజెనకఁబోయితిగుగ్రలలాటనేత్రభీ
కరదహనార్చులంగలసికాలితినంతటనుండియైనను
బరులనుబీడపెట్టనికృపాగుణమేటికిలేదునీకుఁగా
పురుషులురాజదండనముఁబొందియునైజముమానరెకదా. 28

వ. అనిపలికి సుధాకరు నుద్దేశించి. 29

సీ. కువలయంబులనుగన్గొన్నఁజల్లనిచూపుకమ్మబృందముఁబొందఁగలుగదయ్యె
నలచకోరములపైఁగలుగుదాక్షిణ్యంబుజక్కవగములందుఁదక్కవయ్యె
సప్రాణవిభులైనసతులపైఁ కూర్మియనాథకాంతలయందునాస్తియయ్యె
నిందూపలములపైనెనయుసౌహార్దంబురవికాంతములయందురహితమయ్యె
తే. బక్షపాతంబుమానవేపక్షమునను, రాజదోషాకరుఁడవుగారామరామ
దానఁజేసిసుమీ! యేదుమేనియందు, నంకమైనిల్చియున్నదయ్యపయశంబు. 30

క. పగలొప్పనిసౌమ్యతనై, జగణంబగునీకునింతచలమేటికరయో
తగుపూర్ణకరానిదితో, మొగమెఱుఁగనివాఁడవౌదువిదినిగమకా. 31

వ. అని మలయపవను నుద్దేశించి. 32

శా. ఎంచంజల్లనివాఁడవై పరసులందిష్టంబువాటించుచుం
బంచప్రాణములై మెలంగుదువుమాపద్మాక్షియందిల్లుబా
ధించంజొచ్చితివియ్యెడన్మఱునిబుద్ధిన్స్వస్వభావంబువ
ర్జింపంజెల్లునెనీగుణంబుగదదాక్షిణ్యంబుమందానిలా. 33

వ. అని పికశుకనికరంబుల నుద్దేశించి 34

క. ఒకకుత్తికయైయుండెడుమీ, రకటాచెలియెడలనింతయతికుహూకమా
పికమాశుకమాయికమా, ననుమాసుకుమారగాత్రినాయమెయేచన్ 35

వ. అని పలుకుచున్నసమయంబునం జిత్రరేఖ గనుంగొని యుపాంగన తిన మనోహరుండైనయనిరుద్ధుని సరససౌందర్య సౌకుమార్యంబులు పలుమారుఁ బ్రస్తుతించుచు నిట్లనియె 36

ఉ. ఔనటవమ్మవానిసరసాధరసారరసామృతంబు నే
నానకయింకఁదాళఁగలనాలలనాకలనాదకీరసం
తానముసేయుకంతుమదితాపదితానదితాపమయ్యెస
న్మానవిధంబునీదెగదనాయెదనామదనాభుఁజేర్చినన్ 37

వ. అనిపలికిన. 38

చ. విరహమునొందకమ్మవిభువేగమెతోడ్కొనివత్తునంచునా
సరసిజగంధియోగబలసంపదచేగగనప్రచారయై
యరిగెననేకపట్టణవనాచలపల్లినిచయంబుస
త్వరవిభవంబునంగడచితానటయేఁగుచుఁగాంచెదవ్వునన్ 39

శా. కాంచెంగాంచనగాత్రిసౌధశిఖరాగ్రస్వర్ణపాంచాలికా
చంచన్నీలమణిప్రకల్పితకచప్రక్షిప్తసత్తారకం
బంచోదంచితహృద్యవాద్యరవశుంభద్ద్యామపూజాలస
త్కాంచామిత్రగురుస్తమంటపసహస్రస్ఫారకద్వారకన్ 40

వ. కనుంగొని మనంబునం బెనంగొను ప్రమోదంబునం బ్రమాదంబగు విద్యావిశేషంబున నన్నగరంబుఁ బ్రవేశించి సముంచితప్రాసాద రేఖా పురోభాగ మహోన్నత స్తంభాగ్రవిరచితదేదీప్యమానదీపికాకదంబక ప్రతిబింబవిడంబితసాంద్ర చంద్రశాలాస్థగితపద్మరాగ మణిగణ చరణారుణకిరణస్ఫురణావలన నిశాసమయంబయ్యును దివాభాగంబునంబోలెదృగ్గోచరంబగుతదీయ సౌభాగ్యంబునకు నాశ్చర్యంబునొందుచుంగలితకాంచనకనత్కవాట కమనీయ చతుర్ద్వార చారుతర ప్రాకారంబును, మహోగ్ర

సాధనసమగ్రజాగ్రద్ద్వారఘటసమూహసమావృత్తంబును, రుక్మిణీసత్యభామాప్రముఖాష్టమహిషీషోడశసహస్రసుందరీసందోహమందిరామందసుందరంబును, బద్ధరాగవజ్రవైడూర్యగోమేధికపుష్యరాగమరకతనీలముక్తాప్రవాళఖచితస్తంభకుడ్యవాతాయనవితర్దిప్రదేశంబును, ప్రద్యుమ్నసాంబసంకర్షణసుదేష్ణాదికుమారవిహారసౌధయూథాభిరామంబును, సకలసౌభాగ్యలక్ష్మీనివాసంబునునగు గోపికావల్లభుమందిరంబునం దుశృంగారంబునకుసారంబును, విలాసంబునకువాసంబును, భోగంబునకుయోగంబును, భాగ్యంబునకుయోగ్యంబును, స్తోత్రంబునకుంబాత్రంబునునై, సహస్రభానుప్రభాభాసమానంబగు ననిరుద్ధకేళీసౌధంబులోపలం బ్రవేశించియందు

క అలరుకన్నులోచనాకుచ, కలశయుగాన్వితనిరూఢగాఢాశ్లేషో
జ్జ్వలపులకాంకితదానవ, సులలితసురతప్రసంగజనితశ్రముఁడై. 42

సీ బంగారుదివియకంబములపైనియవంకదీపికాకాంతులు తేజరిల్ల
నమలమాణిక్యపర్యంకభాగంబునఁబరుపుజాజిపూఁబాన్పుమీఁద
నొకకెలుతలక్రిందనునిచి యొండొకకరంబూరువుపైఁజాచియొత్తగిల్లి
పరుపుపైముత్యాలసరులుకుప్పగఁడంగఁ జెలిదమ్మితళుకుకన్నులు మొగిడ్చి
తే పూఁతనెత్తావిగమ్మునఁబొలయుచుండ, నూర్పులొకింతమగురులై యుప్పతిల్ల
నిదురపరవశమున నున్న యనుపమారుఁ, గాంచెఁదనగొప్పకన్నులకలువుదీఱ. 43

ఉ మీసముతీరుఁజూచిజిగిమేనిపటుత్వముఁజూచిమోములో
హాసముఁజూచిచేతులయొయారముఁజూచిమనోజ్ఞరూపరే
ఖాసమలీలఁజూచియహహాయనుచుందలయూచిముందుదా
వ్రాసినభావమెంచితలపంచుకొనెజ్జలజాక్షిసిగ్గునన్. 44

వ తదనంతరంబ. 45

మ. తనసమ్మోహనవిద్యచేజనులనిద్రాముగ్ధులంజేసియ
య్యనిరుద్ధుంగొనిఖేచరత్వమునసుద్యద్వేగయై యేగిబా
ణనిలింపాహితరాజధానియగుశోణాఖ్యంబ్రవేశించియ
వ్వనజాతాక్షియుసాలతాంగిసుమమానవైస్థిముంజేరఁగన్. 46

వ వచ్చుచున్నసమయంబున 47

ఉ ఎప్పుడువచ్చునోకువలయేక్షణయాతనిఁదోడుకొంచునే
నెప్పుడుచూతునోసదమలేందునిభంబగువానిమోమునా
కెప్పుడుగల్గునోయతనిసొంపుగఁగూడెడుభాగ్యమంచునా
కప్పురగంధితాపమునఁగంటికినిద్దురలేకవేఁగుచున్. 48

ఉ. నావెతచూడలేకకరుణాపరురాలగుచిత్రరేఖదా
నావిభుఁదెత్తునంచునకటాపరభూమికిసాహసంబునం

బోవుచునుండె నాకొఱకుఁ బోయిన కార్యము నిర్వహించెరో
దేవతలార నాదిగులు దీరఁగ మీకు నమస్కరించెదన్. 49

వ. అని తలంచుచు. 50

తే. తరుణి యిబ్భంగిఁ గుసుమకోదండచండ, కాండనిర్భిన్నహృదయ యై కరఁగుచున్న
యవసరంబున రతిమనోహరకుమారుఁ, దెచ్చి పానుపుపై నుంచె మచ్చెకంటి 51

వ. అప్పుడు. 52

చ. హృదయము ఝల్లుఝల్లు మన నెంతయు విస్మయమంది చూచి పెం
పొదవిన భ్రాంతిచేత నిది యుం గలగా మగ దా యటంచు సం
ప్మదిఁ దలపోయుఁ గ్రొత్తఁడగు మారుఁడు చేసిన యింద్రజాలమో
యిది యని యెంచుఁ బర్వరజనీందుకరానన మోహలోలయై 53

వ. అంత. 54

క. తెలివొంది చిత్రరేఖా, కలవాణిం గౌఁగిలించి కన్నులహర్షా
శ్రులు జడిగురియఁగఁ దనువునఁ, బులకాంకురములు నింపఁ బొంగుచుఁ బలికెన్ 55

ఉ. ఈసుకుమారమూర్తి నిపుడీవకుఁ దెచ్చితి ప్రాణదానముం
జేసితి నీకు మేల్తరలఁ జేయఁగ నేర నమస్కరించెదన్
నీసుగుణంబు నీ వెనరు నీయుపకారము ముజ్జగంబులన్
వాసికి నెక్కి నీకథలు వర్ణితమయ్యెడుఁ గాక కోమలీ. 56

క. అని పలుకుచున్న బాలిక, వినయోక్తులఁ గారవించి వేడుకతో సం
జనియె నిజమందిరమునకు, ననజాననయుం దెనిచటి వాంఛలు మీఁగన్. 57

ఉ. లేచుట యెప్పుడో నిదుర లేచిన పిమ్మట నన్నుఁ గన్నులం
జూచి మనోనురాగమున సాత్త్వికభంగిఁ గారవింపఁగాఁ
జూచునొ లేక నా పుమత సుద్దియె యుంగమిఁ జేసి పింతయై
తోఁచుచునుండునో యితనితో నపుడేమని పల్కుదాననో 58

మ. అని చింతింపఁగ నిద్ర మేల్కని యతండా కన్నవిభ్రాంతి మో
హన నేత్రాంబుజముల్ కనీనికలచా యర్ధోన్నిగా విచ్చి చూ
చిన యా చూపు మనంబున న్దగిలెఁ గించిన్మ్యకున్ నాభభూ
ధనురుద్యత్కటకాముఖాంకకరసంధానప్రయోగాస్త్రమై 59

ఉ. నాథుసుదర్శనంబువలన న్మదనగ్రహమోక్షమయ్యె వెం
బాఁగ దకున్ సుదర్శనమహామహిమం బిటువంటి దేక దా
యీ ధరఁ దత్ప్రయోగమున నెట్లు గ్రహంబులు నివ్వ నేర్చుఁ ద
త్సాధకులైన మాంత్రికులు సారమెఱుంగుదు రప్పుడిప్పుడున్. 60

గీ. ఇవ్విధంబున మేల్కాంచి యవ్విభుండు, ద్వారకాపురకనకసౌధప్రదేశ
చారుతరరత్నపర్యంకశాయి గాఁగఁ, దనుదలంచుచు లేచి కన్గొనెడునపుడు. 61

సీ. కాఁకలు దేరు బంగరుపలాకయనంగఁ గసటు వాసిన చంద్రకళయనంగ
నదను బుల్కడిగిన యట్టి ముత్యమనంగ సానఁబట్టిన కాముశరమనంగ
మెలపుతో నిల్చిన మెఱుపుతీఁగె యనంగ నంకంబుఁ గోల్పోని క్రొన్ననయనంగ
జీవకళల్గల చిత్రరూపమనంగఁ బరువంబు దప్పని విరి యనంగఁ
గరగు ననుబోసి మోహనాకారరేఖ, యొసఁగ దీర్చిన శృంగారరసమనంగఁ
దనసమీపంబునందున తరుణిఁ జూచి, మన్మథకుమారుఁ డాశ్చర్యమగ్నుఁ డగుచు. 62

క. మొదలను నేనసియించిన, యది ద్వారకలోని వజ్రహర్మ్యము గాదా
యిదియేమి వింత యిపుడిది, సదమలమాణిక్యఖచితసౌధంబయ్యెన్. 63

వ. అని విచారించుచు నవ్వరారోహ నాలోకించి 64

సీ. పొలఁతి మోమునకు సంపూర్ణేందుబింబంబు నెలయని వాళి గావింపవచ్చు
కంపాంగి నెనికిఁ జాంపేయపుష్పమ్ము వరుసగో నెడిసి వైవంగవచ్చు
జలజాక్షి పరువంపజాతినీలంబులు నొగి దృష్టి పేరు గానునుపవచ్చుఁ
గలకంఠకంఠ వినుపమ్రోకారముల్ రసమంత్రములు గా వ్రాయవచ్చు
నౌర యీ రూపుతికి రంభాదివేల్పు, చెలువ నుడిగింపు బుడుతలఁ జేయవచ్చు
ననిన దోషంబు గలుగదీ యుద్ధమంగుఁ, జూడ మెన్నఁడు నిటువంటి సుందరంబు 65

గీ. అని విచారించు నెడఁ గించిదవనతాస్య, పద్మ మైనకై ప్రేమ బయలు పఱచు
కలికి నిడువాలు తళుకుఁ గన్నులను బెళుకు, చూపులను జూచుచున్న యా సుదతి కనియె 66

ఉ. ఎవ్వరి దాన వేమి పలయేక్షణ యెయ్యది నీగు పేరసీ
వెవ్వని మేలు దానవి ప్రుడేమి కతంబున నన్నుఁ దెచ్చితీ
విప్పరసౌధదేశమున కింత యెఱుఁగఁ దాఁచక తెల్పు నావుడున్
నవ్వును సిగ్గుఁ గూడి వదనంబున దాఁగిలి మూఁతలాడఁగాన్ 67

గీ. తళుకు వజ్రంపుటద్దంపు యందంబు గులుకు, గులుకు గులుకు తేటముకురబింబములవంటి
చెక్కు లొగవనిండి కెంపుల చెక్కడంపుఁ, గమ్మలను గ్రమ్మఁ బలికె నాకలికి యపుడు. 65

మ. ఇది బాణాసురువీడు శోణపుర మా యింద్రారిమాతంత్రి పెం
పొదవెన్ నాసుమసాభిధాన నొగి నీయొయ్యారపుఱ్ఱూపు స్వ
ప్నదశం గాంచిన దాన నై విరహసంతాపంబునం జెంపస
మ్మదలీలన్నినుఁ దెచ్చెఁ బ్రాణసఖి శుంభద్యోగవిద్యోన్నతిన్. 69

ఉ. కన్నియఁ గాని యన్యసతిఁ గాను శరీరము నీదు సొమ్ము గా
మన్నన చేసి యేలుకొను మా వినుమా యనుమానబుద్ధి నై

కముహూర్తంబిదియంచుఁ దెల్పుచుమహాకందర్పమౌహూర్తికా
సమహస్తాయసదండభిద్భవఘణాంచల్లోహయంత్రాకృతిన్ 78

ఉ. కాంచనగాత్రి ముగ్ధనగఁ గాంచికవుంగిటనుబ్బలంబుఁగీ
లించిసుధాధరంబుఁ గబళించి హసించి వికసోలపాళిఁ జుం
బించి చమత్కరించి నలపెంచి కళల్ గరఁగించి మించి సా
క్కించెక మున్సఖించి కిలికించితకేళిరమించె వేడుకన్ 79

సీ. సుగుచిరాంబరబంధనరీతియు భేదించి ప్రౌఢాబలంబులవిఱుగఁ దోలి
ఘనకుచదుర్గముల్ వగ్గలుపట్టి జఘనవసుంధరాచక్రమాఁగి
యూరూరుసంయుక్తి తోరంపు బలుగట్టి చతురఁ డైమన్య దేశంబుఁ బొదివి
యంగాంగములభుజాహంకృతిలోఁ గొని యానబండారమాక్రమించి
తే. సురతసంగతిజయలక్ష్మి సారిదిగాంచి తరుణికౌఁగిలి నిజరాజధానిగాఁగ
నెలమి మన్మథసామ్రాజ్యమేలుచుండె, సిద్ధసంకల్పుఁడయ్యనిరుద్ధవిభుఁడు 80

ఉ. చంచలలోచనన్సురతసౌఖ్యమునన్గరఁగించెనంచు న
ర్ణించఁగ నేటికిన్వ్రతపుఁ బేరురులొల్లజగంబు వారిమె
గ్గించెడివాని పెద్దకొడుకయ్యఁట యాశవిలాసవైఖరి
న్మించినయింతికిన్వలన నేరఁడొ తాఁ దలపింప నేరఁడో 81

సీ. జలచరనేత్ర కన్నులవెరపింపు చేయ త్తినబిరుదాంక మేటఁగలిపి
కార్ముక భ్రూయుగకనుబొమ్మలంపు కెపట్టినవిల్లు నిష్ఫలము చేసె
లలితశుకాలాపలు సజంకెనల కేమావు చందంగ పోవఁ దోలి
చెంగుపల్లవపాణి చేగద్దికల కెంపు పాలంబులడవులపాలుచేసి
తే. ప్రియునిసాహాయ్యమున విజృంభించుచున్న, వెలఁది తో విగ్రహింపవ వేళ యనుచు
సమరరంగప్రచారంబు సన్న్యసించె, యంగజుఁడు కార్యమెఱిఁగి సమాశ్రయించె 82

చ. ఎలచినపొందులై మనసువచ్చినచక్కఁదనంబులై ప్రసూల్
కొలిపెడియౌవనంబులయి కూరుచులన్నిన క్రొత్తలై కళల్
దెలిసిననేర్పులై కోదవ లేక రమింపఁగఁ గల్గినట్టి యా
చెలువుఁడు నింతియుం బొలుతఁ జేసిన పుణ్యఫలంబు లెట్టివో 83

గీ. అంత నానపోఢయానందమునఁ దను, సురతమున జయింపఁ బరిభవంబు
నొందియున్నయట్టి కందర్పునదనంబు, తెల్లనారవన్ను తెల్లవాఱె 84

ఉ. చిందఱవందలై యసురసేనలు డెందమునన్భయాకులం
బందిపతంగపుంగవశితాంగరథాంగమహోగ్రధాటినం
దందడుడంగినట్లు లుదయార్కనిరాకనడంగెఁ జీఁకటుల్
గొందులసందులన్ గుహలఁ గుట్టలఁ బుట్టల చాటు మాటులన్. 85

తే. గిలికి తేలింపుఁ జూపుఁ గరఁగి కరఁగి, సొంపు చెయ్యింపుఁ జన్నులఁ జొక్కి చొక్కి
యివ్విధంబున నాయకుఁ డింపొదవ, యుపరిసురతసుఖాంబుధి నోలలాడె 95
సీ. కెమ్మోవి విమలాననిమ్మని విభుఁ డేఁడుకొనినఁ గొమ్మ నియ్యాసకొలిపియాన
వచ్చిననియ్యక వదనమిట్టటుఁ ద్రిప్పుచు బయింపఁ గాఁ గోపమగ్గలించి
కరముఁ జెక్కిలిగవయొత్తిపట్టి పంటను మోవిఁ గొని నొక్కఁ గనొక్కి
యిటువలెఁ జేయకు మెన్నటికిఁ గనని దట్టించి చెక్కిలి గొట్టునపుడు
తే. కంకణంబులరావంబు గల్లుమనియెఁ, జేతి యురవడి తాఁకునఁ జెల్లుమనియె
నల్లభుని మేనఁ బులకలు జల్లుమనియెఁ, గుసుమశరుమూఁక నవ్వులు గొల్లుమనియె 96
మ. సిచయాభావనటన్నితంబతటయోషిద్రత్నకించిచ్చల
త్కుచపాటీరసార్ద్రఘర్మజలబిందుస్వచ్ఛముక్తామణి
ప్రచయాంచత్స్తనాభిరామసుసుహాసాహాంతకుండై సుఖిం
పుచు మెచ్చెన్ రతిరాజనందనుఁడు తత్పుంభావసంభోగముల్. 97
సీ. విల్లెక్కుడించక వేసిన మదనుండు పలుమాఱు నుంకెనపనులు నడప
సెగలచేస్రుక్కఁ జేసిన మందపవనుండు చెలిమితో నెమ్మేని చెమటఁ బార్ప
నదుటు వెన్నెలకాఁక నడుకఁ జేసిన చంద్రుఁ డెమరికై తొయ్యుపచారములు సేయఁ
జెవులు గాసిలరొదల్చేసిన చిలుకలు ముద్దుమాటలు పల్కి ప్రొద్దుఁ గడప
తే. శుకకలాలాపప్రాణనాయకునిఁ బొండె, నిందువేడుకవిహరించుచుండెనపుడు
మేలు గలిగి సుఖించెడివేళయందు, భువిని బగవారలైన బంధువులు గారె 98
క. ఎక్కువలగు మక్కువలను, జక్కవలను బోలి యిట్లు సరసత నెలవా
ల్లిక్కువలఁ గలిసి యుండఁగ, నక్కువలయనేత్ర గర్భమయ్యెడుఁ దాప్చన్ 99
తే. చక్రభావనచేఁ గాంచి కీర్తిఁ దనరఁ, బ్రాపుగలుగుట కోలేమిఁ బాపుకొనియు
వెలఁదినడుమంతమాత్రనే విఱ్ఱవీఁగె, నహహ నడుమంతరపుఁ గల్మి కగ్గి నిజంబు 100
మ. అసమాస్త్రుండసుగారఁ డీఁడతివగర్భాయాసనిశ్వాసమం
త్రసముచ్చారణ సేయ నాభివివరాంతస్సీమయం దుండి సా
హసభావంబున నిర్గమించి సఖణంబై యాడు నీలాహిరీ
తిసరోజాననరోమరాజి చెలువొం దెం జూడ నవిస్తీర్ణమై 101
ఉ. మెల్లని కౌఁగిలింపులును మెత్తని మాటలు లేఁత ముద్దులుం
జల్లని చూపులుం గులుకుఁ జల్లెడు నవ్వులు నేర్పుగల్మి యుం
జెల్లని హామికల్ తరుపు సేయని కూటములయ్యె భావముల్
వల్లభునందు వేఁకటియలంత నెలంతకు నాఁటినాఁటికిన్. 102
సీ. ఉరువులై కొనలనల్లొప్పవ్వ చన్నులు కరగ్రాణలకొకవింత కాంతఁ జేయఁ
తెలిదమ్మిచాయలు దేరు చెక్కులు ముద్దుఁ గొనుటకు నొకవింత కోర్కిఁ బొడమ

నలపుసొల్పులఁబల్కు పలుకులువీనులవినుటకునొకవింతవేడ్క యొదవఁ
గమ్మనివాసనల్ గ్రమ్ము వాతెరతేనెలానుటకొకవింతయాసఁగొలుప
తే మెత్తనై మెఱుఁగెక్కిన మేనుకాఁగి, వింతకొకలింతముచ్చటసంతరింప
గర్భిణీరతజనితసౌఖ్యమునఁ జొక్కి, మండెనవ్వేళ యసురాంశమందనుండు 103
వ అంత 104
ఉ మందిరపాలికాజనులు మానినిఁ గన్గొని గర్భభారమే
చందమునన్ఘటించె ననిసంశయముద్భయమున్విచారమున్
డెందమునన్ జనింపఁగ వడింబఱదెంచి రహస్యరీతిసం
క్రందనవైరితోడ వివరంబున నిట్లని పల్కి రర్తిఱిన్. 105
చ. చెలఁగి భవత్తనూభవనశింపఁ గృహాంతము పోతుటీఁగయున్
బొలయక యుండఁ గాఁచుకొని పూనిక నుండెఁగ నేమిమాయయో
తెలియఁగఁ జాలమిమ్మదవతీమణిగర్భభరంబుఁ దాల్చెని
న్నెళవు గృహంబులో వలను నిక్కము గావిపరింపఁగాఁ దగున్. 106
వ అని విన్నవించిన. 107
ఉ ఖేదముక్రోధమున్మదినిఁ గీల్కొన బాహుబలాఢ్యులైన క్ర
వ్యాదులఁగొందఱన్ననియు పాంగనకేళిశిరోగృహాంతరం
బాదిగ నంతటం గలయ నారసి యిక్కడ గామిదుర్మదో
న్మాదతఁ జేసిన ట్టిఖలు నాకశకుంగొని రండు తీవ్రతన్ 108
క అనిపలికిన రోషానిల, జనితస్ఫుటవిస్ఫులింగచయభాతినిలో
చనరక్తదీప్తులడరఁగ, దనుజులువడి నేగుదెంచి తత్సదమునన్ 109
మ అమలేందూపలవేదికాస్థలమునం దాసీనుఁడై యయ్యుషా
రమణీరత్నముతోడ నక్షనిపుణారంభంబునం ద్యూతిసం
భ్రమకేళీరతినున్న పంచశరసామ్రాజ్యాధిపత్యప్రసి
ద్ధమనోజ్ఞప్రతిభాసమృద్ధు ననిరుద్ధుం గాంచి క్రోధాత్ములై. 110
మ భయదాహంకృతిఁ జక్రముద్గరగదాప్రాసాదిహేతిచ్ఛటో
దయదుగ్జాలదగద్ధగల్గి కడనా దైత్యుల్విజృంభింపని
ర్భయుఁడై యాగ్రహవృత్తినుగ్రపరిఘప్రాంచద్భుజాదండుఁడై
లయకాలాంతకుభంగి వారలపయిన్ లంఘించి ఘట్టించుచున్. 111
చ తలలుపగిల్చి కంఠములు దగ్రతఁ ద్రుంచి భుజప్రదేశముల్
నలినలిగాఁగ మోదినిటలంబులు వ్రక్కలు సేసిదంతముల్
డులిచి యురస్థలుల్ వ్రదిపిడొక్కలు చించి భయంకరాకృతిన్
సలిపె రణంబు రక్కసులు చచ్చియు నొచ్చియు విచ్చిపాఱఁగన్. 112

క. హతశేషులుభయవిహ్వలు, మతులై యేతెంచికదనమార్గముఁదెలుపన్
వితతంబుగనాజ్యాహుతి, నతిశయజాజ్వల్యమానమగువహ్నిక్రియన్ 113

వ. బాణుండత్యుగ్రరౌద్రముద్రాసమున్నిద్రనేత్రకోణుండును సాహసాటోపధురీణుండును నై కదిసె నయ్యనిరుద్ధుండును, సమరసన్నద్ధుండును, భుజాస్తంభసమృద్ధుండును నై యతనితోడం దలపడియె నట్లయ్యిరువురును గంఠీరవంబులచందంబు, బెబ్బులులతెఱంగున, మత్తమాతంగంబులకైవడి, శరభంబులవిధంబున, గండభేరుండంబుల చాడ్పున, రోషావేశంబులు రెట్టింప, జయకాంక్షలు ముప్పిరిగొన, తర్జనభర్జనంబుల గర్జిల్లుచు, నన్యోన్యముష్టిఘాతంబులను బరస్పరపాదపార్ష్ణి ప్రహారంబులను, నితరేతరమర్మభేదనంబులను, బాహాబాహియుఁ గేశాకేశియుంగాఁ బెనంగ, నయ్యిరువురకున్ రణంబు దారుణంబై చెల్లుచుండ నప్పుడా బుశ్యకేతు నుద్దేశించి యశరీరవాణి యిట్లనియె 114

క. యదువంశతిలకవీనికి, నిదిజయకాలంబు పెనఁగ నేటికిహరిచే
నొదవునపజయమువీనికిఁ, గదియుశుభమునీకునచిరకాలమునందున్ 115

గీ. అనియె నమ్మాటవీనులయందుఁ దగిలి, రిపుమహోరుహవిదళనోద్వృత్తిఁ గొరలు
యదుకులాగ్రణి యాగ్రహోదగ్రకరిని, నిష్ఠురాంకుశభూతమై నిలువరించె. 116

వ. అప్పుడు 117

ఉ. బాహుబలోద్ధతిం బలిఖగాగ్ర్యగంగిఁ బరాక్రమించియు
ద్వ్యాహతిలీలవాని బెడిదంబుగఁ జేసియుఁ గాన్య నొంచిచే
వాహతిచేతఁ బట్టుకొనె నాహనుమంతుఁ డుశక్రజిత్తుచే
నాహవభూమిఁ బట్టువడినట్లు ప్రశాంతనిజోగ్రకోపుఁడై 118

క. వనితాసంపర్కంబున, ననిరుద్ధునిగుద్ధుఁ జేసెనరిసర్గంబున్
వనితాసంపర్కంబున, ననిరుద్ధునిరుద్ధుఁ జేయునరిసర్గంబున్. 119

వ. ఇవ్విధంబున 120

గీ. పట్టుకొనియాఁకఁ జేయించెబాణుఁడతని, నప్పుడుతద్భంగజనితఖేదాంధకార
భిన్నహృదయారవిందయైకేవలంబు, నయ్యుషాంగనసంతాపమందుచుండె 121

సీ. వేకువఁగాంతిదప్పినచంద్రబింబంబువిధమున నెమ్మోము వెల్లఁబోయెఁ
బగలింటిసెగలచేసాగటొందుపూఁదీఁగెవడువున నెమ్మేను వాడుచెందె
మునిమాపుజిగిఁదొలంగినతమ్మిరేకులరీతిఁగన్నులు దైన్యరేఖఁదోఁచెఁ
దగురేయిహిమమంటుతాంబూలదళములచెలువున చెక్కిళ్లు చెమటఁదోఁగెఁ

తే. జిన్నఁబోవుచుఁ జెక్కిటఁజేయిఁ జేర్చి, యాటపాటలపై వేడ్కలన్ని మఱచి
విరహసంతాపవేదన వేఁగుచుండె, నేమిచెప్పుదునయ్యుషాకోమలాంగి. 122

గీ. వీడుముఖకాంతిపసివాఁడువాడుమేను, నెందుకెమ్మోవిబాష్పముల్నిండుకన్ను
లామనోవ్యథఁగనుఁగొన్నరామరామ, జగతిఁబగవారికైననుజాలిగాదె 123

వ ఇట్లుమనోహరాంగి విరహానలసంతప్తమానహృదయయైయుండె నంతనిక్కడ 124

మ అనిరుద్ధుండుపురంబులోపలనులేఁడాశ్చర్యమేమోకదా
యనుకొంచున్నసుదేవముఖ్యులువిచారాక్రాంతిచేతస్కులై
యనుమానించుచుభృత్యకోటులనశోధ్యస్థానముల్చూడఁబం
చినవారెందును గానమంచుమరలంజేరంగనిర్వ్యత్తులై 125

ఉ. తల్లియుఁదండ్రియున్బహువిధంబులఖేదమునొందుచుండఁగాఁ
బల్లవకోమలాంగియగుభార్యవియోగముచేఁగృశింపఁగా
నెల్లప్రజల్తదీయవ్యథలెంచివిచారమునొందుగోపికా
వల్లభుఁడంతయున్హృదయవారిజమందునెఱింగియుండియున్ 126

క. కానున్నకార్యమయ్యెడు, నేనిప్పుడువీరితోడనిజముగఁదెలుపం
గానేలయనుచుమాయా, మానుషవేషుండుకార్యమతిచేనుండెన్ 127

వ. అని శుకుండు పలికెన నిన నటమీఁదటికథావృత్తాంతంబెఱింగింపు మనుటయు 128

ఉ అండజవప్రకాండగమనాదరపండితపుండరీకమా
ర్తండదిశేభతుండభుజదండధృతాంబుజజాండభాండరు
ఙ్మండలమూర్తికుండలిపమండనచండతరైకకాండమా
రొక్కండరమేశరత్నమయకుండలమండితగండమండలా. 120

క శ్రితరాజహంసయోగా, యతిదివ్యవిలోక నాక్షయాగమహితగా
శ్రితరాజహంసయోగా, యతదివ్యవిలోక నాక్షయాగమహితగా. 130

స్రగ్ధర ప్రతాపవద్రిపుద్రుమప్రభంజనప్రభంజనా
క్రతుక్రియాచరిష్టమానిరంజనానిరంజనా
యతిస్థిరత్రిలోకభోగదాకరాగదాకరా
ప్రతిష్ఠితాంబుధిభ్రమద్ధరాధరాధరాధరా 131

గద్య ఇది శ్రీమంగళాచలనృసింహకృపాప్రసాద సంప్రాప్తవిద్యావైభవ కనుపర్తిరాయనమంత్రితనూభవ సుజనహితకృత్య నిత్యోబ్బయామాత్య ప్రణీతంబైన యనిరుద్ధచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ తృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు

# అనిరుద్ధచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

---


మత్పాదాంబుజజని
తామరకల్లోలినీపయఃపూతనభో
భూమండలపాతాళమ
హామహిమోదారమంగళాద్రివిహారా. 1

గీ. అవధరింపుము శౌనకుండాదియైనఁ, మునివరేణ్యులతోడ నిట్లనియె సూతుఁ
డాపరీక్షిన్మహారాజు నాదరమునఁ, జూచి విజ్ఞాననిధియైన శుకుఁడు పలికె 2

వ. ఇవ్విధంబున మాసచతుష్టయంబు గడచె నంత నొక్క నాఁడు. 3

సీ. యాదవవృష్ణిభోజాంధకాన్వయవీరకోటులిర్వంకలఁ గొలువుసేయ
శంబరాహితసాంబచారుదేష్ణాదికుమారవర్గంబు నెమ్మదివసింపఁ
గవివందిమాగధగాయకవ్రాతముల్ వితతవాక్ప్రౌఢిసన్నుతులు నెఱప
హితబంధుజనపురోహితమంత్రినికరంబు కాలోచితప్రసంగములు నడుప
తే. స్వామి సాహోపరాకు హెచ్చరిక యనుచు, వేత్రహస్తులు పలుమారు విన్నవింప
మహితరత్నవిభాసభామంటపమున, నెమిఁ గొలువుండె నపుడు లక్ష్మీశ్వరుండు. 4

సీ. చిఱునవ్వుటమృతంబు చిలుకు చెక్కిళ్లపైన క్రకుండలకాంతి యాక్రమింప
ధవళారవిందసుందరమైన కన్నులనుల్లాసరసము రంజిల్లుచుండఁ
గౌస్తుభమాణిక్యకలితవక్షంబునవైజయంతీవైభవంబు మెఱయ
జిగిబిగిసొగసుచేఁ జెలువొందు నెమ్మేనఁ జర్చితచందనచ్ఛాయ దనరఁ
తే. చిత్రసింహాసనమున నాసీనుఁడైయు, పాంతపీఠికనుంచిన యడుగుఁదమ్మి
నతనృపాలశిఖామణిద్యుతుల మెఱఁగ, భువనమోహనశృంగారపూర్ణుఁడగుచు. 5

వ. ఉన్నసమయంబున. 6

సీ. హంసపేరికయంగుననువొందు వల్లకీతంత్రులు వల్లికాతతులు గాఁగ
సుందరముఖపద్మమందస్మితచ్ఛవిసొంపారుపువ్వుఁగుంపుగాఁగ

రాజిల్లుతులసీపయోజాక్షమాలికల్ఫలశలాటులతోడి గెలలుగాఁగ
హరినామసంకీర్తనాలాపనినదంబుశుక శారికాపికస్ఫూర్తి గాఁగ
భసితలిప్తాంగరుచిసితప్రభలునిగుడ, గహ్వరీభాగవిహరణగతివిలాస
జంగమాకారకల్పభూజంబుభాతి, నాకముననుండివిచ్చేసె నారదుండు 7

చ నయనయుగంబునందుఁగరుణారసవృష్టి చెలంగభూషణో
దయరుచిచంచలాలతవిధంబునఁబెంపురహింపసాధుసం
చయముఖచాతకంబులకు సౌఖ్య మొసంగ సభానభస్థలిన్
నయగుణశోభిరై వెలయునందతనూభవనీల మేఘమున్ 8

గీ కాంచియానందహృదయుఁడైకదియవచ్చు, సంయమీంద్రునిఁగనిలేచిసపరివారుఁ
డగుచుఁబ్రణమిల్లి కనక సింహాసనస్థుఁ, జేసియర్ఘ్యాదివిధులఁబూజించునపుడు 9

క శ్రీరస్తుకుశలమస్తు, నోరథసంసిద్ధి రస్తునుత్య శ్రీమ
న్నారాయణభవతేయని, సాకుదీవించిపలికెజలజాక్షునితోన్ 10

క తలిదండ్రులన్నదమ్ములుఁ, గులసతులునుబుత్రపౌత్రకోటియునాప్తుల్
చెలులుంజుట్టములునుభృ, త్యులుఁబౌరులుసుఖులరగుచునున్నారుగదా 11

వ అనిన నమ్ముకుందుండుమందస్మితముఖారవిందుండగుచుశతానందనందనునకిట్లనియె

గీ కమలజాత్మజమీయనుగ్రహమువలన, వర్తమానమునందుసర్వముశుభంబు
భావికాలంబునకును శుభంబునిజము, తావకాగమనంబు నిదానమగుట 13

చ పరమమునీంద్రమీచరణపద్మపవిత్రపరాగ లేశమె
వ్వరిగృహసీమనుంబొరయువారి పురాకృత పుణ్య మెట్టిదో
దురితములన్నియుందొలఁగుఁ దోఁచె భాగ్యము లెల్లఁజేకుఱున్
నిరుపమ మోక్షలక్ష్మియునునిక్కము గాలభియించువారికిన్ 14

వ అని మఱియుఁ దదీయమహిమానురూపంబు లగుమధురాలాపంబులు పలుకుచుండి
తదనంతరంబ, ప్రసంగవశంబుననిట్లనియె

శా అయ్యాయమాయనిరుద్ధుఁ డెందరిగనో యాకస్మికంబాటచె
నయ్యైచోటులఁజూడబంచితిమిగోరంతైననవ్వార్తలే.
దయ్యెన్నాఁదలంచిమామక జనంబత్యంత చింతామయం
బయ్యెట్లున్నది సేయఁగావలయుకార్యం బానతీయన్దగున్ 16

మ అనిసంగృష్ణునిమోముఁజూచిదరహాసాంచన్ముఖాంభోజుఁడై
మునినాథాగ్రణిపల్కె సర్వమునకున్మూలంబపై సాక్షివై
పెనుపన్నన్వఁగఁగర్తవై పరుఁడవై పెంపొందియున్నీవెఱుం
గనిచందంబుననన్నుఁ గార్యమడుగంగా నెంతయున్యూంతనో 17

వ. నే నెఱింగినయర్థంబు విన్నవించెద నవధరింపుము. 18

సీ. శోణపురీశుండు బాణాసురుం డనాహతశౌర్యశాలి సహస్రబాహుఁ
డతనికూఁతురు రూపయౌవనభాగ్యలక్షణ కళావతి యుషాకన్యయొసఁగు
నాయింతకలలోన ననిరుద్ధుఁ బొడగాంచి మోహించి సంతాపమునఁ గృశింపఁ
జెలికత్తెయైతగు చిత్రరేఖాంగన యాత్మీయయోగవిద్యానియూఢి
తే. నింగినే తెంచి శయ్యపై నిదురవోవు, వానిఁ గొనిపోయి యాచంద్రవదనఁ గూర్చ
నతఁడుఁ దత్కాలికించితరతిసుఖాబ్ధి, మగ్నుఁడై యుండె నితరంబు మఱచి యందు 19

ఉ. అంతటఁ గర్భమయ్యె జలజాక్షికి నవ్విధ మెల్ల బాణుఁడా
చెంతి మెలంగునంగనలచే విని దైత్యులఁ బంపు వెట్టినం
బంతముతోడ వారదనుఁ బట్టఁగ వచ్చిన సింహశాబకం
బెంతయుఁ దీవ్రతన్మదగజేంద్రములన్ విదళించు కైవడిన్. 20

వ. హతశేషులు పోయి విన్నవించిన నతండు 21

ఉ. చంపిన నాగ్రహంబున నిశాచరుఁ డార్చి యెదిర్చి పేర్చినం
దెంపును బెంపునుం గలిగి ధీకొని యుద్ధముఁ జేసి చేసిని
ర్జింపఁగలేక దైవగతిచే ననిరుద్ధుఁడు వాని చేత బం
ధింపఁబడెన్ దశాస్యజఫణిప్రద రాన్విత రాఘవాకృతిన్. 22

వ. జంబూద్వీపంబునం గల్గు విశేషంబులం జూచుటకై విశ్వంభరాభాగంబున సంచరించి శోణనగరప్రాంతమార్గంబున స్వర్గంబునకుం బోవుచుండి యీయోగక్షేమంబు వినుటం జేసి తెలియఁ బలుక న్వలసి నిట మీఁదటి కార్యంబు చతుర్థోపాయసాధ్యంబగుట మీచిత్తంబునఁ దోఁచియున్న దే కదా యథోచితప్రయత్నంబు సేయునది మీకు నభ్యుదయపరంపరాభివృద్ధి యయ్యెడుఁ బోయివచ్చెదనని గోవిందునిచేత నామంత్రితుండై నారదుండు యథేచ్ఛావిహారంబుననరిగె అప్పుడు ప్రద్యుమ్నతనూభవ క్షేమవార్తాకర్ణనంబునం బొడమ మోదంబును దదీయపరాజయవృత్తాంతశ్రవణసంజనితం బగు ఖేదంబును దత్పరిపంథి సంహరణోద్రేకం బగు రోషంబును ముప్పిరిగొని హృదయంబులం గలయనల్లి ముఖంబుల నాక్రమింప యాదవసమూహంబులు ముకుందవదనారవిందం బవలోకించుచుండిన వార లగుచుండి రప్పుడు పుండరీకాక్షుండు మంత్రిపుంగవుల నవలోకించి దండయాత్రకుఁ జతురంగబలంబు నాయితంబుగమ్మని నియోగింపుఁడనిన వారును ద్దండ దండనాయకులఁ బడవాళ్లనుం బిలిపించి తత్ప్రకారంబుఁ దెలిపిన వారునుం దదీయ ప్రయత్న పరాయణులై యుండిరి. 23

క. భేరీధణంధణంధణ, భూరిధ్వానమున భూనభోభాగంబుల్
భోరుమని మ్రోసె నాశా, వారణములు బెదరె నదరె వసుధాధరముల్. 24

ఉ. పాపయుతత్రిషష్ఠము శుభస్థితికేంద్రము కార్యపూర్ణదృ
గ్వ్యాపకముం గదాయనిశరాసనలగ్నము చంద్రహోరను

ద్దీపితపుష్కరాంశగణుతించి విశేషమహార్తమంచు మే
ధాపరిపూర్ణులైన సుధావిబుధుల్ వినుతింప నయ్యెడన్ 25

సీ. అంతరాంతరగనిబద్ధానూనఘంటికాఖండఘణంఘణంఘణరవంబు
ఘనగుణోజ్జ్వలసైన్యసుగ్రీవమేఘపుష్పవలాహకతురంగభాసురంబు
ఘనపతాకాగ్రజాగ్రద్గరుత్మద్విపక్షిపక్షరుచ్యభ్రభాసితాంబరతలంబు
చక్రవిభ్రమణసంజనితనిర్ఘోషభగ్నదిశామతంగజకర్ణకుహర

తే. మహితమానవనరుచిర్మరీచికాక్షరాంశు, మాలికోగ్రసహస్రారమండితంబు
నైన రథ మెక్కి పుండరీకాక్షుఁ డపుడు, కదలె శతకోటిసూర్యప్రకాశుఁ డగుచు 26

శా. ఖేలత్తాళతరుధ్వజస్ఫురిత మైక్రేంకారపత్కింకిణీ
మాలాజాలనిభాత్యుదాత్తగళశుంభద్ఘోటకోదగ్రమై
శ్రీలం బొల్పుచు శాంగ మెక్కి యరిగెన్ సీరాయుధుండుల్లస
త్కైలాసాచలసన్నిభప్రభలసంగన్యంగరోద్యోగియై 27

చ. నిరుపమపద్మరాగమణినిర్మితభూషణసంప్రయుక్తసుం
దరతరదీప్తవిగ్రహఘనద్యుతిపుంజము సేంద్రచాపవి
స్ఫురితపయోధరంబు గతిఁ జూడ్కుల కింపొనరింప మన్మథుం
డరిగె ప్రమీనకేతనసమగ్రశతాంగపరాధిరూఢుఁడై 58

క. కృతవర్ముఁడు దేహోలం, కృతవర్ముఁడు శిఖరకరపరిస్ఫుటసంధీ
కృతచర్ముఁ డభీకరధీ, కృతసర్మ్ముఁ డనగ మనరిగెఁ గృష్ణునిమ్రోలన్ 29

ఉ. సాత్యకి హారుధేష్ణగదసాంబముఖుల్ యదువీరులేగి రా
ద్యత్యమనంగురంగమమతంగజతుంగశతాంగసంస్థులై
హేత్యురుదీధితిచ్ఛటలు హేళివిలాసము నాక్రమింపలా
లిత్యసితాతపత్రచరళీకృతచామరరాజమానులై 30

సీ. చటులఖురాదండసంభూతఘాతాంకురపరంపరాహతిని మేఘపఙ్క్తి చెదర
రసుశ్రీయదంతనిర్మలచాకచక్యకాంతులు పట్టపగలు వెన్నెలలు గాయ
నై పాదఘాంకారఘోషాచ్ఛటిని ఖేచరాంగనల్ పతులఁ గవుంగిలింపఁ
జరదగ్రవిగ్రహాస్ఫురణప్రక్రీకఁబు నర్జనితపకషాహార్యశంక వొడమ

తే. ఘంటికాకింకిణీమాలికాసమూహ, ఘణఘణంఘణకిణికిణికిణిని నాద
తాళపైలంబయానావధానములను, గంధబంధురసింధురఘటలు నరిగె 41

సీ. తేళ్ళభంగిని శౌకళించి చౌపుటములోపక్కమడిపదినైదు నుఱికియుఱికి
పారరకత్తైసలెనిల్చి యడుగులోనడుగుగా నాట్యంబులాడియాడి
కమ్మరసారెలకొలఁదిగిఱ్ఱున నంచుదిక్కులవలయములు ద్దిరిగితిరిగి
యనిలంబురీతి ఱివ్వునఁ దూఁగిధరణిపైఁ బదములు నిలుపక పఱచిపఱచి

తే. కరినరింఖాముహుర్ముహుర్లుఠితభూప, రాగధూసరితామలరమ్యచిహర
సంచరద్విధూతఖచరచేలాంచలంబు, లగుచుఁగిహికిహికార్భటినరిగెహయలు 32

భుజంగప్రయాతము.

భ్రమచ్చక్రనిర్ఘాతబాహుళ్యధాటిన్, క్షమామండలంబెల్ల సంక్షోభమందన్
సముత్తుంగరంగద్ధ్వజచ్ఛన్నకుంభ, త్తమోభిత్పథంబుల్ రథంబుల్గమించెన్. 33

శా. చిల్లాడంబులమీఁదటన్బిగువుకాసెల్జుట్టిపాంకంబువా
టిల్లన్వంకులుచెక్కి శూలములునీఁటెల్కత్తులుం గేళముల్
బల్లెంబుల్గొదలైనసాధనతతుల్బాహాబలోద్వృత్తిసం
ధిల్లం దాల్చిపదాతికోటినడిచెన్ దిక్చక్రమల్లాడఁగన్ 34

చ. గొడుగులు శ్వేతచామరలు కుంజరము ల్తిమిన క్రసంచయం
బుడుగనివాద్యఘోషముమహోర్మిరవంబుపరిభ్రమింపఁగాఁ
బడుపటుహస్తిభాస్వదరిపజ్తులునుళ్లునుగాఁగ నెక్కుడున్
నడిశరచాపముల్ గలిగివాహినివాహినిలీలనేగఁగన్ 35

గీ. క్షేమకారిదీర్చెచెలరేఁగియనుకూల, మారులంబువీచెమాంసఖండ
ములును బూర్ణకుంభములు పుష్పఫలములు, నెదురుపడియెఁగురగహేషలెసఁగె 36

వ. మఱియుఁ గళ్యాణకరంబులైనశకునంబు లెడనెడం బొడగనుచు నవుచు ముదంబున భూసురసమూహంబు లచ్చైచ్చస్వనంబుననాశీర్వదించి దిగ్విజయోస్తుశ్రాస్తు వచన బాహుళ్య నినాదంబులును, బసిండిపళ్లెరంబులఁగర్పూరదీపికా సముదయంబు నించి నీరాజనంబు లొసఁగుచు బ్రాహ్మణ పుణ్య వనితాజనంబులు జయమంగళంబని పాడు మంగళకౌశిక రాగస్వరంబులును, సౌధశిఖరంబులందుండిశూరుచుఁ గుసుమలాజాక్షతవితానంబుపైఁ జల్లు పురంధ్రీనికర కరకంకణకాంచనకాచ రుచిరఝణత్కార నాదంబు లిరుపార్శ్వంబులనిలిచివాద్యగద్యపద్యంబుల బాహాటంబునం బొగడునంది మాగధసందోహంబులజయవిజయీభవశబ్దంబులును, విపంచీస్వరమండలరావణహస్తాదిజంత్రవాద్యంబులు మీటుచు సంగీతంబులుసేయు నాయకోత్తముల షడ్జ మధ్యమ గ్రామరవంబులును, భేరీమృదంగ పణవానక డిండిమ ప్రముఖవాద్య ధణధణత్కార రావంబులును, శంఖకాహళ వేణుప్రభృతితూర్య నిస్వనంబులును సమదవారణఘీంకారఘోషంబులును, గురంగహేషానినదంబులును, శతాంగచక్రనిర్ఘోషంబులును, బఖికనికరశరాసనపుఞసింజినీ టంకారవిరావంబులును నేకీభవించి బ్రహ్మాండభాండ మధ్యంబునం బూర్ణీభవించి మహాకోలాహలంబై రాకానిశాకర బింబోదయ సందర్శనసముత్సాహసముజ్జృంభమాణ మహాంభోనిధిననుకరింప ద్వాదశాక్షోహిణీబలసమేతుండై కతిపయప్రయాణంబుల శోణపుటభేదనోపాంత ప్రదేశంబుఁజేరి యనర్ఘకిరణవ్యాప్తచ్ఛాయాసాంద్ర సకలమహీరుహశోభితంబును, మధురజల సంపూర్ణప్ర

వాహ తటాకవాపీ సమూహభూయిష్ఠంబును నైన మనోహరస్థలంబునఁ బటకుటీరం
బు లెత్తించి యచ్చట వేలాంఘనంబుచేసి రాసమయంబున 37

క. బాణాసురగర్వము సం, క్షీణంబగు నింక ననుచుఁ జెప్పిన క్రియఁగీ
ర్వాణులు సంతసమందఁగ, క్షోణిం దత్కేతనంబు గూలెం బెలుచన్ 38

వ. అప్పు డమ్మురాంతకుండు తత్పురంబు దాడివెట్టం బంచిన. 39

సీ. ప్రాకారములు ద్రవ్వి పడఁద్రోయువారును గోపురంబులు నేలఁ గూల్చువారు
సౌధయూథము నేలచదును చేసెడివారు నవభూజములు పీకివైచువారు
కమలాకరములు భగ్నము సేయువారును ధనవస్తువులఁ గొల్లఁగొనెడివారు
యజ్ఞశాలలు వహ్ని కర్పించువారును డెగి పౌరజనుల బాధించువారు
తే. నగుచు యాదవవృష్ణిభోజాంధకాది, యోధవీరులసైన్యంబు లుక్కుమిగిలి
తత్పురం బాక్రమించి యుద్దండవృత్తి, దాడివెట్టుట కబ్బాణదైత్యవిభుఁడు 40

మ. నటదుద్యద్భ్రుకుటీభయంకరముఖాంతశ్శోణదృక్కోణవి
స్ఫుటదీప్తిచ్ఛటవిస్ఫులింగపటలోద్భూతంబు గావింపను
త్కటధాటీపటుతాకహాకహకహధ్వానాట్టహాసార్భటిం
జటులాహంకృతివిస్తరిల్ల సమరోత్సంక్రీడనోత్సాహియై 41

మ. రణభేరీప్రకటాంకభాంకరణసంరావంబు త్రైలోక్యభీ
షణమై మ్రోయ భుజాసహస్రసముదంచచ్చాతహేతిచ్ఛటా
ఘృణిశోభిల్ల ననర్ఘ్యరత్నఖచితప్రేంకచ్ఛతాంగాధిరో
హణుఁడై సంగరకేళికిన్ వెడలె నుద్యద్వాహినీయుక్తుఁడై 42

గీ. వాని మొగసాలఁ గాఁపున్నవాఁడు గాన, యుద్ధసాహాయ్యమునకు నుద్యుక్తుఁడయ్యె
భక్తసులభుండు శాంకరీప్రాణనాథుఁ, డనుఁగుఁజెలికానితోఁ గొంత పెనఁగుటకును.

వ. అప్పుడు 44

సీ. ఘనవాలవిక్షేపజనితవాతాహతి దిగ్వలయంబు దిర్దిరను దిరుగ
వడిఘణిల్లున నంకెవైచిన మేరుమందరశైలములు ప్రతిధ్వనులనీన
గుప్పించి యుఱికినఁ గుంభినీభారంబు సైఁపక దిక్సామజములు మ్రొగ్గఁ
గ్రొవ్వాడికొమ్ములకొనలచిమ్ముల బలాహకసమూహము వకావకలు గాఁగఁ
తే. గంఠవిలురన్మహోజ్జ్వలఘంటికాప్ర, భూతఘణంఘణస్వనస్ఫురణ దనర
విజితరజతాచలస్ఫూర్తి వృషభమూర్తి, నీలకంఠుని ముందర నిలిచె నపుడు 45

సీ. ఘనజటాజూటసంకలితగంగాతరంగచ్ఛటల్ గళగళంఘళ యనంగఁ
జలితావతంసకోమలసరిస్రవసుధాసారంబు ఝుళఝుళంఝుళ యనంగఁ
నంగసంఛాదితవ్యాఘ్రేంద్రచర్మసంచలనముల్ బెళబెళబెళ యనంగఁ
గలపరిభ్రమితభీకరశాతశూలనిర్మలదీప్తి తళతళతళ యనంగ

తే. శంకరుఁడు నందిపై నెక్కి హుంకరించి, యతిశయార్భటిఁ గెవ్వన నార్చి పేర్చి
చౌకళింపులు దుమికించి చక్రగతుల, దరిమి పేరంబు ద్రోలుచు నలగె ననికి. 46

క. చంచత్కౌ మలపింఛో, దంచిత శిఖీంద్రవాహనారూఢుండై
వెంచేసె భవుని వెంబడిఁ గ్రౌంచవిభేదనుఁడు ప్రమథగణపరివృతుఁడై 47

లయగ్రాహి

తుంగములు ఫూత్కరచండపవనంబు ఘనమండలముఁ దాఁకి బహుఖండములు సేయన్
మెంపుకొని సీంకృతులు దండిసల సీసహభవాండఘటమన్యము నిండి కడు మ్రోయన్
గండములపై మదమఖండఘణి శింగురియుచుండఁ బటుదంతరుచిమండితము గా వే
దండపులతుండములు ఖండనజయోద్ధతిని గొండ గతి నడిచెఁ బాండవకులేంద్రా. 48

స్రగ్ధర. రింఖాసంఘాతజాతావతవితతధరారేణుపంకీకృతాబ్ధుల్
ప్రేంఖన్మాణిక్యమాలాధృతకళలురదాభీలఘంటారవంబుల్
పుంఖీభూతాస్త్రిమార్గీస్ఫుటనికటధనుస్ఫూర్జితారోహకంబుల్
కంఖాణంబుల్ విచిత్రక్రతుగమనచమత్కారలీలం గమించెన్ 49

తోటకవృత్తము

పాటవబాహపటుత్వతనూభృ, చ్ఛాటసురాలయశైలవిభాతిన్
హాటకరత్నమయస్ఫుటదీప్తుల్, దాటి చెలంగి గధవ్రజమేగెన్ 50

మ. కృత నానావిధసాధనక్రమసమిత్క్రీడాచమత్కారని
ర్జితబేతాళులవక్రవిక్రమగుణశ్రీతుల్యకంఠీరవుల్
శతకోటిప్రతిమానవిగ్రహులు దంచద్దివ్యజాంబూనద
క్షితిభృత్తుంగబలసంఘముల్ నడిచె నక్షుణ్ణప్రతాపోన్నతిన్ 51

గీ. ఇట్లు చతురంగసేనాసమేతుఁడగుచు, నరిగె నెప నెపఁ బొడగాంచు నాపజయిక
శకునముల నాత్మలోపల సరకుగొనక, దురభిమానంబు పేర్మి నిర్జరవిరోధి. 52

వ. అప్పుడు. 53

మ. పరమేశుల్ భగవంతులవ్యయులు శుంభద్బాహుశౌర్యోజ్జ్వలుల్
హరిమృత్యుంజయు లిద్దఱున్ రణమునెయ్యం జూచు నుత్కంఠచే
సరసీజాసనపాకశాసనసమస్తబ్రహ్మదేవర్షికి
న్నరసాధ్యాదులు మింట నిల్చిరి విమానవ్రాతసంరూఢులై. 54

వ. యాదవసైన్యంబును నిస్సామాన్యం బగు నుత్సాహంబున దానవ సేనాసమూహంబు నెదుర్కొనియె నట్టియెడ నుభయబలంబులును సంవర్తనసమయ సముజ్జృంభమాణా న్యోన్య సంఘర్షణపూర్వాపర మహార్ణవంబుల విధంబున నొండొంటిం దాఁకి రథికులు రథికులును, వారణారోహకులు వారణారోహకులును, నాశ్వికులు నాశ్వికులును, బదాతులుఁ బదాతులును, ద్వంద్వయుద్ధంబునకుం గడంగి కోదండ దండంబు లంకించి సింజి

నీటంకారనినాదంబులు రోదసీకుహరంబునిండ నాకర్ణసంధాన దృఢముష్టిలాఘవ
లక్ష్యశుద్ధిదూరాపాతవిశేషంబులం బ్రచండంబులయినకాండప్రకాండంబులు సం
ప్రయోగించి రథరథ్యకేతుసూతవ్రాతంబుల మర్మఘాతంబునొప్పించుచు, మృత్యు
జిహ్వాకరాళంబు లగుకరవాలంబులు సౌదామనీలతావితానంబులపోలికం దళత్తళా
యమానంబులై చూపులకు మిఱుమిట్లుగొలుప ఝళిపించి దేహంబులు పక్షించి తు
నుకలై పడనఱుకుచు నసక్రవిక్రమంబునం జక్రంబులు గిరగిరం ద్రిప్పివైచి ఛత్రచా
మర ధ్వజదండంబులు ఖండంబులు సేయుచుం, బ్రజ్వలజ్జ్వలన కీలాజాలంబుల లీలం
గ్రాలుశూలంబుల నాభీలంబులగు శతాంగ మాతంగ తురంగాంగంబులు భగ్నంబులుగాఁ
గ్రుమ్ముచుం, గిరోరంబులగుకుఠారంబులెత్తి కంఠీరవంబులం గ్రేవనకుంఠ కంఠారవం
బులు చెలంగ నుదశ్శిరకరచరణప్రముఖాంగంబులకొఱకు నఱుకు దారుశకలంబుగతి
వికలంబులు సేయుచు, బల్లంబుల మొల్లంబులగు నుల్లాసంబులం గ్రేళ్లురుకుచు, బల్లెం
బులు బుచ్చుకొని ఘల్లునం బెల్లార్చి గాయంబులనమేయంబులై కీలాలప్రవాహం
బులు దొఱలంగం బొడిచి పడఁజిమ్ముచు, మదోద్రేకంబున గదాదండంబులు విసవిసం
ద్రిప్పి గాత్రంబులు నుగ్గునూచంబులుగాఁ గొట్టుచు శ్వసనాశనసంకాశంబు లగు
పాశంబులు వీరావేశంబులం గండదేశంబులం దగులం బ్రయోగించి ప్రాణంబులు క్షీణం
బులుగాఁ బడనీడ్చుచు, మఱియుఁ బ్రాసపట్టిస ముసలముద్గర తోమరభిండివాల శక్తి
క్షురికాది నానావిధాయుధంబులం గొట్టివేసి నఱికి చీరించి చెండాడి గగ్గోలుపఱ
చినం జంభవిద్వేషికరాంభోజకుంభద్దంభోళిధారాహతంబులైన విశ్వంభర 'ధరంబుల
చందంబునం గూలి పీనుంగులైన యేనుంగులును బుడమిం బడి తన్నుకొనుచుఁ గంఠగ
తప్రాణంబులైన కంఖాణంబులును యుగయుగ్యచక్రకూబర సహితంబుగా హతాం
గంబులైన శతాంగంబులును గూలినకేతనంబులును, చిత్రరూపంబుల విధంబున
విగత విక్రమార్భటులైన భటులును, సోలినరాహుత్తులును, రాలినభూషణమణిగణం
బులును, వ్రాలిన ఛత్రచామరంబులును, వికలంబులైన దంతంబులును, శకలంబులైన
కుంభస్థలంబులును, వ్రక్కలైన డొక్కలును, జెక్కలైన ప్రక్కలును, భిన్నంబు
లైన కపాలంబులును, ఛిన్నంబులైన కపోలంబులును, విఱిగినచరణంబులును, జిరి
గిన చర్మంబులును, శీర్ణంబులైన కర్ణంబులును, జూర్ణంబులైన వర్మంబులును, గలిగి
మహాబిలంబునం గోటానకోటులును, దట్టంబులై యట్టలాడం జొచ్చె గజవాజికళేబ
రంబులు జీమూతంబులును, సాంద్రచంద్రహాస ధగద్ధగితద్యుతులు శంపాలతలును,
శంఖదుందుభిస్వనంబులు మేఘనిర్ఘోషంబులును, గదాముసలముద్గరఘాతంబు లశని
పాతంబులును, విశీర్ణభూషణపద్మరాగ గారుత్మత ఘృణిరేఖ లింద్రధనువులును,
విభిన్నకుంభికుంభచ్యుత ముక్తాఫలంబులు వర్షోపలంబులును, గాకగృధ్ర ప్రభృతివి
హంగంబులు చాతకంబులును, శోణితపూరంబు జలాసారంబునునై, యోధయోధ
ధనుర్విముక్తంబులై గగనదేశంబు నిరవకాశంబుగా నిండి కల్పితాంధకారసైన్యం

నైన బాణబాహుళ్యంబువలన మార్తాండమండల గోచరలక్షణంబులేమిగుర్దినంబై యుత్కర్షవర్షాగమంబు ననుకరించియుండెనప్పుడు వేతాళ ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ ప్రముఖభూతంబు లుత్సాహసమేతంబులై మాంసఖండంబులు కడుపులనిండ మెక్కి రక్తపానంబుచేసిన గఱ్ఱునం ద్రేపుచు, శ్వేతతురంగ చర్మంబులు ధవళాంశుకంబులుగా ధరియించుకొనుచు, మేదఃపంకంబు రక్తజలంబులం బదనుచేసి లేపనంబులుగాఁ దనువుల నలందికొనుచుఁ దునుకలై పడిన యాతపత్రంబులఁ బువ్వులుగానలంకరించుకొనుచు, గజకళేబరంబులు పర్యంకంబులుగాఁ బన్నించుచు, ఘోటకాండంబులు క్రముకఖండంబులును గుంజరకర్ణంబులును తాంబూలపర్ణంబులును, పసలుచూర్ణంబులునుంగాఁగలయ నమలి విడియంబులుచేసి జిహ్వాలోకనంబులుచేసికొనుచుఁ గామినిభూతంబులతోడి సురతక్రీడావిలాసంబులం జొక్కుచు, గంధర్వపిశాచంబులు సేయుగాంధర్వస్వర సంగీతంబులకు నానందంబునొంది కరితురగనరమాంసంబులు త్యాగంబులిచ్చుచో వారల గానంబులకుఁ దాముం దమవదాన్యతాసౌందర్యవిశేషంబులకు వారును శిరఃకంపంబులుచేసి మెచ్చుకొనుచు, నివ్విధంబునవివిధభోగంబులందనిసి యుభయబలంబులం బొగడుకొనుచుం దాండవంబులుసలుపు నమ్మహాకోలాహలంబువలన సంగరప్రకారంబు ఘోరంబైవర్తిల్లెనందు 55

చ హరిహరులిద్దఱుంగదిసియాహవకేళియొనర్చిరుద్ధతిన్
సురనికరంబులబ్బపడిచూడఁగశార్ఙ్గపినాకచాపముల్
కములఁబూనియొండొరులకంఠభుజోరులలాటమర్మముల్
గురుతరచండకాండములఁగ్రుచ్చుచురోషమహోగ్రమూర్తులై 56

మ హరుఁ డాకర్ణధనుర్గుణుండగుచుబాహావిక్రమక్రీడని
ష్ఠురనారాచపరంపరల్వఱపినన్సొంపారునెమ్మోమునన్
దరహాసద్యుతివింతయైనిగుడఁబద్మానినీజానిభీ
కరబాణంబులవానినన్నిటివెసన్ఖండించె నొక్కుమ్మడిన్. 57

క. భగవంతుండగుశంభుఁడు, గగనదిశాపూరితముగఁగడుఁదీవ్రతతో
నగణితవిశిఖౌఘంబులు, నిగిడించిమహోగ్రతమమునిండఁగఁజేసెన్, 58

మ గరుడాంకుండరుణాంతనేత్రుఁడగుచుజ్జ్వాలాగ్నిసంకాశభీ
కరకాండాళిఁదదంధకారముడఁగంగాఁజేసెనాతీవ్రతం
బరివేషస్థితినుండెవిల్లురవిబింబస్ఫూర్తినొప్పెన్ముఖాం
బురుహంబుగ్రమయూఖలీలఁదనరెన్బుంఖానుపుంఖాస్త్రముల్. 59

ఉ మఱియుననేకబాణములుమర్మములంటఁగ నేసిహుంకృతుల్
శౌరియఫాలలాటలోచనుఁడునిష్ఠురశాతశిలీముఖావళుల్

కలకటి నేసె నేసినను గంజదళాక్షుఁడు దానినన్నిటిన్
నలికినిశాతకాండములనాటఁగ నేసెఁ దదీయదేహమున్ 60

శా. ఆసంరంభముఁ జూచి సైఁపకహరుం డాగ్నేయబాణంబుఁ బ్ర
జ్ఞాసామర్థ్యముతోడ నేసిన ఘనజ్వాలావృతంబై పయిన్
రాసత్యారమణుండు వారుణమహాస్త్రంబుం బ్రయోగించి సాం
ద్రాసారంబగు వారిపూరమున మాయం జేసె నత్యుద్ధతిన్ 61

ఉ. శర్వుఁడఖర్వగర్వమున శౌరిపయిన్ మరుదంబకంబు గం
ధర్వసుపర్వపన్నగవితానము లద్భుతమంద నేసినన్
సర్వమయుండు చక్రియది సంహరణంబొనరించె నుజ్జ్వల
త్పర్వతసాయకంబున విపక్షబలంబులు దల్లడిల్లఁగన్ 62

శా. ఆటోపంబున శంకరుం డపుడు బ్రహ్మాస్త్రంబు సంధించి మౌ
ర్వీటంకారమెసంగ నంబుధియు ఘూర్ణిల్లంగ నేయన్ని రా
ఘాటంబై చనుదేరఁగన్గొని తదుగ్రస్ఫూర్తి వారించె దో
షాటధ్వంసి తదంబకంబున నవస్త్రశ్రేణి కీర్తింపఁగన్ 63

శా. అత్యుగ్రాకృతియైన పాశుపతదివ్యాస్త్రంబు భూతేశుఁడౌ
ద్ధత్యం బొప్పఁగ నేసె నప్పుడు మహోద్యద్విక్రమస్ఫూర్తినౌ
న్నత్యంబై యసమానమై వెలుఁగు శ్రీనారాయణాస్త్రంబు సం
స్తుత్యప్రాభవశాలి కృష్ణుఁడు సమంత్రోక్తిం బ్రయోగించినన్ 64

మహాస్రగ్ధర. రాలెన్నక్షత్రపఙ్క్తుల్ రహిచెడియె నహోరాత్రరాణ్మండలంబుల్
వ్రీలెన్ దిక్కుడ్యసంధుల్ వీఁగిపడియె నుర్వీధ్రశృంగంబులోలిం
దూలెన్ మేఘాఘ మత్యద్భుతజనపవనోద్ధూతధూళీసమంబై
కూలెన్ పృష్ఠాళి మ్రొగ్గెన్నిలయభరభృత్కుంభికుంభీనసంబుల్ 65

క. ఖండేందుధరజనార్దన, కాండము లొండొంటిఁ దాఁకి గగనంబునను
ద్దండగతిఁ బోరి పోరి ప్ర, చండత హరిశరము హరునిశరముం దోలెన్. 66

తే. తనదు దివ్యశరంబులు దైత్యదమను, చే నిరర్థకమగుటయు మానసమున
నూహదక్కి రణోత్సాహ ముజ్జగించి, యుండెఁ గల్యాణశైలకోదండుఁ డపుడు. 67

మ. జలజాతాక్షుఁడు వక్రవిక్రమమునన్ సమ్మోహనాస్త్రంబు భూ
తలసంక్షోభముగాఁగ నేయుటయు నిద్రాపారవశ్యంబుతో
వెలవొప్పన్ వృషభేంద్రుమూఁపురముపై వ్రాలెన్ హరుం డొయ్యనన్
కలధౌతాచలశృంగసంగతశరత్కాలాంబువాహాకృతిన్. 68

వ. రుక్మిణీకుమారుండును గుమారుండును నుద్దండపుండరీకంబులవిధంబున నంగడంగి కోదం
డపాండిత్యంబు భువనస్తుత్యంబుగా ఖండనంబు సేయుచు. 69

మ. శరజన్ముండు ప్రదీప్తరోషముఖుఁడై శాతాశుగశ్రేణినా
హరిజున్నొవ్వఁగ నేసియార్చినమహోగ్రాకారుఁడై పేర్చిశం
బరవిద్వేషిశిలీముఖప్రకరసంపాతంబునన్ముంచిజ
ర్జరితాంగుండగునట్లుచేసెసురలాశ్చర్యంబునంబొందఁగన్. 70

తే. నారిఁదెగ నేసి యతనిమయూరవాహ, నంబునెమ్మేననిశితబాణములుచొనిపి
చేతులాడకయుండంగఁజిక్కుపఱుప, నిలువలేకవిశాఖుండుతొలఁగిచనియె 71

ఉ. చండతరప్రతాపభుజశౌర్యధురంధరుఁడైన కాముపా
లుండుహలంబుచేరణములోమడియించెనసూపకర్ణ కుం
భాండులభీమహుంకరణభగ్నపయోజభవాండభాండులన్
ఖండనభైరవస్ఫుటకృపాణమహోజ్జ్వలబాహుదండులన్ 72

గీ. సాంబుఁడత్యుద్రరౌద్రావలంబుఁడగుచు, బాణనందనునధికదోర్బలునివలుని
గదిసివివిధాస్త్రశస్త్రసంఘాతములను, భూచరులుఖేచరులుమెచ్చఁబోరిపోరి. 73

గీ. గుఱ్ఱములఁజంపికేతువుఁగూలనేసి, రథముచెక్కలుసేసిసారథినిద్రుంచి
ఘనతరాశుగపీడితాంగునిగఁజేయ, నసురపతినందనుఁడుపలాయనమునొంద 74

శా. సైనేయుండును బాణుఁడున్రణజయోత్సాహంబులాస్యంబులన్
బూనం గార్ముకశింజినీఘనరవంబుల్దిక్కులన్నిండన
స్త్రానీకక్షతజాతరక్తజలపూరార్ద్రాంబులైనట్టినె
మ్మేనుల్పుష్పితకింశుకంబులగతిన్మ్మఱంగఁబోరాడుచున్. 75

వ. ఉండె రట్లవాసుదేవుండు సమ్మోహనబాణపాతంబున భూతేశుఁ జరవశుంజేసి లబ్ధవిజయుండై నిరుపమోత్సాహంబున నిజవదననిర్గత నిరర్గళ నిష్ఠుర నినాదనిర్భిన్ననిఖిలనిర్జరాహితసైన్యంబగుపాంచజన్యంబుఁ బూరించుచు విరోధివరూధినిపయింగవిసి కరాధిజ్య ధనుర్ముక్తశరాధిక్యఘాతంబుల నరిశిరోధినిచయంబులునఱకిగారాధనంబు సేయుచుఁ గరాళంబులగుకరవాలంబులఁ గరిహరిప్రకరవాలంబులుశీలాలంబులుహేరాళంబులై తొరఁగ దునుముచు దృఢవంతంబులైనకుంతంబులఁ బంతంబునదంతంబులు విఱుగంబొడిచి దంతావళంబులనంతంతనకృతాంతనిశాంతంబున కనుపుమనసదృశంబులగు ముసలంబులుకరబిసరుహంబుల విసవిసంద్రిప్పియసురవిసరంబులుపసచెడి వసుమతింగలయనసువులంబాపుచుఁగదలమెఱుంగులుచదలంబొదలంద్రిప్పుచు వలదని మదంబులంగదిసి యెదురుకొనిపాదువుపదాతులంగదలమెదలనియ్యకవదనంబులుచదిసి రదనంబులుడుల్లి గుములుగొనుచుంజావమోదుచు నంతకంతకు నతిశయంబైనవీరావేశంబునంబ్రళయకాలరుద్రాకృతింబేర్చిరక్తప్రవాహంబులను మాంసరాసులనుబ్రేవులప్రోవులను నెముకల గుట్టలునునై రణంబతిదారుణంబుగఁ జిత్రక్రీడసలుపుచుఁ బాంచజన్యజృంభిన్నినాదంబులు భూనభోంతరంబులునిండఁబూరించుచుండె నపుడు. 76

సీ. సారథుల్వ్రాలినవశ్వములీడ్చుకొనిపోవనందందపడిపోవురథములును
దైన్యఘీంకారనాదములు సేయుచుఁ బటాపంచలై పాఱెడుభద్రకరులు
నేలఁబడియెదురెక్కఁజాలక హాహారవములతో నవజచెడిఘోటకములు
నని మొనఁ ధైర్యములు చాలక తలల్వీడంగఁ బరువెత్తువీరభటులు
తే. నగుచుఁ గాళిముదమున బాహాప్రచండ, కార్ముకజ్వాలతాముక్తకాండపటల
దహనకీలాకలాపసంతానమున నకుఁ, దాళక పలాయనమునొందె దనుజబలము 77

వ. అప్పుడు 78

ఉ. విచ్చినయాత్మసేనఁ గని వీరుఁడు బాణుఁడు తెంపుచూపఱుల్
మెచ్చఁగఁ జేయివీచి మరలించినఁ దద్బలమెల్ల రోషముల్
హెచ్చఁగ నొక్కటన్మరల నేపున సైన్యయుగంబు పోరికిం
జొచ్చినసంకులాహవము చూడ భయంకరమయ్యె నయ్యెడన్ 79

శా. బాణుం డప్పుడు రోషరక్తముఖుఁడై బ్రహ్మాండభీమాకృతిన్
జాణూరాంతకు డాసి మామకభుజాంచద్ధాటి చేసంగర
క్షోణిం బన్నగసిద్ధకింపురుషరక్షోయక్షగంధర్వగీ
ర్వాణుల్ నిర్జితులైరి నాయెదుట నివ్వేళన్నీవు శక్తుండవే 80

చ. అనవుడు మందహాసముఖుఁడై హరి నీభుజశక్తి నీవె సె
ప్పనము నలజ్జ లేక పలుమాఱును మెచ్చుకొనంగ నీతియే
యని మొననిల్చినప్పుడు నిరర్థకమీ వెడమాటలేల నాఁ
కొని భుజియింపఁ బోవుచున్న గూరలు మేలడుగంగ నేటికిన్ 81

మ. అనునాలోనన హస్తపంచశతకోదండచ్ఛాపుఁడై నిల్చి తి
క్కిన యేనూఱుకరంబులన్ శరములుత్కృష్టప్రతాపంబునం
గొనిపెట్టేయఁగ మండలీకృతమహాకోదండము స్సార్ధచం
ద్రనిశాతాంబకపఙ్క్తిఁ ద్రుంచెన విరోధానాయకుండుద్ధతిన్ 82

సీ. శతములు వేలు లక్షలు కోటు లర్బుదంబులు శరౌఘంబులఁ బొదివి పొదివి
వాయవ్యగారుడవారుణప్రముఖదివ్యేషుజాలంబుల నేసి యేసి
కరవాలశూలముద్గరశక్తితోమరప్రాసాయుధంబులఁ బఱపి పఱపి
శాంబరీమాయావిడంబనం బొనరించి శిలలు నెత్తురుఁ గురియఁ జేసి చేసి
తే. యసురభర్తవిజృంభించియార్చుటయును, నదుమనన్నింటి ఖండించి పొడవడంచి
త్రుంచి మాయించి కడు విక్రమించి మించి, తనప్రతాపంబు చూపె నద్దనుజవైరి. 83

వ. మఱియును 84

ఉ. అత్తఱినమ్ముకుందుఁడుఁ దదర్ధసహస్రశరాసనంబులన్
గత్తిమొగంపుటమ్ములను గండ్రలు సేయుచునుండ నంతలో

నెత్తెడువిండ్లు నారిబిగు వెత్తెడువిండ్లు శరప్రయోగసం
పత్తిఁ జెలంగువిండ్లనటు బాణుకరంబులనొప్పె వింతయై. 85

చ. తొలుతటియమ్ము పంచశతదోర్ధనురావళి ద్రుంచి కొంచున
వ్వఁ జననింతలో మొదలివై పున బాణుఁడు గ్రమ్మఱంగరం
బులఁగొను చాపముల్ నఱికి పోవుచు రెండవయమ్ము ముందరన్
వెలుఁగు శరమ్ము గూడ దివిఁ జెండె హరిప్రదరంబు లీగతిన్ 86

శా. కోపాటోపవిజృంభణారుణితచక్షుష్కోణసంజాతవి
క్షాపాతంబులు మేనఁ జొచ్చి వెడలెన్నాఁ బోలు నన్నల్లత
చ్చాపోద్భూతశరౌఘముల్ త్రిదశసంచారంబులై యష్టమం
దాపూర్ణంబుగ నాటి వెల్వడు సురేంద్రారాతి దేహంబునన్ 87

చ. ధనువులు ద్రుంచి సూతుతల ధారుణిమీఁద నలంకరించి వా
హనముల సంహరించి సముదంచితకాంచనకేతనప్రభా
తన మొనరించి మైరుధిరధారలు గ్రమ్మఁగ నొంచి మించి య
ద్దనుజవిరోధి యొత్తెఁ గృతదానవదైన్యము పాంచజన్యమున్ 88

క. మతి బ్రమసి నల్లు నిశ్చే, ష్టితుఁడై చెగడొందు బాణు జీవము గక్షిం
చ తలంపున ముదిరక్కసి, యతినిజననికోటరీసమాహ్వయ యంతన్ 89

ఉ. అంబరహీనమైన వికృతాకృతితో డుతనాభి క్రేవలన్
లంబకుచద్వయంబుగ దలంబులు చెక్కుల జాఱ శిరో
జంబులు వ్రేలనమ్ముది నిశాచరి ఖేచరియై పిశాచరీ
తిం బఱతెంచి నిల్చె నసుదేవతనూభవు సమ్ముఖంబునన్ 90

శా. దానిం జూపఁగ రోయుచున్ విముఖుఁడై దైత్యాంతకుం డున్న నా
లోనం బాణుఁ డెడంబు గాంచి పఱచెన్ లోకుల్ ప్రమోదింపఁగా
మానంబెల్లను వీడి యాత్మనగరీమార్గంబునన్ భీతిదృ
క్పౌనఃపున్యతఁ బాదఘట్టనల భూభాగంబు గంపింపఁగన్ 91

ఉ. ఆహరిముందటన్ నిలిచినట్టి నిశాటియు నేగె నంతస
మ్మోహనబాణపాతమున ముంచిన తొంద్రికముం దొఱంగి కా
మాహితుఁ డంప శాంభవమహాజ్వరముం త్రిమస్తకంబులున్
బాహువులున్ ద్రిసంఖ్యలను బాసిలఁగా నతిఘోరమూర్తియై 92

మ. తనమీఁదం జనుదేర నవ్వుచు నుబద్ధానేత తీవ్రజ్వరం
బును బంపన్ భయదాకృతిం గదిసి యార్పుల్ మింటనంటంగ దాఁ
కిన నారెంటికి నయ్యె నాహవము సోత్కృష్టప్రతాపోగ్రత
ర్జనసంభర్జనగర్జనంబులు జగత్సంక్షోభముం జేయఁగన్. 93

తే. పోరిపోరి భుజాబలస్ఫురణదక్కి, శాంభవజ్వరమాత్మలో సంచలించి
వైష్ణవజ్వరమధికజవంబుతోడ, వెంటనంటంగనార్తితో వెఱచిపఱచె 94

ఉ. ఎక్కడఁ జొచ్చినం జుణుఁగనీయ్యక వైష్ణవి వెంటనంటఁగా
దిక్కులవెల్లనుం గలయఁ ద్రిమ్మరి యార్తిహరించి కావ వాఁ
డొక్కఁడు లేమికిన్ వగలనొందుచు నుగ్రమతిం బాణుండంపిన
య్యక్కగుణావిధేయు హరి నార్తశరణ్యునిఁ జేరి భక్తితోన్ 95

శా. శ్రీలక్ష్మీపతయే కృతాఖిలజగత్త్రైమాయదివ్యాజసే
నీలాంభోధరకాంతికాంతవపుషే నిర్వాణసంధాయినే
లీలాకల్పితతత్త్వకాయమహతే లేశాతిపూర్ణాత్మనే
నాళీకాసనపూజితాయ భవతే నారాయణాయోన్నమః 96

దండకము

శ్రీమద్రమామానినీమానసారామవాటీవసంతా యమానాసమానాంగశృంగారభావా
సమగ్రప్రభావా ప్రభావార్యమానా యుతా గోధిరాణ్మండలా సేవితాఖండలా
కుండలానర్ఘ్య రత్నచ్ఛవిచ్ఛన్నగండస్థలస్ఫురన్మందహాసాకరాంభోజభృన్మండ
కాఖర్వ్యజస్వలచ్చంద్రహాసా యమానా హసకహారిక కంసాఘవత్సాదిదైతేయసంఘాత
శైలాంబుభృద్వాహనా గోపకన్యామనో మోహనా గేహనారీసుతార్థాదిసంసారభో
గాబ్ధినిర్మగ్నహృత్పాప్రికృతాళీనుం వాదరా పాదకర్తిప్రతాపోదయానీదయాశోభి
తాపాంగ వీక్షాసుధాలేశ సంసేవనా లబ్ధసౌభాగ్యులై బ్రహ్మరుద్రామరాధీశముఖ్యు
ల్ మహత్త్వంబునన్ బూజ్యులైయుండు రేతజ్జగత్పాలనార్థంబు గానీవు మత్స్యస్థితిం
గచ్ఛపాకారతన్ యజ్ఞవారాహలీలన్ నృసింహస్వభావంబునన్ వామనస్ఫూర్తి
తో జామదగ్న్యస్వరూపంబునన్ రామచంద్రావతారంబునన్ రౌహిణేయాభిధేయం
బుతో బౌద్ధవేషంబుతో గంగలికాఖ్యాకృతిన్ సాధుసంరక్షణంబున్ జగత్కంటకధ్వం
సనంబున్ దగంజేయుదో నీవు గావించు సత్కార్యముల్ చాలనాశ్చర్యముల్ నీ
పదాంభోరుహధ్యాన సేనావిశేషంబులన్ నారద వ్యాస వాల్మీకి రుక్మాంగదాగుల్
మహాధన్యులై పుణ్యులై జ్ఞానసంపన్నులై యవ్యయానందముం గాంచిరత్యూర్జితంబైన
యుష్మన్మహత్త్వంబు వర్ణింపఁగా రెండు వేల్ జిహ్వలన్ బొల్చు శేషాహియుం జాలఁడీ
లోకముల్ దేశకాలంబులున్ వేదశాస్త్రంబులున్ దానధర్మంబులున్ సాగరంబుల్
నదుల్ కాననంబుల్ గిరుల్ చంద్రసూర్యుల్ పృథివ్యాదిభూతంబులున్ సాత్త్వికాది
త్రయంబాదిగా నామరూపంబులన్ బొల్చునట్టి ప్రపంచంబు సర్వంబు నీ మాయచేఁ
గల్పితంబై ఘనద్గర్భగోళంబునం బుట్టుచున్ మించుచుం గిట్టుచుం గ్రాలు నో దేవ నీవే
జగత్కర్తవున్ భర్తవున్ హర్తవున్ నీవె సర్వస్వరూపుండవు నీవె దైవంబవు
న్నిర్గుణంబై నిరాకారమై నిశ్చలంబై నిరాఖ్యాలమై నిర్వికల్పస్థితిం బొల్చు నోంకార

గమ్యుం బరబ్రహ్మమూర్తిన్నినుం నామనోవీథి భావింతుసేవింతునోస్వామి నన్నుం
గృపంజూచి రక్షింపు మో దీనసంరక్షి యోపుణ్యచారిత్ర యోభక్తమందార యో
నిత్యకల్యాణ కారుణ్యశాలీ జగన్నాయకా దేవతాసార్వభౌమా రమానాథ పాహి
మాం పాహిమాం పాహిమామ్ 97

శా. నీతేజంబుసహస్రమిత్రులమఁగా నిల్వంగ శక్యంబుగా
దేతద్విశ్వమునందురక్షకులునా కెవ్వారునన్నేలనీ
వేతిప్పన్శరణంబుచొచ్చితిదయావిస్తారభావంబున
న్నాతప్పుల్ క్షమియించికావఁగదవేనాతండ్రి నారాయణా 98

క. అనినంగృష్ణుఁడుమత్పా, వనమనితరవాక్యమగుటఁదగఁ దెలిసెరయుం
బునమముఁజేరితి కావున, నినుఁజెందకుతద్భయంబునిక్కంబింకన్ 99

క. మీయుభయుల్వాద, మపాయంబుననన్నుఁ గావుమనినీవునుతుల్
సేయుటయుఁజగుపువారల, కేయెడమీబాగపార నుదించుకరైనన్ 100

వ. అని యానతిచ్చెనని శుకుండు పలికిన నట మీఁదటి వృత్తాంతం బెట్టింగింపుమని
యడుగుటయును 101

శా. సాష్టాంగానతసిద్ధసాధ్యమకుటాంచన్మౌళిరత్నావళీ
ఘృష్టిస్తోమ విరాజమానవిమలాంఘ్రిద్వంద్వగీర్వాణజి
ద్దుష్టారాతిమరంగనిర్దళనశార్దూలాయతోద్యద్భుజా
విష్టంభోజ్వలసర్వదేవమయశశ్వన్మూర్తివిశ్వంభరా. 102

క. లక్ష్మీకటాక్షకమలా, లాక్ష్మాంచితనదనహారిణలాంబినబింబా
సక్ష్మాదిభూతవిశ్వగ, సూక్ష్మస్థూలాంతరస్థసుబ్రహ్మకరా. 103

కవిరాజవిరాజితము

మలయజహారసుధాకరహీరసమానసుసారయశోభృతది
గ్వలయకృతార్థిహితార్థధనంజయవర్ధనకారిసమర్థకృపా
నిలయనిరర్గళశార్ఙ్గధనుర్గుణనిర్గతమార్గణవర్గమహా
విలయుగతాహితమోహితలోకవివేకసమాహితహృన్మహితా

గద్య. ఇది శ్రీమంగళాచార్యనృసింహాకృపా ప్రసాద సంప్రాప్తవిద్యా వైభవ కనుపర్తి
రాయనమంత్రితనూభవసుజనహితకృత్యనిత్యాబ్బయామాత్యప్రణీతంబైనయనిరుద్ధ
చరిత్రం బను మహాప్రబంధంబునందు జతుర్థాశ్వాసము

---

శ్రీ ర స్తు

# అనిరుద్ధచరిత్రము

## పంచమాశ్వాసము

---



శ్రీకల్యాణగుణోజ్జ్వల
పాకాహితముఖ్యవినుతపదపద్మశర
ద్రాకేందుచంద్రికావిశ
దాకరదరహాసమంగళాద్రినివాసా 1

గీ అవధరింపుము శౌనకుం డాదియైన, మునివరేణ్యులతోడనిట్లనియె సూతుఁ
డాపరీక్షిన్మహారాజు నాదరమునఁ, జూచి విజ్ఞాననిధియైన శుకుఁడు పలికె 2

గీ అంగీకరణించిపలినయచ్యుతునకు. వందనముఁ జేసిచనియె శైవద్వారంబు
బాణుఁడపుడస్త్రభీతితోఁ బఱచితనదు, మందిరముఁ జొచ్చి చింతాబ్ధిమగ్నుఁ డగుచు 3

వ ఇట్లని తలంచు 4

మ అతిరౌద్రారుణ నేత్రకోణములతో నాలీఢపాదద్వయో
న్నతితోఁ జంచలకుండలప్రభలతో నారాచభృన్మండన
కృతకోదండముతో జయార్భటముతోఁ గృష్ణుండు నాముందటన్
రతికోట్యాకృతులంగనంబడియెదున్సర్వంబునుం దానయై. 5

చ గెలిచితనిర్జరేంద్రుఁ డడికించితిచప్పుఁ గృతాంతుఁ గొట్టితిన్
జలమున నైఋతిన్విగత శౌర్యుని జేసితివారినాథునిం
గెలఁచితిఁ ద్రోలితిన్ బవనుగర్వమడంచితిఁ గిన్కఁ రేంద్రునిన్
జెలఁగి మహేశ్వరున్వశుఁ జేసితి నప్రతిమానకీర్తినై 6

ఉ ఇంతమహాద్భుతం బెఱుఁగ నెన్నఁడుఁ గృష్ణునిమూర్తిము క్తగా
ర్దాంతశరౌఘతీవ్రతరధాటికి డెందముదల్లడిల్లెడుం
బంతము లెల్ల హాస్యములపాలుగ మద్భుజవిక్రమక్రమం
బింతకువచ్చెదైవకృత మెవ్వరికైనహరింపవచ్చునే 7

వ అమ్మహాపురుషుం డాదినారాయణుండగుటతప్ప దతనితోడిసంగ్రామంబువలన
నెట్లైన లెస్సయుని ధైర్యంబుఁ దెచ్చుకొని రోషభీషణాకారుండై 8

ఉ. హారకిరీటకుండలముఖాభరణోజ్జ్వలుఁడై సహస్రబా
హారుచిరాయుధప్రకరుఁడై బిరుదధ్వజఘంటికాస్వనో
దారరథస్థుఁడై తురగదంతిరథాదిక చాతురంగ సే
నారభటీకఠోరతరుఁడై పటహాస్వనముల్లసిల్లఁగన్. 9

గీ. శోణనగరంబు వెలువడి సురవిరోధి, ధరణికంపింప నేతెంచి తాఁకుటయును
యాదవబలంబు విక్రమం బతిశయిల్ల, మాఱుకొనినరణంబతిఘోరమయ్యె 10

సీ. శరపరంపరలచే సైన్యంబు పృథ్వంగ రథములు పడఁ బెంచు రథికవరులు
రథికుల పైఁ గుంజరములఁ దీకొల్పి గర్వమునఁ దాఁకెడు గజవాహకులును
గజవాహకుల మీఁదఁ గంఖాణములఁ దోలి తత్తులనఱకు రాహుత్తగములు
రాహుత్తులను బరాక్రమలీలఁ జోఁ భిల్లఁ జేరి మూఁకల గ్రమ్ము వీరభటులు
తే. నగుచుఁ బోరాడె రోషంబు లతిశయిల్ల, నుభయ చతురంగ బలములు నుక్కుమిగిలి
పలలఖాదనభీకర తూహాలపిశాచ, కంకకోలాహలము నాకసమునఁ గుల. 11

వ. అప్పుడు 12

మ. హరిపైఁ బాణుఁడహంకృతిం గదిసి బాహాపఙ్క్తి నొక్కుమ్మడిన్
శరముల్ తోమరముల్ గదల్ ముసలముల్ చక్రంబులున్ శూలముల్
పరిఘంబుల్ కరవాలముల్ పరశువుల్ ప్రాసాద నానాయుధో
త్కరముల్ తెల్లముగప్పు మించు నిగిదింగ నట్టిఁగా నేసినన్ 13

వ. భుజబలశాలి మాధవుఁడు పూనిఘనుర్గుణటంకృతిన్ హరి
ద్గజములు కర్ణముల్ పగులఁగా నిశితోగ్ర శశాంక సాయక
వ్రజములు పెంజపెంజఁ గురియంబఱఁగించి తమంబడం మనీ
రజహితు లీలసాధనపరంపరలం దునుమాడి తీవ్రతన్. 14

వ. విజయోత్సాహము మోమునం బొదలఁగా విశ్వంభరుండార్చి యు
క్కుజమై తేజము దిక్కుల న్వెలుఁగ నాగర్వాంధుఁడై తోయబ్ధిఘో
రజవస్ఫూర్జనముస్నా రామరపరబ్రహ్మాదికశ్లాఘ్యకృ
న్నిజసందర్శనమున్ సుదర్శనమునున్ రౌద్రప్రతాపంబునన్ 15
ప్రయోగించిన 16

చటులంబై చలితక్షమాచరము చైచంద్రార్కకోటి ప్రభా
ఘటితాకాంతరమై చరాచరసమాక్రాంతాగ్నికీలావళు
ల్కటలైచండతరంబునై వికటగర్జాచక్రమై చక్రమా
ర్భటితో నచ్చివియచ్చరుజ్జ్వలజయారావంబుతో మ్రొక్కఁగన్. 17

సముద్దండ వేదండ ప్రకాండ శుండాదండ మండితంబును, గనత్కనక కంకణ కేయూర
ముద్రికానిచయ ఖచిత ప్రవరమణిగణ మరీచిమాలికాలంకృతంబును త్రైలోక్యభయం

కిరకారణ సౌభాగ్యరేఖావళీ కలితారుణకరతలంబును, చంద్రశేఖరమనోరంజితతాళ
ప్రమాణలయాలయవ్యాప్తివిస్తారరంగన్మృదంగవాద్య ఘాతకారిత్వంబున్వాభిరా
మంబును, నక్తంచరీకుచకుంభయుగళచర్చితతుహినజలమిళిత్పటీరకర్దమసురభిఘుమ
ఘుమాయమానంబునునైన బాణాసురునిబాహుసహస్రంబునంకుంజతుష్టయానిశ్శిష్టం
బుగాఖండించి వైచిన ఝంఝూసమీరణవిక్షేపవిదళిత శాఖాసహస్రంబై మోడ్వడి
యున్న మహామహీరుహంబుచాడ్పునఁ బురందరకరాంభోరుహ శుంభద్దంభోళి ధా
రాహతిపక్షంబైయున్న కుంభిని ధరంబువిధంబున నుండెనప్పుడు 18

క సురుచిరసురనికరకరాం, బురుహవికీర్ణప్రసూనపుంజము లొంతపై
హరిపైఁగురిసెన్నారదసెక్, వరుసఁ దంరంభాదినాట్యవాద్యంబులుల్. 19

తే అవ్విరోచనపౌత్త్రునియందుఁజాల, కరుణగల్గుటఁజేసిగంగాధరుండు
పురుషసూక్తంబుచదువుమహరినిజేరి, వినయవాక్యప్రయుక్తినిబ్లనినుతించె 20

చ అనఘుఁడనప్రమేయుఁడవనంతుఁడవాద్యుఁడపక్షపంప
నత్యనుపమచిన్మయుండవుచరాచరజాలసమేతమైనయి
వ్వనజనవాంతపద్మ్రుఖలుభవజ్జఠరంబు వనిదుమాయచే
జననముపర్ధనంబునవసానము నొందుచునుండునీశ్వరా 21

సీ అఖిలాత్మనాభియుంచునాకాశంబు మునివంద్యనిపాదములనుధరణి
సర్వేశనీమానసమునఁజంద్రుండునుజలజాక్షునీనేత్రములనినుండు
గాంభీర్యనిధినీముఖంబునవనింద్రుండు మురహరనీకర్ణములనుదిశలు
సురగేంద్రశయననీయూర్పులననిలంబు ఘనమూర్తినీమస్తకమునదివము
తే ప్రబలమగుచుండుసుపవిత్వంచకయుయ, దివ్యమంగళవిగ్రహస్థితివెలుంగు
నిన్నుభావించిసేవించి సన్నుతించి, కాంతురనఘులుమోక్షంబుఁగమలనాభ 22

క. అనిమత్ప్రియుబహువిధంబుల, వినుతింపశశాంకధరునివినయోక్తులకున్
జనితప్రమోదమానస, వనరుహుఁడైపలికెగరుడవాహనుఁడెలమిన్. 23

ఉ నీదయపీనిపైఁగలిమినిక్కమిమింతియెకాదువీఁడుప్ర
హ్లాదునకుంబ్రపౌత్త్రుఁడుతదన్వయజాతునినేవధింపఁగా
లేదటుగానవీనమెడలింపకకాచితిబాహువిక్రమో
న్మాదముపింపఁగా నసిమ్రుట్లనునంగిరిఁజంద్రశేఖరా. 24

క ప్రమథగణంబులలోను, త్తముఁడైనీదియసన్నిధానంబునమో
దముతోడనుండఁగలఁడీ, యమగాహితుఁడింకనోపురాసురమథనా. 25

తే అనుచునానతియిచ్చినయవ్వసరమున, బాహువులతోనయజ్ఞానబంధములను
వీడుకొనిమాధవునిజేరివినయుఘణితిఁ, జాగిమ్రొక్కుచుబాణుండుసంభ్రమమున 26

కారవిలాసకృత్స్వరసకంజముఖీనికరప్రచారవి
స్తారసురేంద్రనీలఖచితస్ఫుటహర్మ్యకదంబధారకన్ 53

ఉ. అంతకుమున్న కృష్ణునిజయంబ భియాత్తపరాజయంబు పా
కాంతియుబుశ్వకేతుఁడు సుఖస్థితి నమ్ముటయాదియైన వృ
త్తాంతము చారసూక్తిఁ దెలియన్ వసుదేవుఁడు పౌరకోటిక
ద్ధాంతిజనంబులున్ వినిమహాప్రమదాంబుధిఁ దేలాడుచున్ 54

వ. పట్టణంబు శృంగారంబు సేయించిన. 55

సీ. ఘనసారకస్తూరికాజలాసారంబు చెలువొంపు వీథులఁ జిలుకరించి
గమకంబులైన ముక్తాఫలంబులతోఁ బచ్చలతో రంగవల్లికలు దీర్చి
నవరత్నభూషణాంబరసుగంధద్రవ్యపుంజంబులం గళ్లఁ బొంకుపఱచి
కదళికాస్తంభముల్ నచిత్రపటములు నుభయపార్శ్వములఁ బెంపొందనునిచి

తే. ద్వారములయందుఁ దోరణావళులుగట్టి, పరిమళముమించు నగురుధూపములు వైచి
నృత్తగీతవాద్యాదుల నెఱఁగఁ జేసి, యమితశృంగారమొనరించి రప్పురంబు 56

ఉ. భూసురవేదనాదములఁ బుణ్యసతీజనమంజులోక్తులన్
భాసురనృత్తగీతరసబంధుర [illegible]
వాసకసానులాపముల వారణబృంహితవాజిహేషలన్
శ్రీసముదంచితంబగుచుఁ జెల్వు వహించెఁ బురంబు నవ్యమై. 57

గీ. అట్లు శృంగారితముఁ జేసి యఖిలజనులు, గంధపుష్పాక్షతాద్యలంకరణులగుచు
నెదురుగా నేగుదెంచి రమేశుఁ గాంచి, మ్రొక్కి యనిరుద్ధుఁ గొల్చి ప్రమోదులైరి 58

క. పురలక్ష్మి సరసత నిజ, సరసీతామరసరసలసన్మృదులీలా
సురభిపరిభోగపవనాం, కురుమిషమున హరికి నెదురుకోలు వహించెన్. 59

ఉ. గోపురశాతకుంభమయకుంభపయోధరకుంభజృంభణల్
చూపుచు సౌధయూథపరిశోభితహీరదరస్మితంబులు
దీపన సేయుచున్ వలదుదీర్ణపటాగ్రపతాకహస్తవి
క్షేపణసన్న సేయుచు వశీకృతచిత్తుని జేసెఁ గృష్ణున
ట్లా పురలక్ష్మి కాంతుని బ్రియాంగన మోహితుఁ జేయు కైవడిన్. 60

వ. ఇవ్విధంబునం బ్రకల్పితశృంగారతరంగరంగద్రంగవల్లీప్రయుక్తముక్తాఫల జాల
కాలంకృతంబును, కుట్టిమరేఖాస్థగితప్రదీప్తహీరద్యుతివితత కౌముదీరమ్యంబు
ను, సకలజననయన కువలయవికాస హేతుకంబును నైన రాజమార్గంబున యదు
కులపయఃపారావారచంద్రుండగు దేవకీనందనుం డరుగుచున్న సమయంబున. 61

ఉ. బంగరుపళ్లెరంబులను బద్మముఖుల్ ఘనసారదీపికల్
రంగమరంగ నించి మణిరాజితకంకణహస్తపల్లవుల్

సంగతినుంచి త్రిప్పుచు నుసారెకు మంగళకౌశికద్వయం
మంగళమంచుఁ బాడిరి సమంచితపంచమనాదవైఖరిన్ 62

గీ నందకాయుధునకు శోభనంబటంచు, నగరకాంతలు నీరాజనంబులిడుట
కలశపాకహస్తంబుల నభినయించెఁ, గారమాదేవి నిరుపమవిస్ఫురణఁ దెలిసి. 63

క నిరుపమవిమానపఙ్క్తులు, గురుతరమణిహర్మ్యములును గూడి వెలుంగన్
సురకాంతలుఁ బురకాంతలు, సరిచల్లెడు వివిధసూనజడి గ్రమ్మె సరిసెన్ 64

వ అప్పుడు 65

సీ తాళకేతనసముద్యత్కాంచనస్యందనారూఢుఁడైనవాఁ డతనిఁ జూడు
నాగాంతకస్వజోన్నతహేమమయకేతనాగ్రారోహణుండైనయతనిఁ జూడు
మకరపతాకాసమానగాంగేయగృహాసీనుఁడై యున్న యతనిఁ జూడు
వరబుద్ధ్యకేతుసుందరమైనకనకంపుటరదంబుపై నొప్పునతనిఁ జూడు

తే మతఁడు బలరాముఁ డతఁడు మురాసురారి, యతఁడు సుమాయుధుండశరుండలనితనయు
డనుచు నొండొరులఁ దెల్పుకొనుచునుండి, రప్పురంధ్రులు గగనగృహాంతరములఁ. 66

ఉ కైరవిణీప్రియుం డనుకఁ జంచరరోహిణిఁ గూడి నింపుపెం
పారఁ బ్రసూనసాయకసహాయకు ఁదీంజను దెంపునయ్యెహా
వారిజగంధి నంచితసువర్ణలతాసమమోహనాంగి నెం
గారరసంపుబొమ్మఁ బొరిఁగా విభుఁ డంగ్రులసమ్మదమ్మునన్ 67

వ తమలో నిట్లనిరి 68

ఉ తేనియలూరు కెంపుసుదతీమణి కాతెఁ జంపకద్రవం
బాపెడి తేఁటిగుంపు విమలాంగిక చంబు సదా వికాసముల్
బూను సరోజముల్ చిగురుబోఁడికి సుంగవజోకయొప్పుగున్
మానని చక్రవాకములు మానినిచన్నులు చూడుమా సఖీ. 69

చ కలువలపేరు పేరుకొనఁగాఁ గుముదమ్ములు సన్మథాంబకం
బులుగణుతింపఁగా విషమములక్కులు నిక్కపుపుష్టిపూర్వముల్
దెలియఁగఁ బంకజాతములు తేరి కనంగొనఁగా మెఱుంగుఁబోఁ
గెలుచపలంబులన్నియు సఖీమణికన్నులఁ బోలనేర్చునే. 70

క. కలదనుచును లేదనుచును, బలుమఱు వాదంబు తేలకని లేదింకన్
గలదనుటకు లేదనుటకుఁ, దలపం గానడుము నడుము తరుణీమణికిన్ 71

మ చెలువంబై కళలన్వెలుంగు హరుగు మంజీదేశపున్ ముత్తియం
బులతోఁ గూర్చిన చేరుచుక్క నొసలం బొల్పొందు నెన్నో మహా
చెలికెంతందము చూడ రమ్మరుచిరాశ్లేషాసమాయుక్తని
ర్మలరాకాతుహినాంశుమండలము సామ్యంబై ప్రకాశించుటన్. 72

చ. పురుషులలో నపూర్వరసపూర్ణ శరీరమనంగమూర్తికిన్
దరుణులలో సమానరహితంబగు రూపము బాణపుత్రికిన్
సరసముగా సృజించియిటు సమ్మతినిద్దఱఁగూర్చినట్టియా
సరసిజగర్భుఁ డెంతగుణశాలితఁ జెప్పఁగఁ బోటులారరా. 73

వ. అని యనేకప్రకారంబులం గొనియాడుచునదియొమ్ముచ్చటగానుండిరంతఁ బురుషోత్తముండు భేరీమృదంగాదివాద్యంబులును, శంఖకాహళ వేణుప్రముఖతూర్యంబులును, బోరుకలఁగ మహావైభవంబున నరిగి నిరంతర విహారసౌధమనోహరంబగు మందిరంబుఁ బ్రవేశించి, యమాత్యజ్ఞాతిసామంత బంధుమిత్రాదిపరివారంబులదివ్యాంబరాభరణతాంబూలాదివస్తుప్రదానంబులం బ్రహృష్టమానసులంజేసి, యుచితప్రకారంబులందఁ దత్తద్గృహంబులకు వీడుకొల్పి, యంతఃపురంబులకుంజని యిష్టోపభోగంబులను సేవింపుచుండె నయ్యనిరుద్ధకుమారుండు నుషాసమేతుండై దేవకీవసుదేవులకు రేవతీరుక్మిణీసత్యభామా జాంబవతీ కాళిందీ మిత్రవిందాసుదంతా భద్రాలక్షణానామలైన ముత్తైదువలకుఁ దన తల్లులైన రతీశుభాంగులకుఁ బ్రణామంబులుచేసిన వారును బరమానందరసప్రహితాంతరంగులై యాస్వభావముల నాలింగనంబులుచేసి యనేకవిధంబుల దీవించిరతండును నిజవియోగ వేదనాభాగంబునఁ గృశీభూతులైయున్న యక్కలోచన ననేకవిధంబుల గారవించి సంప్రీతసుజ్జనభోజనాదులఁ దృప్తుండై బాణనందనాసురతి సంభోగానంద నిరతుండై యుండి 74

సీ. సారసరసంసారపరసరసాసార సౌరభాన్విత సరశ్చారణముల
సాలలీలాలోల ఖేలదేలాలతా జాలడోలాకేళిలోలగతులఁ
గింజల్కరంజితమంజీర పుంజమంజులవంజులనికుంజసుమనసములఁ
గుందబృందమరందబిందుపేదిందిరాసుంద నాదప్రతానందములను
తే. గౌరఘనసారనీహారసారపూర, సారచారుపటీరచర్చాసుఖాప్తి
కోకకోకిలశారికానిలపక్షి, లోకలోకాకరసనావలోకనముల. 75

శా. ప్రాంచత్కాంచనమూర్తి రత్నఖచితప్రాసాదదేశంబులం
బంచాస్త్రప్రియనందనుండుసురతప్రాపంచిక వ్యాప్తిఁ గ్రీ
డించుం దక్షిణనాయకత్వమునఁ బ్రౌఢిన్ రుక్మనేత్రాయువ
స్సంచారుండును బాణదైత్యతనయాసక్తాంతరంగుండునై. 76

సీ. కుచకుంభయుగముఁ జేకొని కరసంపుటము సైరావతము నెక్కి యాడినట్లు
కదియించి నెమ్మేనుఁ గౌఁగిటఁ గలుముటఁ హరిచందనము మేన నలఁదినట్లు
సురయోక్తి వీనులు సోఁకుట నప్సరోవీణాని నాదంబు వినినయట్లు
బింబికాధరచుంబనంబు సేయుట సుధాసారపానంబు చేసినట్లు

తే. సౌఖ్య మొదవంగ నిచ్చనిచ్చలును బాణ,కన్యసంభోగ మింద్రభోగంబు గాఁగ
సతతవిభవానుభవతృణీకృతపురంద, రుండగుచు నుండె నయ్యనిరుద్ధవిభుఁడు 77

వ. అంత 78

గీ. మందగతులకు నత్యంతమందగతియు, మంజులోక్తులకతిశయమంజులంబు
మెఱుఁగు మేనికి మిక్కిలి మెఱుఁగునగుచుఁ, బుష్పగంధికి నీళ్లాడఁ బ్రొద్దులయ్యె. 79

వ. అంత 80

శా. స్వక్షేత్రంబుల నుచ్చరాసులహితస్థానంబులన్ దీప్తులై
యక్షీణుండగు చంద్రుఁ జూచుచు దినేశాదుల్ చరింపన్ సమ
గ్రక్షేమంకరలగ్నవేళ శుభయుక్తంబందు రాజాంశఁ బ
ద్మాక్షీరత్నము పుత్త్రుఁ గాంచె హరిపూర్ణాంశాన్వితాంగు నిన్. 81

క. సురదుందుభినాదంబులు సురకరనిర్ముక్తకుసుమవర్షంబుల్
సురరమణీనాట్యంబులు, సురగాయకగానములును శోభితమయ్యెన్ 82

ఉ. యాదవవృష్ణిభోజకులులందఱు వేడుకలం జెలంగిర
త్యాదరవృత్తి బాణతనయారమణుండు సువర్ణధేనుధ
త్త్రాదిసమస్తవస్తువులనంతముగాఁ జెలఁగి యిచ్చి పృ
థ్వీదివిజేంద్రకోటులను దృప్తులఁ జేసి కృతావగాహుఁడై 83

క. లౌకికవైదికరీతులఁ, గైకొని పుత్త్రోత్సవంబు గావించి యతం
డేకాదశదినమున విభ, వాకరముగ నామకరణయత్నముఁ జేసెన్ 84

క. వజ్రాదిభూషణుండును, వజ్రాంగుఁడు వైరివీరవసుధాధరభి
ద్వజ్రుఁడు నై మెఱుఁగెడు నని, వజ్రుండని నామమిడిరి విప్రోక్తిన్. 85

సీ. చూడఁగా నేర్చె విస్ఫురత్కృపామృతరసంబుఁ గటాక్షవీథులఁ బూనుకొనుచు
నడుగు చాఁపఁగ నేర్చె నఖిలరాజన్యకిరీటదీప్తులలంకరింపఁ గొనుచు
చేతులాడింప నేర్చె నువదాన్యశాస్త్రవిద్యాప్రవీణత వెలయుకొనుచు
తలయెత్తి నేర్చె మన్యమజగన్మండనైకాంతపత్త్రచ్ఛాయ నమరుకొనుచు
తే. పలుక నేర్చె సరస్వతీప్రకటనాట్య, రసమునకు రంగరక్తుల నొసఁగుకొనుచు
కడఁగి నడుపంగ నేర్చె నగలియుగాది, మప్రభుత్వోతధర్మంబు మలుపుకొనుచు. 86

వ. మఱియు నవ్వారసుండు ముక్తాసుశోభిత చయాఖచితకలాపకాకపక్షాలంకృతవిశాలఫాల
భాగుండును, నంజనరేఖారంజితకర్ణాంతవిశ్రాంతనేత్రుండును, దరహాసచామీకరముద్రి
కృతశార్దూలనఖాభరణకమనీయకంబుకంఠుండును, నవాంబరనితంబవింబాలంబితక
నకకటిసూత్రకలితకింకిణీక్వణనాదాభిరాముండును, మణిమయమంజీరసింజానము
జ్జ్వలచరణయుగళుండును నై ముద్దుమాపుదుఁ దల్లిదండ్రులు దాతముత్తవలుం బ్రపితా
మహప్రపితామహసమూహంబులు గారాబంబు సేయుచుండ ననుదినవర్ధమానుండై పెరుగు

చుండం దదీయసౌకుమార్య మందహాసమృదువచనసంచరణాదుల కానందంబువహిం
చుచు నయ్యనిరుద్ధుండు సుఖోన్నతుండైయుండి 87

మ. గతగర్వంబునఁ బ్రాంతదేశధరణీకాంతుల్భుజింపంగద
ర్పితులై కొండఱు దూరభూవరులు నిర్భీతిం జరింపక్ మహో
న్నతిదండెత్తి జయించి లోఁబఱచి యాజ్ఞాసిద్ధిఁ గావించెఁ దాఁ
జతురంభోనిధిమధ్యఖండనవకచ్ఛప్పన్నదేశంబులక్ 88

ఉ. అన్యనృపాలకుల్సవశులై కొనివచ్చియొసంగుచున్నవుల్
కన్నెలు రత్నముల్హరులు గంధగజంబులు నాదిగాఁగ సౌ
జన్యతఁ దెచ్చి తాతకనిశంబును గానుకలిచ్చి యాజగ
న్మాన్యనిచేతదీవెనలు మన్ననలందుచునుండి వెండియుక్ 89

సీ. వసుదేవబలదేవవాసుదేవాదులయనుమతివడసి యత్యంతనియతి
రాజసూయమ్ముతురంగమేధము నాదిగాఁగ ననేకయాగములు చేసి
యందునాహుతులై నయబ్జపురుహూతాదులాత్మభాగహవిస్సులాహరింప
నాజ్యప్లుతంబుగా నన్నభక్ష్యాదులున వ్వారిగాఁగ సుస్తజనుల
తే. కిడుచు నద్వర్యముఖ్యులకెలమిధేను, భూహిరణ్యరత్నాదులు భూరిగాఁగ
దక్షిణలొసంగి రాజులఁ దగు విధముల, నంపకము చేసి కీర్తులనతిశయిల్లె 90

సీ. అసమానసాంప్రదాయకశుద్ధిఁ జెలువొందు తండ్రితాతలమహత్త్వంబుఁ జూచి
యష్టదిక్కులయందు నాక్రాంతమైన సత్కీర్తిప్రతాపవిస్ఫూర్తిఁ జూచి
కులరూపగుణములఁ గొనియాడఁ గాఁదగు దేవులయనుగుణస్థితులఁ జూచి
వర్ధిష్ణుఁడై శైశవంపుముద్దులు గుల్కు తనయుని యందచందములు చూచి
దానభోగాదులై నసద్వ్యయములంగుఁ, బొలుపడియున్న యర్థసంపదలు చూచి
భూప్రపలు వేయునోళ్ల నుబొగడుచుండు, డెంతధన్యాత్ముఁ డీయుషాకాంతుఁ డనుచు.

వ. నీసమయంబున. 92

క. నారదుఁడు సకలశాస్త్రవి, శారదుఁ డుశరీరవిజితశారదవేశా
నీరదుఁ డుముఖనివేశిత, నారదుఁడే తెంచె దనుజసంహారకుఁడుక్ 93

క. వనజాతనయనుఁ బొడగని, వినుతులు గావించి యతనివినయంబులచే
ననుమోదమానసుండై, యనిరుద్ధుండున్న యెడకునరిగిననతఁడుక్ 94

క. ఎదురుకొనివందనము చేసి హేమపీఠ, మునను గూర్చుండఁబెట్టిన మునివరేణ్యుఁ
డాదరంబున దీవించి యతనితోడ, నుచితసల్లాపములు సేయుచుండి యుండి 95

క. ముద్దుగుల్కు ముమురుసంపు మొలకయనఁగ, శ్రీలఁ జెలువొందఁగల నెలబాలుఁడనఁగఁ
గుగుచు మ్రొగిసింగంపుఁగూనయనఁగ, నొప్పుమారుపమారుఁగుమారుఁ జూచి. 96

క. రమ్మని డాయంబిలిచిన, యమ్మునినమ్మునినిజాంకమంగునిచిరదీ
యమ్మగుసాముద్రికచి, హ్నమ్ములు తెలియంగఁ జూచియనిరుద్ధునితో౯. 97

సీ. భుజనేత్రనాసికంబులుజానుహనువులు నైదు దీర్ఘములు గోప్యాంగికంఠ
జంఘులుమూఁడుహ్రస్వములుపృష్ఠకుహ్మ్కటిమూఁడు వెడఁదలుకంఠనినద
ము సనాభింందంబు [illegible] కటిస [illegible] బాహువులు సే
ముఖములారున్నతంబులు జత్రుకుచ్ఛభ్రూంగుళిచరణంబు లైగులూష్ఠ

తే. ములుద్విజంతజిహ్వాశిరములునుసఖుర, తాలుకరతలాయురస్త [illegible] యగునేన
యట్టిమానవుఁడధిక భాగ్యాన్వితుండు, గానెఱుంగుముకుసుమమార్గణకుమార 98

సీ. వలిప్రదక్షిణావర్తరేఖాయుత భూరిమధ్యుఁడువిపులస్థభూమినేలు
నెదురేఖలఫాలమందున్నవాఁడు దీర్ఘ మున్సమున్వితుండైనవాఁడు
ఊర్ధ్వరేఖలుపాదయుగళంబునంగల్గెం బొంగు మానవుఁడు మోక్షయుండు
తనరిముప్పదిరెండుదంతిము ల్గలిగినయట్టినరుండుభాగ్యాధికుండు

తే. కంబుసన్నిభమైనట్టిగళమువాఁడు, విలసితంబగుకీర్తిశాలి యగువాఁడు
కరినమగుహస్తతలముగల్గువాఁడు మృదుత్వచరణములుగల్గు మనుజుఁడైశ్వర్యగుణుఁడు

గీ. చారుచరితసాముద్రికశాస్త్రమందు, నిట్టిలక్షణములు చాల నెన్నఁబడియెఁ
గాన బుధునిఁ గనుఁగొన్నగానవచ్చెఁ, బండితులకునవాగల భాగ్యగతుల 100

వ. శ్రీమన్నారాయణాంశోదయుండైన యివ్విప్రకుమారుని శరీరంబునని యిట్టిశుభ
లక్షణంబు లనేకంబులున్న యవి గావున నితండు మహాభాగ్యవంతుండును సకలదిగంత
విశ్రాంతకీర్తివంతుండును విద్యావినయసంపన్నుండును [illegible] కలియు
గాదిమ ప్రభుత్వ సింహాసనారూఢుండై సామంత భూపతులు తనకుం బ్రసేయఁ గృత
యుగలక్షణంబున ధర్మంబు చతుష్పాదపూర్ణప్రవర్తనంబు గానుండ రాచక్రంబ నేక
సంవత్సరంబు లశాత్రవంబుగాఁ బాలింపంగలవాఁడు భగవత్స్వరూపుండవు నాది
గర్భేశ్వరుండవు బ్రహ్మజ్ఞాననిధివి నగు నీవలన జన్మించిన యీ యుత్తమపురుషు
డగుట స్వాభావికంబకదా యని పలికినఁ గంధర్వనందనుండు మందహాసముఖుండై
మునిపుంగవున కిట్లనియె. 101

క. మీయాశీర్వచనంబులు, మాయందనుగతములగుటచూచి సకల
శ్రేయోగుణసంపాద్యము, సేయుటకుని దానమగుట సిద్ధము కాదె. 102

క. అనిసాంత్వనవచనంబుల, ననురాగ మొనర్చుచున్న యనిరుద్ధవిభు౯
మునివరయోగ్యులఁ దీవించుమఁ, జనియె న్నారదుఁడు దివికి నాత్మేచ్ఛ౯. 103

సీ. సరససంగీతంబుసంయుతాసంయుతా హస్తాభినయముభావాభిరామ
వీక్షణభ్రూలతావిభ్రమంబుసపాద తత్కాలకల్పితతాళమాన
మైనలాస్యంబు కాత్యాయనిరొద్ద బాణాసురతనయ దానభ్యసించె

నదిగాన ద్వారకయందుఁ దద్విద్యాభిలాషఁ బ్రార్థించు విలాసినులకు
దృఢముగా నిచ్చె సౌరాష్ట్రదేశచంద్ర, యదువరాన్వయవేణుగోపాల నేర్చి
గానతానలయమేళనమంత్రకళలు, దేవకులసద్వ్రజావనస్థితివిశాల 104

సీ. తనకీర్తిచంద్రికాతతి నిండి కృష్ణపక్షంబులు శుక్లపక్షములు సేయఁ
దనరురాజత్వ మింపున సార్వకాలంబునం దనుగుణలయానంద మొసఁగఁ
దనకరంబులు జగత్త్రయమును భువనప్రజానురాగంబులు నై వెలుంగఁ
దనసత్తనంబు మిత్రసమాగమంబున సంపూర్ణకళలచేఁ జెంపునొయ్యఁ

తే. దనవిలాసంబులం గనుసౌందర్యమహిమ, నిష్కళంకస్వభావమై నివ్వటిల్లఁగ
జంద్రనామము చంద్రుఁడనఁ దగు సద్గుణములు, చేతననిరుద్ధుఁడు జగత్ప్రసిద్ధుఁ డయ్యె

వ. ఇవ్విధంబున నమ్మహానుభావుండైన యనిరుద్ధుండు మహదైశ్వర్య సమృద్ధుండును సకల భోగానుభవసిద్ధుండును వేదోక్తకర్మానుష్ఠాన పరిశుద్ధుండును నై సంసారబద్ధుండునుంబోలియుండె నిర్గుణంబును నిశ్చలంబును నిరుపమానందంబును నైన పరబ్రహ్మంబద్వితీయంబయ్యును బహునామరూపంబులఁబోలుచుఁ జరాచరంబులయందు జీవాత్మయునై పూర్వసంబోధరంబుకై వడిఁ బ్రవర్తించుచుఁ దత్తత్కర్మానుగుణంబులై శరీరంబులకు ననుభవంబులగు సుఖాసుఖంబుల బొరయక జపాకుసుమసాంగత్యంబున స్ఫటికంబు స్వచ్ఛధవళంబయ్యును మిథ్యారక్తవర్ణంబైన తెఱంగున లిప్తుండునుంబోలె నజ్ఞుల హృదయంబులకుఁ దోఁచుచుండు ననియు జ్ఞానసిద్ధి లేమిం జేసి దేహాకర్మాసక్తుండై తనస్వరూపంబుఁ దానతెలియనేరక తానన్యుండని యహంకారమమకారంబులం బొంది బద్ధుండగు ననియును నిద్రాకాలంబున స్వప్నలబ్ధంబైన సంచారాదులు నిద్ర మేల్కనినయప్పుడు మిథ్యలై తెలియంబడినయట్లు జ్ఞానవంతుఁడైన యప్పుడు తనధామంబు నిస్సారంబని యాత్మయందు భేదబుద్ధిలేక సర్వసమత్వంబున సర్వంబును బ్రహ్మమయంబు ప్రపంచంబు సిద్ధంబని తలంచి బ్రహ్మైవాహంబను వేదాంతసారవచనార్థంబు నెలదృఢంబుగా వించియొక్క కలిగిన పురుషుండు తానై సాయుజ్యసిద్ధుండగుననియును నిశ్చయించి యాత్మానుసంధానంబు సేయుచు జనకునికైవడి నాత్మజ్ఞానియై సుఖంబుల ననుభవించుచుండె నని పలికి మఱియు నిట్లనియె.

శా. నీలాభంబును వర్తులాకృతియుఁ జిహ్వాభూతరాజీవపు
ష్పాలంకారము సార్వచక్రముద్రరేఖాంచన్ముఖోపాంతమై
సాలగ్రామసమాకృతిం బొడమి పూజల్ గాంచి యిచ్చుం గృపా
శీలుండై యనిరుద్ధమూర్తి సకలశ్రీలుం బునశ్శ్రేణికిన్. 107

క. ధారుణిలోపల శ్రీమన్నారాయణు నంశఁ బొడమిన యగుణములఁ బెం
పారననిరుద్ధనామము, సారంబగు తలఁచునతఁడు సౌఖ్యముఁ గాంచున్. 108

వ. అనియు నమ్మహాపురుషగుణంబులు గొనియాడి శుకయోగి పరీక్షిన్నృపాలున కిట్లనియె. 109

క. జననాథ యిట్లు నాచే, వినిపింపఁగఁబడిన రసవివేకనిధానం
బనిరుద్ధచరిత్రము వ్రా, సినఁ జదివిన వినిన నరునిఁ జెందుఁ [illegible] 110

చ. అని వివరించి నమ్మదితుఁ డయ్యె ధరావరుఁ డంచు సూతుఁ డిం
పొనరఁగ శౌనకాదులగు యోగివరేణ్యులతోడఁ దెల్పినన్
జనితఘనప్రమోదరససంభృతమానసులై ప్రియంబునన్
వినుతులు చేసిరక్కథకు వేమఱు మత్కృతిరాజ్యనాయకా 111

క. ఈయనిరుద్ధచరిత్రము, శ్రేయస్కరమగుచు సుజనజిహ్వాగ్రములన్
బాయక యాచంద్రార్కము, స్థాయియగుచు ప్రసిద్ధిఁ దనరుం గాతన్. 112

మ. శయనీభూతభుజంగసంగరజయశ్లాఘానిరాఘాటధై
ర్యయుతోత్తుంగవిహంగపుంగవతురంగాయాఘదివ్యాంగపా
దయుగారాధకగోత్రభంగనిగమాంతజ్ఞానశుద్ధాంతరం
గయతివ్రాతముఖాబ్జసూతనపతంగా మంగళాద్రీశ్వరా 113

క. క్రేంకారకింకిణీయుత, టంకారజ్యాలతానటచ్చాపజితో
ద్ధుంకారసముఖవీరా, హుంకారాసకలభూషణాలంకారా 114

తోటకవృత్తము.

మన్మథకోటిసమానవిలాసా, సన్ముఖనిర్జితచంద్రవికాసా
చిన్మయరూపవిశిష్టనివాసా, జన్మమయాపహసద్గుణభాసా 115

గద్య. ఇది శ్రీమంగళాచల నృసింహకృపాప్రసాద సంప్రాప్తవిద్యావైభవ కనుపర్తి రాయనమంత్రితనూభవ సుజనహితకృత్యనిత్య అబ్బయామాత్యప్రణీతంబైన యనిరుద్ధచరిత్రం బను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము సమాప్తము.

---

చెన్నపురి 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము — 1924.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యనిఘంటువు | ... | 0 | 3 |
| ,, టీకతో | ... | 0 | 8 |
| ,, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, వగైరా టీకతో | | 2 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 0 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | ... | 1 | 8 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 8 |
| డిటో గట్టుప్రభువుకృతము | ... | 0 | 12 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, పద్యము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| డిటో ద్విపద, నాదిండ్ల గోపమంత్రి | ... | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము, జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది. | ... | 0 | 12 |
| ,, గొర్తి సూర్యనారాయణశాస్త్రి గారిది | ... | 1 | 0 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 3 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము | ... | 2 | 8 |
| జైమినీభారతము | ... | 2 | 8 |
| తెనుంగుసమస్యలు | ... | 0 | 3 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| దశావతారచరిత్ర | ... | 3 | 0 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధనాభిరామము | ... | 0 | 12 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 10 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు | ... | 2 | 4 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 10 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 2 | 0 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 8 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 0 |

సమాధాన పడుదురేమో! శ్రీలయిన చెవులున్ను, శ్రీలను మించిన చెవులున్ను, అసభ్యవర్ణనలో ఉచితమగునా? పుస్తకము విప్పి పద్యాలు బాగా చదువుకొంటే తెలుస్తుంది, సభ్యమో అసభ్యమో. 'చెవులు' లేకుంటే పండితుల కుండలాలు, పేరంటాళ్ళ చెవాకులు, చెవుల పువ్వులు. ఎక్కడ పెట్టడము? వినడానికి 'వీనులు' పుట్టినా, గుసగుస లాడడానికి 'చెవులే' కావలెను. 'చెవులు' చర్చ యింతటితో చాలును.

50. (8) కన్నులు, 'చన్నులు' 'కన్నులు' గ్రామ్యమని అప్పకవి నిరాకరించినా డనుకొనేవారు కేవలము బాలిశులు. అప్పకవి నిరాకరించిన శబ్దములు 'కండ్లు', 'చండ్లు' గాని 'కన్నులు', 'చన్నులు' కావు. తాటాకు పుస్తకాలన్నిటిలోను 'కండ్లు', 'చండ్లు' అనే వ్రాసి ఉన్నది 18౹9 వ సం,లో మొట్టమొదట అప్పకవీయము పరిష్కరించి ముద్రించిన పండితుడు తెలివి తక్కువచేత దిద్దినాడు. అప్పటినుండి ఇప్పటివరకూ ఆతప్పు అలాగే అచ్చుపడుతూ ఉన్నది. పండితులందరూ కండ్లుమూసుకొని కూర్చున్నారు. పాండిత్య మీలాగున్నది కన్నులు గ్రామ్యమని అప్పకవి నిషేధించినా డనుకోవడము అజ్ఞానమువల్లనని చెప్పవచ్చును గాని, ఆశబ్దము గ్రామ్యమని నమ్మికొని విడిచిపెట్టడము అవివేక మనక తప్పదు. మరి, ఆశబ్దము ఏద్దైనా గ్రంధములో కనబడితే, ఆ గ్రంధము వ్రాసినవానిని నిందించడము, గ్రంధము దిద్దడము అతిసాహసము కాదా? పండిత పరిష్కరణము వల్ల పాడుకావడము ఒక్క అప్పకవీయమే కాదు, సరసభూపాలీయముకూడాను. అచ్చు పుస్తకములో 4 వ ఆశ్వాసము 10 వ పద్యము చూడండి:—

క. పామరుల భాషగ్రామ్యము భామిని కటి గల్లములు విభాసిల్లు ననన్
గోమలి చన్నులఁగన్నులు గాముని పండువు లొనర్చెఁగడువడి ననఁగన్.

మావద్దనున్న వ్రాతప్రతిలో ఉత్తరార్ధము ఇట్లాలేదు. "గోమలిచండ్లు కండ్లకు నామని పండువు లొనర్చుననిశమునననగన్" అని ఉన్నది. (డ్లు అనే అక్షరముమీద 'దులు' అని వ్రాసిఉన్నది.) పూర్వులు ఎవరూ 'కన్నులు' గ్రామ్యమని చెప్పనే లేదు. మహాకవులు రచించిన గ్రంథాలు బాగా చదువకుండా అప్పకవీయములాటి లక్షణము మాత్రము వల్లించుకొని తప్పొప్పులు ఏర్పరిచే తెలివిలేని లాక్షణికులు, ఇప్పటివారు కన్నులు, గ్రామ్యమని బడిపిల్లలకు వ్యాకరణాలలో వ్రాసి బోధపరుస్తున్నారు 'గ్రాంథికబాష' తెలిసినవారు వేయిమందిలో ఒకడయినా ఉండడు. కనుక పండితు లేమంటే అనే సత్యమని లోకులు నమ్ముతారు. "కానని వాని నూఁతగొని కానని వాఁడు విశిష్టవస్తువుల్ గానని భంగి" గుడ్డిపండితులను నమ్ముకొని తెలుగువారు మోసపోతున్నారు. ఈ కాలమందు మరి యే దేశములోనైనా దేశభాషా పాండిత్యము ఇట్టి దురవస్థలో నున్నదా?

దేశాభాషతో తమకేమీ సంబంధము లేనట్టు దేశభాష గుడ్డిపండితులకు గుత్తి కిచ్చివేసి, తాము కళ్ళుమూసుకొని ఊరుకొన్న నాగరకులు మరియేదేశమందైనా క్రీ. శ. ఇరవైయో శతాబ్దమందున్నారా? ఏమికర్మము! ఏమిపాపము' తెలుగు భాషకు, తెలుగువారికి ఏమి ఇంత దుర్గతి పట్టినది! దేశస్థులభాష, దేశమందున్న శిష్టులభాష, గ్రామ్యమట! పండితులకైనా బాగారానిది గ్రాంథికభాషట! అయ్యో! దేశభాషా! నిన్ను తృణీకరించడముచేత నేగదా నూటికి పదిమందైనా తెలుగక్షరాలు వచ్చినవాళ్లు దేశములో లేకపోవడము, చదువు నేర్చిన వాళ్ళయినా తెలుగు పుస్తకము ముట్టుకోకపోవడము, ఇంగ్లీషు పుస్తకాలే ఎప్పుడూ చదువడము సంభవించినది! ఇకనైనా తెలుగువారు కండ్లు విప్పి చూతురా!

51. ప్రస్తుత మనుసరింతాము. విచక్షణులు కానిలాక్షణికు లేమంటేనేమి నన్నయాది మహాకవులందరూ 'కన్నులు' అనేశబ్దము సభ్యవర్ణనలోనే వాడి ఉన్నారు నన్నయ గిరికాదేవిని వర్ణిస్తూ "కలికిక్రాల్గన్నుల లెలుపు" (ఆది. III 29) అనిన్ని, ఉత్తరను వర్ణిస్తూ 'చన్నులుఁ గన్నులు" (విరాట 1. 245) అనిన్ని, తెనాలి రామకృష్ణుడు భగవంతుని"వెడదకన్నులవాని వెయ్యినామములవాని (పాండు 1. 213) అనిన్ని, జక్కన "కన్నులు గండుమీలు" అనిన్నీ, వాడిఉన్నారు. వందలుకాదు, వేలు ప్రయోగాలు ఉదాహరింపవచ్చును,'కన్నులు' అనవలసినప్పుడల్లా 'కనుదోయి' 'కనుఁగవ' అనవలసిన నియమము లేదు! లేదు! లేదు!

52 (9) బొడ్డు—ఈ శబ్దముకూడా గ్రామ్యమట! స్త్రీలయినా పురుషులయినా ఉత్తముల 'బొడ్డు' 'పొక్కిలి' అనవలెనట! గుడ్డిలక్షణము! గుడ్డిపాండిత్యము! సభా. 1.143 "ఒక్కొక చన్నును, జెవియును, జెక్కును, జను బొడ్డు మూఁపు " లోనిమాటలు మెడికల్ కాలేజీలో వాడవలసిన 'అన్నుల చన్నుల' వంటి వంటారు గాబోలు· పోనీండి. విజ్ఞా. ఆచా. "బొడ్డు క్రింది యంగములు విప్రుఁజోఁకిన నచట గడుగవలయును" దీనిలో నున్న 'బొడ్డు' శానిటరీ డిపార్టుమెంటువారి పరిభాష అఁటారా? వరాహ X. 53. "బొడ్డుబంటిగా" ఇది ఇంజనీరింగు కాలేజీ పరిభాషగాబోలు! నాసికా పుటములు, నయనముల్, శ్రోత్రముల్, బొడ్డును, వక్షంబు భుజములందు (52)— ఈవాక్యములో ఆరవయవముల పేళ్ళున్నవి: వాటిలో 'బొడ్డు' ఒక్కటే ఏమిపాపము చేసుకొన్నది? దాన్ని మంత్ర శాస్త్రపరిభాషలో చేర్చు కొంటామునగాని, కావ్యాలలో ఉండనీయ మంటారు గాబోలు! అయితే, ఇదో? కాశీ V. 224 "అనంతరంబు బొడ్డు నివురుకొంచుం బ్రాణాపాన సమానోదాన వ్యానంబులు తృప్తిబొంది నాకు నానందం బొసంగుం గాతయని యాశీర్వదించు

కొనునది"—ఇది కుక్షింభరణ పరాయణుల పరిభాషే, గాని కావ్యాలలో బ్రాహ్మణ సంతర్పణము వర్ణించరా? పోనీండి. భాగ II, 240, చ. "ప్రియుఁడగు బొద్దుఁదమ్మి తొలిబిడ్డడు వేలుపుఁపెద్ద" భాగ IX. 376 సీ. ఒకవేయి తలలతోనుండు జగన్నాధు బొడ్డుదమ్మిని బ్రహ్మపుట్టెమొదట' చిత్రభార. IV 120 ..'బొడ్డుఁ దామర పువ్వునఁ బొడమినట్టి ముద్దు పాపఁడు నాలుగు మోములాఁడు'— ఈ వాక్యములలో 'బొడ్డు' పురుషులది, మొగవాళ్ళకు 'బొడ్డు'న్నా ఆడవాళ్ళకుమాత్రము 'బొడ్డు' పెట్టడము గ్రామ్యము. పొక్కిలే ఉండవలెను, కాంతాసమ్మితములయిన సత్కావ్యములలో సత్కవుల సాంప్రదాయము అదే; అని వాదించే పండితుల అజ్ఞాన ధ్వాంతభాస్కర మనే భేషజము ఇదిగో! పింగళసూరన రచించిన ప్రభావతీప్రద్యుమ్నములో (చూ. II. 83) ప్రభావతి సౌందర్యము వర్ణిస్తూ హంస ప్రద్యుమ్నునితో చెప్పిన వాక్యము చూస్తే తెలిసివస్తుంది.

తే. నెన్నడిమి పేరిమింట నన్నెలఁత బొడ్డు,
పొన్నవిరి నిక్కముగఁజూచి చిన్న బోదు
రభ్రకుసుమ సౌరభ సాధనార్థహేతు,
వాశ్రయా సిద్ధమనియెడి యయ్యలెల్ల.

సూరనా సత్కవి! ప్రభావతీ ప్రద్యుమ్నమా సత్కావ్యము! ప్రభావతా ఉత్తమ నాయిక! ప్రద్యుమ్నుడా ఉత్తమ నాయకుడు! వాక్యమా వాణి యను గ్రహమున శబ్ద సంస్కార పూతమయిన ముఖముగల 'శుచి ముఖి' పలికినది!

దుష్టలక్షణమువల్లను గుడ్డిపంతుల అవిమృశ్యకారిత్వము వల్లను ఆంధ్ర భాషకు, ఆంధ్ర సారస్వతమునకు, ఎంతకీడు కలుగుతున్నదో చూచినారా?

## అది, ఇది: వాఁడు; వీఁడు.

53. పూజ్యురాండ్లయిన ఉత్తమ స్త్రీలనుగురించి మాట్లాడేటప్పుడు 'అది' ఇది, అనే సర్వనామములు ఇప్పటి లౌకిక భాషలో శిష్టులు వాడరు. అయితే, ఇప్పటి లౌకికభాష గ్రామ్యమని వేంకటరాయ శాస్త్రులవారు నిరాకరించినారు, వారికి గ్రంధములలోని భాషమాత్రమే సాధువు, దానికి వ్యతిరిక్తమైనది, శిష్టజన వ్యవహారమందున్నా సాధువుకాదు. ఇట్టి నియమముగల శాస్త్రులవారు నేటి భాషా మర్యాద ప్రమాణముగా చేసుకొని కాబోలు వేంకటరత్నము పంతులవారి ప్రయోగములను నిందించినారు. ఇది మాకు వింతగానున్నది. శ్రీ ర్ధ ప్రసన్నరాఘవములో (చూ. పుట. 26) రాముడు సీతను గూర్చి —

"క. ఇదె నామదియను కలువకు, ముదంబునిడు శారదమగు పున్నమరేయై
పొదలెడు వెండియునీయెడ, నిదియె జగన్మోహిని యన నెసఁగెడునాహా.

ఈ ప్రయోగమును నిందిస్తూ శాస్త్రిలవా రేమన్నారో చూడండి.—'ఇది', 'ఇదియె' యని సీతకు రాముఁడు ప్రయోగించుట కడు విరసముగా నున్నది వృద్ధ పత్యుచితము (చూ. విమర్శము పు 90). ప్రసన్న రాఘవ మందే (చూ పుట 29) రామలక్ష్మణ సంభాషణములో, "లక్ష్మణుఁడు అర్యా! ఇది యగపడుచున్నది. రాముడు—అది యెట్లు తిరిగివచ్చెను?" అనే వాక్యము లున్నవి. శాస్త్రిలవారి విమర్శములో (చూ. పు 107) "ఇందు 'ఇది' యను పదము సీతాపరముగా రాముఁడు గ్రహించినట్లు ఉత్తర వాక్యము వలనం దెలియుచున్నది లక్ష్మణునిచేత సీతను 'ఇది' యనిపించుట రాముని చేత 'అది' అనిపించుట రసాభాసముగా నున్నది. వృద్ధపత్యుచితమని తెలిపి యున్నాఁడ" అని రెండవమారు ఆక్షేపించినారు. మరి ఒకచోటకూడా 'ఇది' అని సీతనుగురించి రాముడన్న వాక్యములో ఉంటే, 'నాగరముగా లేదు' అని మాత్ర మన్నారు (చూ. విమర్శము పు. 251). ఇట్లు ముమ్మారు జంకు లేకుండా 'ఇది' అది' అనే శబ్దములు ఉత్తమ స్త్రీలను గురించి భర్తలయినా వృద్ధపతులయితేనే తప్ప ప్రయోగించి వాడకూడదని శాస్త్రిలవారు నిషేధించి నప్పుడు, తమ అభిప్రాయమందు దృఢవిశ్వాసము గలవారనే ఊహించ వలెనుగదా. మరి, చూడండి ప్రాచీన కవులు ఈ శబ్దములు ఉత్తమ స్త్రీలను గురించి చెప్పిన వాక్యములలో ఎట్లు వాడి ఉన్నారో.

54. మొట్టమొదట ఆదిమకవి నన్నయ రచించిన భారతములోనివే ప్రయోగాలు స్థూలదృష్టితో చూస్తే కనబడ్డవాటిలో మూడుపదులు ఉదాహ రిస్తాము.

(1) ఆది. I. 29. సీ. "ఎవ్వరి సతియిది చెప్పుమా జాతవేద." (భృగుపత్ని).

(2) ఆది 1-130. 'ఇది నాకుఁ బొల్లివరియింపంబడిన భార్య'

(3) ఆది. III. 38. వ. "అదియును, యిమ్మని శాపంబిచ్చునో యని వెఱచి యిట్లనియె" (సత్యవతి వ్యాసుని తల్లి)

(4) ఆది 3. 40 వ. .'అది గంధవతి యనియు యోజనగంధియ నియుఁ' బరగి

(5) ఆది.4.49చ. ఇదిమునినాథకన్యయని యెంతయు నిస్పృహవృత్తినున్న నా
హృదయము రాజపుత్రినని యిక్కమలాక్షి నిజాభిజాత్య సం
పద నెఱిగించి నన్ మదనబాణ పరంపర కిప్పుడుండు నా
స్పదమయి సంచలించె నళి పాత వికంపిత పంకజా కృతిన్.

ఇట్లు దుష్యంతుడు శకుంతలను వివాహము చేసుకోగోరి దానిని గురించి చెప్పిన వాక్యములో ఆరాజుచేతనే నన్నయ 'ఇది' అనిపించినాడు. దుష్యంతుడు 'వృద్ధపతి' కాడు గదా! శకుంతల వృద్ధనారి కాదుగదా! వేశ్య కాదు గదా!

(6) ఆది. 4. 134 వ ప్రతీపుండు దానింజూచి .యిట్లేల నాకురు వెక్కితనిన నది యిట్లనియె [గంగాదేవి, ముసలిదికాదు· ఉత్తుంగ పయోధరద్వితయ]

(7) ఆది 4. 137 వ ..అది యును నట్ల చేయుదునని యదృశ్య యయ్యె ('అది' గంగాదేవి)

(8) ఆది. 4,143చ కనిముని కన్యయోదనుజకన్యకయో భుజగేంద్ర
కన్యయో యనిమిషకన్యయో యిది వియచ్చర కన్యకయో.

ఇట్లు 'ఇది' అని గంగాదేవిని గురించి శంతనునిచేత నన్నయ అనిపించినాడు శంతనుడు 'వృద్ధపతి' కాడు, 'సంప్రాప్తయౌనుడు.'

(9) ఆది. 4 144 వ. అదియును నమ్మహీపతి రూపయౌవన సౌందర్య విలాసంబులకోటువడి ('అది' గంగాదేవి)

(10) ఆది. 4,152వ....అదియుం దొలిచేసిన సమయంబు దలంచి ('అది' గంగాదేవి)

(11) ఆది. 4.225వ దీర్ఘతముండు ప్రద్వేషిణినడిగిన నది యిట్ల నియె ('అది' బ్రాహ్మణి)

(12) ఆది. 5.189 సీ.గీ .దివిజ నాయకుఁడతి భీతి నెఱిఁగి వాని తపముఁ జెఱుపబనిచె! జలజనయనఁ దరుణి జల పది యనియెడుదాని; నదియు వచ్చె వానికడకు.

(13) ఆది. 6.217 తే. ..ఇది చాలనబలదీనికలుఁగఁజనదు (హిడింబి)

(14) ఆది. 7.72 సీ. గీ. సర్వలక్షణప్రశస్తాంగి యిది దివ్యకన్య యగు....ఇట్లు సంవరణుడు తపతింజూచి పలికిన వాక్యములో 'ఇది' అన్నాడు ఇతడు వృద్ధపతికాడు, 'అభినవ యౌవన విభ్రమోద్భాసితుడు'

(15) ఆది 7.213. క. గురువచన స్థితిమనకేగురకును నిది పత్నిగా దగున్, ఇట్లు ధర్మరాజు తమ్ములతో ద్రౌపదినిగూర్చి చెప్పినప్పుడు 'ఇది'

అన్నాడు. ద్రౌపదీ వివాహమునకు పూర్వము పాండవులు వృద్ధులుకారు గదః ద్రౌపది నిత్యయౌవన' అని శాస్త్రిలవారికి తెలుసును. తెలియకపోయినా, పెళ్ళి నాటికి ముసలిది కాదుగదా? ఉత్తమస్త్రీయేకదా? ఇట్టిదానినే, ధర్మరాజువేతనే, నన్నయభట్టే, 'ఇది' అనిపించినాడు.

(16) ఆది VIII 104 సీ. అబ్జజువీడ్కొని యది దేవసభకుఁ బ్రదక్షిణంబొనరింప. (అది తిలోత్తమ)

(17)ఆది. VIII 108క. ఇది నావల్లభ యిది నాహృదయేశ్వరి యనుచు గోరి యిరువురు మదనోన్మదులయి పరిగ్రహించిరి ('ఇది' తిలోత్తమ, పరిగ్రహించినవారు సుందోపసుందులు వృద్ధులుకారు.)

(18) ఆది. VIII 154 క ..ఆతని కది యిట్లనుచుఁ జెప్పె ('అది' వందయను నప్సరస).

(19) అర. II 75 వ. కావున నిది మదనుజీవితయనియు ననువ్రతయనియు నన్ను విడువక నాయనుగమనంబునకు ననుమతుఁడవు గమ్ము. ('ఇది' దమయంతి)

(20) అర. II 77. వ॥ ఇది నన్నుంగానకతనబంధులయొద్దకుంబోయి దుఃఖంబునం బొరయకుండును ('ఇది' యని దమయంతినిగూర్చి నలుడన్నాడు).

(21) అర. II 141 వ ఇది పతివిముక్తయై యొప్పకుందియుఁదనపతివ్రతాగుణంబున నొప్పుచున్న యది ('ఇది' యని దమయంతినిగూర్చి సుదేవుఁడను బ్రాహ్మణు డన్నాడు; అతడు ముసలివాడు కావచ్చును, గాని దమయంతికిపతికాడు.

(22) అర. 2. 147. వ. అయ్యా యిది యెవ్వనికూఁతురు? (దమయంతిని గురించి రాజమాత సుదేవునితో అన్నవాక్యము)

(23) అర. 2. 148 మధ్యాక్కర. నలినాక్షియిది విదర్భేషుతనయ పుణ్యశ్లోకుఁడైన నలుదేవి దమయంతిసుమ్ము (అని సుదేవుని ప్రత్యుత్తరము).

(24) అర 2 154 వ అది మనుఁగూతు నభిప్రాయంబు భీమున కెఱింగించిన (ఇక్కడ 'అది' భీమరాజు పట్టమహిషి, దమయంతి తల్లి).

(25) అర. 2. 193 వ. కేశినియును బాహుకుపలుకులు నాకారంబును దమయంతి కెఱింగించిన నది యాతని నలుంగా శంకించి. ('అది' దమయంతి)

(26) అర 2. 203 వ. అది యప్పుడు భీమ ననుమతంబున దమ యంతి యొద్దకు బాహుకు రావించిన ('అది' దమయంతి తల్లి).

(27) అర. 2 132 అదియును మునివరు నభిప్రాయం బెఱింగి.... యిట్లనియె. ('అది' లోపాముద్ర, ముని అగస్త్యుడు)

(28) అర. 3. 186 వ అది పతిచేత ననుజ్ఞాతయై చని నాకు యౌవన వరుం గావింపుండని ('అది' సుకన్య దానిపతి భార్గవచ్యవనుడు వృద్ధుగాని ఆశ్వినులు వానిని నవ యౌవనుని చేసినారు)

(29) అర. II 302. క. ఈరాజపుత్రిఁ దోద్కొని దారుణపాషాణ దుష్పథంబులఁ జనఁగా నేర మిది నడవనోపదు, ఘోరిభుజా అని ధర్మరాజు ద్రౌపదినిగురించి భీమునితో అన్నవాక్యము. ధర్మరాజు ఇప్పటికి ఇంకా 'వృద్ధపతి' కాలేదే!

(30) అర. III. 396 తే, అబల యిది భవన్మాత నిత్యాధ్వగమన ఖిన్నయైనది గజరాజ ఖేలగమన దీని నీవెత్తికొని చనుమెమ్మ—అని భీముడు ఘటోత్కచునితో ద్రౌపదినిగూర్చి చెప్పినాడు. భీముడు వృద్ధపతి కాడు.

నన్నయవలెనే తిక్కన ఈ శబ్దములు వాడినాడు. మచ్చుకు రెండు ప్రయోగములు చూడండి . ఆయన గ్రంథము మొట్టమొదటిపర్వము మొదటి ఆశ్వాసములోనే పదిపుటలు తిప్పిచూస్తే కనబడ్డవి ఉదాహరిస్తాము.

(1) విరా. 1. 103 చ. ఇది గడుముద్దరాలు పనులేమియుఁ జేయఁగ నేరదు. ఇట్లు తిక్కన ధర్మరాజుచేత ద్రౌపదిని 'ఇది' అని అనిపించినాడు. ధర్మరాజు ఇప్పుడు వృద్ధపతి అని వేంకటరాయ శాస్త్రులవా రంటారా?

(2) విరా. 1. 151 ఆ. అకట మనము వచ్చినది గడుదవ్వు నేఁడప్పు రంబు సొత్తమనితలంచి తఱిమి నడచితిమి లతాతన్వి యిది వడగొనియె మోచి లెమ్మ కొంత దవ్వు. ఈ వాక్యములోకూడా ధర్మరాజుచేతనే ద్రౌపదిని 'ఇది' అనిపించినాడు తిక్కన ఇట్టి ప్రయోగములు కావలసినన్ని తిక్కన భారతములో ఉన్నవి.

భారత కవులు ముగ్గురూ ఇట్లు వ్రాసినారని చూపించడమునకు ఎఱ్ఱా ప్రగ్గడ భారతములోనివికూడా కొన్ని ప్రయోగములు ఉదహరిస్తాము.

అర. VII. 172 వ.అదియును సాళ్వపతియైన ద్యుమత్సేనుని కొడుకు సత్యవంతుడు రూపవంతుడనియును ...విని వానియందుఁజిత్తంబు దగిలి యున్నను . ('అది' సావిత్రి)

అర. VII. 177వ. అనిన నదియుఁ. దండ్రికిట్లనియె. ('అది' సావిత్రి)

అర. VII. 191 తే విగత రాజ్యులమై ఘోరవిపినములకు వచ్చి యిమ్మెయి దపమున్న వారమేము, బాలసుకుమారి యిది జనపాల యడవినుండి మాతోడి యిడుమకు నోర్చునయ్య.

(ద్యుమత్సేనుడు తనకు కోడలుకానున్న సావిత్రినిగూర్చి 'ఇది' అనే శబ్దము ప్రయోగించినాడు)

అర. VII. 207 వ సత్యవంతుఁడు నీవు త్రిరాత్రోపవాసంబునంజేసి యెంతయు డస్సినదానవు రానోప వనినది వానికిట్లనియె (అది'సావిత్రి)

57. భూరిప్రయోగ మహిమచేత నిష్కళంక మనతగినవాదుక నింద్యమని వెంకటరాయశాస్త్రులవారు ఎందుచేత దూషించినారు? భారతములో నన్నయాదులు తరుచుగా ఈ శబ్దములు సత్సందర్భమందు వాడిఉన్నారని శాస్త్రులవారు ఎరుగరా? ఎరిగినవారయితే ఇవి వాడినందుకు వెంకటరత్నము పంతులవారిని ఎకసక్కెములాడి నారేమి? సీతను 'ఇది' అనుట 'వృద్ధపత్న్యుచితమని' నొక్కినొక్కి చెప్పిచెనకినారే! దుష్యంతునిచేత శకుంతలను, శంతనునిచేత గంగాదేవిని, సంవరణునిచేత తపతిని, ధర్మరాజు చేత ద్రౌపదిని, నలునిచేత దమయంతిని, ఇట్లు వృద్ధులుకాని ఉత్తమ పురుషులచేత, ఉత్తమస్త్రీలయిన భార్యలను 'ఇది' అని నన్నయ అనిపించగా, ఔచిత్యభంగము లేనప్పుడు, రామునిచేత సీతను 'ఇది' అని వెంకటరత్నముపంతులవా రనిపించితే ఎందుకుంటుంది? శాస్త్రులవారు ఇందుకు పంతులవారిని నిందించి నన్నయాదుల నిందించినవారయినారుకారా? శాస్త్రులవారు నన్నయాదుల ప్రయోగములు ఎరిగిఉండిన్ని పంతులవారిని ఆక్షేపించినారంటే శాస్త్రులవారి యందు దౌర్జన్యమో దౌర్మనస్యమో, ఏదోదౌష్ట్యము ఆరోపించవలసివస్తుంది. శాస్త్రులవారు ఈ ప్రయోగములు ఎరుగరు అని చెప్పితే, వారికి ఆంధ్రభారత మయినా బాగా రాదని సిద్ధాంతమవుతుంది. ఏమి సమాధానము? పోనీ, నన్నయాదులు ఔచిత్య మెరుగనివా రని అందామా? అంటే, ఆంధ్ర సారస్వతమున కాధారమే ఉండదు!

58. అన్నట్టు చెప్పమరచినాము, శాస్త్రులవారు శ్రీనాథుని నైషధమునకు సర్వంకషవ్యాఖ్య వ్రాసినారుగదా, శ్రీనాథుడు నలునిచేత దమయంతిని 'ఇది' అనిపించినాడని ఎరిగేఉంటారు.

తే. అలకతిమిరాభి దృశ్యఫాలార్ధచంద్రమెలఁత యిది కృష్ణపక్షాష్టమీత్రియామ;
దీనిప్రాపున నేల సాధింపకుండు విషమబాణుండు త్రిజగతీవిజయసిద్ధి. నైష. III

160. ఈపద్యమునకు వ్రాసిన టీకలో 'మెలంతయిది=ఈయువిద' అని శాస్త్రిల వారే అర్థముచెప్పినారు. అయితే, 1913వ సం॥లో శాస్త్రిలవారు నైషధము చదువుకొన్నారు, ఆంధ్రప్రసన్నరాఘవ విమర్శము 1898వ సం.లో వ్రాసినారు; అంతకు పదిహేసేళ్ల పూర్వము, ఈవ్యాసము (21వ పేరాలో) 'లేఁ డయ్యె డున్' అనే శబ్దమునుగురించి శాస్త్రిలవారు పంతులవారిని అనరానిమాటలన డము అజ్ఞాన విజృంభణమని ఊహించుటకు ఏకారణములు వివరించినామో, అవే ఇక్కడకూడా అనుసంధానము చేసుకోవలెను. ఆంధ్రప్రసన్నరాఘవము విమర్శించేనాటికి శాస్త్రిలవారికి భారతముగాని, అధమపక్షము నలచరిత్రైనా కాని, నైషధముగాని బాగారాదని ఊహించడము తప్పుకాదు. ఆంధ్రపండితుల మని పేరు పెట్టుకొన్న శాస్త్రిలవార్లుగానీ, పంతులవార్లుగానీ మనుచరిత్రయినా చదువనివారు సాధారణముగా ఉందరుగదా, మనుచరిత్రమందు (IV. 38) క. అంత ననుఁగాంచి యది విపినాంతరమునఁ బాఱవైచి యరిగె . . అని దేవతా స్త్రీ పుంజకస్థలను 'అది' అని దాని కూతురిచేతనే ఆంధ్రకవితాపితామహుఁడు అనిపించినాడు. తల్లిని కూతురు అది' అంటే అనౌచిత్యము కాదని సమాధా నము చేసుకోవచ్చుననేవారు. మొగుడు పెండ్లాన్ని 'ఇది' అంటే, అనౌచిత్య దోషము కలుగుతుందని వాదిస్తే, చెల్లుతుందా? నన్నయాదిమహాకవులకు గ్రాంథికాంధ్రము రాదని సిద్ధాంతమైతేనేకాని గ్రాంధికాంధ్రము శాస్త్రిలవారికి బాగావచ్చునని సిద్ధాంతముకాదు. ఏమంటారో శాస్త్రిలవారు ?

59. విచక్షణులయితే, శాస్త్రిలవారు ఆలోచించు కొందురుగాక; మేముదాహరించిన మహాకవిప్రయోగములలో, 'అది', 'ఇది' అనేసర్వనామము లకు బదులుగా వాడుటకు మరి ఏసర్వనామములు తెలుగులో ఉన్నవి? 'ఇది ముద్దరాలు' అనేవాక్యములో 'ఇది' తీసివేసి, 'ఈబిడ్డ', 'ఈమె', 'ఈకె', 'ఈపె' 'ఈయమ' 'ఈయమ్మ', 'ఈయవ్వ', 'ఈమెగారు' మొదలయిన శబ్దములలో ఏదైనావాడితే, అనౌచిత్యదోషము పోతుందా? 'అది' 'ఇది' వాటి నట్లే ప్రాచీనకవులు ఆశబ్దముల ద్వితీయాది విభక్తులు 'దానిని', 'దీనిని' మొదల యినవన్నీకూడా వాడిఉన్నారే, ప్రథమావిభక్తి తప్పైతే తక్కినవిభక్తులుకూడా తప్పులేకావలెను. ఇవన్నీశాస్త్రిలవారు విడిచి పెట్టితే మౌనమువహించి మహా మునులు కావచ్చును. వారిమాటచొప్పున గ్రాంథికభాషవ్రాసేవారుకూడా వారి వంటి మహామునులవుతారు వారి గ్రంథాలుకూడా మౌనముద్రవహించి, పూజ్య మవుతవి అయితే, లోకవ్యవహారమునకు హానికలుగకుండా మాత్రము లౌకికభాషలో ఉన్న 'ఇది', 'అది' 'దీని' 'దాని' మొదలయిన శబ్దములు లోకులు వాడకమానరు. శిష్టసంప్రదాయమును అనుసరించి లోకులు అది, అవి(బి)డ, ఆమె, ఆకె, ఆపె, వారు, ఆయమ్మ, ఆయమ్మగారు మొదలయిన

వన్నీ ఏ సందర్భములో ఏది ఉచితమో, అదే వాడుతారు; చిన్నపిల్లలయినా తప్పుచేయరు. ప్రాచీన గ్రంథములు వెదకి ప్రమాణములు పండితులు కనుక్కొనేవరకూ వ్యవహారము ఆగదు. పండితులకు గ్రాంథికభాషేకాని లౌకిక భాష అక్కరలేదుగనుక, వారి గ్రాంథికభాషలోని శబ్దముల ఔచిత్యానౌచిత్యములు విమర్శించవలసి వచ్చినది. గ్రాంథికభాషలో నన్నయాదులభాష అత్యుత్తమమైనది గనుక వారి గ్రంథములలోని ప్రయోగములనుపట్టి మావాదము సమర్థించినాము. తప్పుంటే, ఒప్పుకొని దిద్దుకొంటాము.

## వాఁడు - వీఁడు

60. లౌకికభాష నింద్యమని నిరాకరించి, పరమపవిత్రమయినభారత భాష అభ్యసించిన శాస్త్రిలవారు, ఆరెండు భాషలకూగల వైధర్మ్యము మరచి, లౌకికభాషా లక్షణము ప్రమాణముగాచేసుకొని, భారతభాషను దూషించడము విపరీతముగా ఉన్నది ఈవైపరీత్యము (వీఁడు) అనేశబ్దమునుగురించి వీరు ప్రకటించుకొన్న ఔచిత్యజ్ఞానమందు కనబడుతున్నది. ఆంధ్ర ప్రసన్నరాఘవములో (చూ. పుట 40) జనకవిశ్వామిత్ర సంభాషణమందు రాముని చరిత్రము ఏమీఎరుగని జనకుడు, రాముని గుణములు విశ్వామిత్రుడు వర్ణించగా విని, సంతోషించి, అన్నవాక్యమిట్లున్నది —'ఎట్లు వీఁడు వీరావతారుఁడు కుమారుండు?" ఈ వాక్యమునకు పూర్వము కుండలీకరణముచేసి "సహర్షంబుగ" అని పంతులవారు వ్రాసిఉన్నారు. దీనివిమర్శములో శాస్త్రిలవారి ఔచిత్య వైలక్ష్యము మరిఒకమారు ప్రకటితమయినది చూడండి పంతులవారికి ఎంతసరసముగా ఔచిత్యముఁబోధపర్చినారో శాస్త్రిలవారు.

కడమ యన్ని విషయము లట్లుండ 'వీఁడు' అన్నందులకు రాఁముడు విశ్వామిత్రులవారు లేకున్న జనక రాజుచు ఏగతి పొందించి యుండునో? ఏమి పంతులవారి యౌచిత్య జ్ఞానము ? ఇతఁడని యేని వ్రాయరాదా? మఱి యీ వాక్యమును ఇట్లు ప్రశ్నగాతగులఁబెట్టక. 'ఎట్లువీరావతారుఁడీ కుమారుండు!' అని యాశ్చర్యపడిన నెంతబాగుగా నుండును! శివ శివా! సర్వనామములను పృథక్కరించి వీరు ఈ గ్రంథము నెల్ల నేమి యసహ్యము చేసినారు! (పుట. 140 విమర్శము)

61. పంతులవారు కుండలీకరణము చేసి, ('సహర్షంబుగ')అని వ్రాసిన మాట శాస్త్రిలవారు చూచిన్నీ, జనకుని వాక్యమందున్న 'వాఁడు' శబ్దము రాముని యెడల జనకునికి తిరస్కార భావ మున్నట్లు చూచిస్తున్నదను కోపడమునకు కారణము, ప్రాచీన కవుల సంప్రదాయము బాగా తెలియక పోవడ

మున్ను, లౌకిక భాషా మర్యాదలు (గ్రామ్యమని తామువితండా వాదముచేసినా) ఒంటికి గట్టిగా పట్టి ఉన్నందున, వాసనాబలమువల్ల వాటిని వదలక పోవడమున్ను, కాక, మరేమిటి?

62. ప్రసన్నరాఘవమందు (చూ. పుటలు 94, 95) రామరావణ యుద్ధము విద్యాధరుల సంభాషణ రూపముగావర్ణించిన పట్టున విద్యాధరుని వాక్యములో రావణుని 'వీఁడు' అని పంతులవారు విద్యాధరునిచేత అనిపించినారు. చూడండి ఆవాక్యము· 'విద్యా ఈ రావణుఁడేమి సామాన్యుఁడా! ఈ రావణుఁడు దక్కవేఱెవఁ డిక్కయివడి నేచె?

శా. పోలంబల్కుదు మెట్టులీ దశముఖుం బోరన్ బడన్ వజ్రఘా
తాళుల్న్వ్వేడు వాండు వీడహ . ."

63. ఈ పద్యమందు శాస్త్రులవారు చూపించిన ఇరువై దోషములలో శబ్దదోషము ఒక్కటే. అదే మా ఉపన్యాసమునకు విషయము గనుక తక్కినవి విడిచి అది చూపిస్తున్నాము. "రావణుని 'వీఁడు' అని తిరస్కారముగా పల్కుట సరిగా లేదని శాస్త్రులవారు పంతులవారి పద్యము దిద్ది 'వీఁడు' తీసి వేసినదానికి బదులు 'ఇతండ'ని వ్రాసినారు.

64. పంతులవారి గ్రంథము చదివే వారికి, జనకుని వాక్యములో రాముని ప్రశంస, విద్యాధరవాక్యములో రావణుని ప్రశంస కనబడతవిగాని తిరస్కారము ఏమీ కనబడదు. శాస్త్రులవారి బుద్ధికి, లౌకికవ్యవహార వాసనా బలము చేత 'వాఁడు', 'వీఁడు', 'అది' 'ఇది' అనే శబ్దములు, 'ఒరే' 'ఒసే'. వలెనే 'నీచత్వసూచకములుగా తోచినవి.' అందుచేతనే విద్యాధర వాక్యములలో 'వీఁడు'కు బదులుగా 'ఇతఁడు' వాడవలసినదని ఉపదేశించినారు.

65. ప్రాచీన మహాకవులభాషలో 'వాఁడు', 'వీఁడు' అనే శబ్దములు తిరస్కార బోధకములు కానేకావు, 'అతఁడు' ('అతఁడు') 'ఇతఁడు' ('ఈతఁడు') అనే శబ్దములు 'వాఁడు', 'వీఁడు' కన్న ఎక్కువ గౌరవమును సూచించవు. పద్యాలలో ఏది ఇమిడితే అదే కవులు వాడి ఉన్నారు. నూరుల కొలదిగా భారతములో నుంచే ప్రయోగములు ఎత్తి ఉదాహరించవచ్చును; గాని, చదివే వారికి విసుగు పుట్టునేమో అని జంకి కొన్ని మాత్రము చూపిస్తున్నాము.

(1) ఆది 3. 194వ. ..శర్మిష్ఠా పుత్త్రుఁ బూరుం బిలిచి యడిగిన వాఁడు దండ్రి గోరిన యట్లు చేసిన

(2) ఆది. 2. 197 క. యదుఁడగ్రతనూజుఁడు వాఁడయిన

(3) ఆది. 4. 160 వ. వీఁడు మర్త్యలోకంబునఁ బెద్ద కాలముండును (ప్రభాసుడును వసువు)

(4) ఆది 4 225 వ. వాఁడును దీర్ఘతముండునాఁబుట్టి (బ్రాహ్మణుఁడు, గొప్ప ముని)

(5) ఆది. క. వాఁడు సంతతి గావించు విచిత్ర వీర్యక క్షేత్ర మునన్ (బ్రాహ్మణుడు)

(6) ఆది. 4. 253. వ. వాఁడు మాతృదోషమున నంధుండు (ధృత రాష్ట్రుండును) వాఁడును పాండు దేహుండు (పాండురాజు.)

(7) ఆది 7. 113 వ. వాఁడు విశ్వామిత్రు నాదేశంబున కల్మాష పాదునంతరాత్మ నావేశించి (రక్కసుడు)

(8) 7. వ. వాఁడంతః పురంబున నుండి (కల్మాషపాదుడు) వాఁడు వింతప్రొద్దు మాంసంబు వడయనేరననిన (బానసంబువాఁడు)

(9) ఆది. 7. 115 క. నీవు మనుష్యాదుఁడ వవుమని వాఁడిచ్చె శాప మన్నర పతికిన్ (బ్రాహ్మణుడు)

(10) ఆది. 8. 199 ఉ. వీరుఁడు వీఁడు పాండవుఁడు వృష్ణికులోత్త ములైన సీరిదైత్యారు లెఱుంగకుండఁగ మహారదుఁడై తరుణిన్ సుభద్రనం, భోరుహ నేత్రఁ దోడ్కొనుచుఁ బోయెడి
(నన్నయ అర్జునుని పురరక్షకులచేత 'వీఁడు' అనిపించినాడు)

11 ఆది. 8. 208 సీ. వాఁడంత యశ్రమ సాధ్యుదే? (అర్జునుడు)

(12) సభా. 1. 86 వ. వాఁడును బ్రాహ్మణ వచనంబునంజేసి యెల్ల రాజులకు నధికుండయి రాజసూయ మహాయజ్ఞ కరణంబునంజేసి దేవేంద్ర సాలోక్యంబువడసె నట్టి హరిశ్చంద్రు మహిమాతిశయంబు (హరిశ్చంద్రుని 'వాఁడు' అన్నాడు నన్నయ)

(13) సభా 1. 138. వ. ఇట్లుపాస్య మానుండయి చండకౌశికుండు బృహద్రధునకు మెచ్చి నీ కిష్టంబు చెప్పు మిచ్చెదననిన . వాఁడిట్లనియె (బృహద్రధుని 'వాడు' అన్నాడు)

(14) అర. 3. 131 వ. గాధియను రాజుకూఁతు సత్యవతి యనుదాని భృగు పుత్త్రుండగు ఋచీకుండను మహాముని వివాహార్థియై యడిగిన నమ్మని వరునకు వాఁడిట్లనియె.

(15) అర. 3. 178 వ వాఁడెల్ల వారినడిగి.... .చింతా పరుండై యున్నఁ దండ్రి కడకు వచ్చి సుకన్య యిట్లనియె (శర్యాతి)

(16) అర. 3. 371 క. ప్రియసాహసుండు భీముఁడు భయ విర హితుఁ డెందుఁబోయె బహురాక్షస సం, శ్రయ మిగ్గిరి గంధర్వానన్వయ సేవ్యం బేకచరుఁడు వాఁడెయ్యెడలన్.

66. హరిశ్చంద్రుని వంటి చక్రవర్తులను, బ్రాహ్మణ మునులను, దాన వను వానిని రక్కసుని అన్నట్టే, నన్నయ 'వాఁడు' అని నిర్దేశించి, అర్జునుని సామాన్యులయిన భటులచేత 'వాడు' అనిపించినాడు చూచినారా? నన్నయ భాషలో 'వీఁడు', 'ఇతడు' అనే శబ్దములకు ఏమీ భేదము లేదన్నందుకు ప్రయోగములు చూపిస్తున్నాము.

ఆది. 5. 244 క. ఆతఁడు మీకుం బ్రియ శిష్యుండట ఈ వాక్యములో 'ఆతఁడు' ఏకలవ్యుడు; దీనికి వెనుకటి వచనము ( 38) లో ఏనుబాణంబు లొక్కయమ్మేసిన యట్లక్కజంబుగా వాఁడేసిన అనిన్ని, తర్వాతి వాక్యము (247) లో 'పెను వ్రేలు దునిమి వాఁడిచ్చెదాని నాచార్యునకున్' అనిన్ని ఆ ఏకలవ్యునిచే 'వాఁడు' అన్నాడు.

సభా. 1.109 క శిశుపాలుఁడు సంతతమును నాతని కొలుచు, అనిన్ని తర్వాతి వచనములో (హంసడింభకులు) వానికి వామదక్షిణ భుజంబులుఁబోలె వర్తిల్లుదురనిన్ని, రెండు సర్వనామములున్ను వాడినాడు. సభా. 241 సీ. లో శిశుపాలుడు కృష్ణుని మూదవ చరణములో 'వీఁడు' అనిన్ని గీతములో 'అతనిని' 'వాఁడు' అనిన్ని అన్నాడు. ఏమి విశేష మున్నది?

అర. 1. 115-ఆ. ఏను ధర్మసుతుఁడ నీతండు భీముండు వాఁడు విజ యుఁడు అని ధర్మరాజు భీముని 'ఈతఁడు' అనిన్ని, అర్జునుని 'వాఁడు' అనిన్ని అన్నప్పుడు ధర్మరాజుకు భీముని యెడల గౌరవమున్ను, అర్జునుని యెడల అగౌరవమున్నూ కలదని చెప్ప వచ్చునా? పద్యములో ఏమాట ఎక్కడ ఇమిడి నదో ఆమాట అక్కడ నన్నయ వాడినాడని చెప్పక తప్పదు.

అర. 1. 374 'తరలము' శిపుఁడు వీనికిఁ బ్రీతుఁడై దయసేసెఁబాశు పతాస్త్రము. . యీతఁడు .దేవకార్యము దీర్పఁగా . (౨76. క ) . దాన వుల .వీఁడ భేద్యుఁడై వధియించున్' అని అర్జునుని ఇంద్రుడు 'వీనికి', 'ఈతఁడు', 'వీఁడు' అన్నాడు

67. ఇటువంటివి ఎన్ని కావలిస్తే అన్ని ప్రయోగములు నన్నయ గ్రం థమునందే ఉన్నవి. తిక్కన, ఎఱ్ఱప్రగడ, శ్రీనాధుడు, పెద్దన మొదలయిన

వారందరూ ఉత్తమ పురుషులను 'వాడు' అన్నవారే. వెంకటరత్నము పంతుల వారు జనకుని చేత రామునిన్ని, విద్యాధరునిచే రావణునిన్ని 'వీడు' అనిపించి నందుకు పంతులవారికి ఔచిత్య జ్ఞానము లేదని నిందించినప్పుడు, శ్రీనాధుడు కూడా పంతులవారి వలెనే 'వీడు' వాడినాడని శాస్త్రులవారు ఎరుగరేమోకాని, తర్వాత నైషధములో నేర్చుకొని ఉన్నారు. గనుక, పరామర్శనార్థము 5వ ఆశ్వాసములో 'వీఁడు' గలవి నాలుగు పద్యములుదాహరిస్తున్నాము.

తే. వెలఁది వీఁడేలు నుజ్జనివీటియందు (83) (ఉజ్జయనీపతి)

క. వ్రీడావతి యీ భూపతి గౌడ బిడౌజుండు; వీఁడు కమనీయ రతి
క్రీడా రహస్యకోవిద చూడామణి, తెప్ప లెత్తి చూడుము వీనిన్ (90)

క. దశ శతదృ గర్వ గర్వ ప్రశమన హేలాధురీణ పటు వేద నిరం
కుశ శైవ్య తురగ రింఖోవిశ కలిత దిగంత ధరణి వీఁడు లంరాంగీ
(105. కాశీరాజు)

స్రగ్ధర. లీలంగట్టించెఁబెక్కుల్మెలవులఁ జెఱువుల్ వీఁడు (కీకటాధీశ్వరుదు)

ఇట్లు శారద చేత సభలో మహారాజులను 'వీఁడు' అని శ్రీనాధుడని పించినప్పుడు, ఔచిత్య భంగము కలిగినదా? ఇట్టి మహారాజులనే మరికొందరిని శారద చేతనే 'ఈతఁడు' అని ఆకవే అనిపించినాడు; చూడండి . .

క. గోవర్ధనాద్రి తటములఁ బ్రావృట్కాలముల విపినబర్హిణనటన
ప్రావీణ్యము వీక్షింపుం డీవును నీతండు వేడ్కలింపెసలారన్
(మధురాధిపతి)

క. పాటించి యితని వేఁడిన చాటు కవీశ్వరుల హస్తజలజంబులకున్
హాటక దీనారములు వరాటక సంఘాటములు వరాటేంద్ర సుతా.

'వీఁడు' అని పించు కొన్న రాజుల కంటె 'ఇతఁడు' అనిపించుకొన్న రాజులు ఎక్కువ వారని శ్రీనాధుని అభిప్రాయమా? అట్లయితే ఒక్కరాజునే ఒక పద్యములో 'వాఁడు' అనిన్ని, మరొక పద్యములో 'ఇతడు' అనిన్ని ఎట్లు వర్ణించినాడు? 90-వ పద్యములో 'వీఁడు' అన్నగౌడ బిడౌజుని, 94-వ పద్యములో 'ఈతని చరిత మద్భుత కరంబు' అని వర్ణించినాడు. ఇట్లే కాశీఖండము లోను, భీమఖండములోను శ్రీనాధుడు 'వీఁడు, ఇతఁడు శబ్దములు సమానమైన యోగ్యతగలవిగానే ఎంచినట్టు ఊహించడము తప్పుకాదు.

68. మను చరిత్రములో, పెద్దనగారు వరూథినీ వల్లభుడయిన ప్రవ రాఖ్యుని దాని సఖులచేత 'వాఁడు' అనిపించినారు చూడండి. ఉ. ఇందుని భాస్యవాఁడనఁగ నింద్రుఁడొ చంద్రుఁడొ యా యుపేంద్రుఁడో....ఇందులో

అనౌచిత్యము దోషము ఏ పండితులూ ఇదివరకూ చెప్పలేదు; గాని, వేంకట రాయ శాస్త్రులవారు వేంకటరత్నము పంతులవారియం దారోపించిన దోషము స్థిరపడితే, నన్నయ, తిక్కన, ఎఱ్ఱప్రగడ, శ్రీనాథుడు మొదలయినవారితో పాటు ఆంధ్ర కవితా పితామహుడున్ను పంతులవారి వలెనే ఔచిత్య జ్ఞానము లేక తమ కావ్యములను 'అసహ్యము చేసినవారు' కాక తప్పదు. అయితే ప్రాచీన భాషామర్యాద చొప్పున విమర్శించినప్పుడు, వారి ప్రయోగములు సాధువులేకాని అసాధువులు కావు. వేంకటరాయ శాస్త్రులవారి గ్రాంథికాంధ్ర భాషాజ్ఞానము ఎట్లాఉన్నదో చూచినారా? వారికి భారత మయినా బాగారాదుగదా!

69. ఈ కాలమందున్న శిష్టజనుల వ్యావహారము చొప్పున శబ్దముల సాధుత్వము, ఔచిత్యము ఏర్పర్చుకొంటే, 'వాఁడు', 'అతఁడు', 'అతను', 'ఆయన', 'ఆయనగారు' 'వారు' 'వారలు' మొదలయినవిన్ని, 'నీవు', 'మీరు' * 'తమరు', 'దేవర' దేవరవారు మొదలయినవిన్ని. ఎక్కడ, ఎప్పుడు. ఎవరినిగురించి ఏది ప్రయోగించవలెనో అక్కడ, అప్పుడు, వారిని గురించి అది ప్రయోగించకపోవడము వల్ల ఔచిత్య భంగము కలుగడమే కాక వ్యవ హార హానికూడా సంభవిస్తుంది. రామయ్య అనే పేరుగల ఒక గొప్ప ఉద్యో గస్థుని 'మహారాజశ్రీ రామయ్య పంతులవారు' అనకుండా, కేతన తిక్కనను తిక్కఁ డన్నట్లు 'రామయ్య' అనిగాని, రాముఁడని గాని అననే కూడదు. 'రామయ్యగా' రంటే తగిన గౌరవము లేదు. 'రామయ్య పంతులు' అంటే తిరస్కారము. రామయ్య పంతులు 'గారన్నా తృప్తికాదు' రామయ్య పంతుల వారంటే బొటా బొటీగా సరిపోతుంది. ఆపైని ఏమున్నా అధికస్య అధికం ఫలం, 'అయ్యవార్లంగారు' లోకములో సిద్ధ శబ్దము· 'అయ్య, అయ్యగారుఁ'

---

* వేంకటరాయ శాస్త్రులవారి "ప్రతాపరుద్రీయ" మనే నాటకము నందు, 'తమ' శబ్దమునకు బదులుగా 'మీ' శబ్దము వాడిన ఢిల్లీ సుల్తానుకు తెలుగుభాష బాగా రాదని రాజకుమారుడు, చిన్నపిల్లవాడు ఆక్షేపించినట్టున్నది. ఈ తేటు నేటి తెలుగులోనిదిగాని, గ్రాంథి కాంధ్రములోనిది కాదు చూడండి. (అంక. 0)

ఢిల్లీ సుల్తాన్—చినహోజావమ్మవారూ! మీ స్నేహితులు. ..;

బాలుఁడు— మీ' అంటారేమి? భాష బాగా రాదా?

సభ్యులు—'భళి! భళి! అట్లు పుట్టుకతో రావలయుఁగాని తెచ్చుకొన్న వచ్చునా!'

సుల్తాన్—'వహవ్వా!....పొరబాటు. మన్నించండి. తమ స్నేహితులు ఢిల్లీలో ఉన్నారు.'

అయ్యవారు సమానార్థకములు కావే. 'అమ్మ', 'అమ్మగారు', అమ్మవారు—పర్యాయపదములు కావే. ఇట్లే భాషలో అన్ని శబ్దములున్ను—విశేషములు, విశేష్యములు, సర్వనామములు, క్రియలు, అవ్యయములు, నిపాతములు, సుప్తిజంతములు—వాటి అర్థములున్ను—లోక వ్యవహారము చొప్పున ఉండవలెననే నియమము పండితులు ఒప్పుకొనే వరకూ వారి తెలుగు భాషయొక్క సాధుత్వము ప్రాచీనాంధ్ర గ్రంథములలోని భాషను పట్టి నిర్ణయించవలెను. పండితులకు గ్రాంథికమే గాని లౌకికము ప్రమాణముకాదు. సిద్ధిర్లోకాత్ అనే సూత్రానికి అట్లా అర్థము చెప్పుతారట. అయితే, పాణిని, కాత్యాయనుడు, పతంజలి వైదిక లౌకిక భాష లనుశాసించినారు

## ఇచ్చి పుచ్చు మొదలయినవి

70. ఆంధ్ర ప్రసన్నరాఘవము సప్తమాంకమునందు కరాళకుని వాక్యములో "ఒకా నొకనిచేత నిచ్చి పుచ్చినది చిత్రపటము" అని ఉన్నది. (చూ. పుట. 87) శాస్త్రులవా రీవాక్యము విమర్శించి, ఇట్లు వచించినందుకు "వానిని ఉన్మత్త వైద్యశాలకు పంపవచ్చును" అని సిద్ధాంతము చేసినారు. (చూ. విమర్శము పుట 275.) 'ఇచ్చి పుచ్చినది' అనుటకు 'ఇయ్యవలసినది, అని మార్చిన "వాక్యములోని యనన్వితి దోషము కొంత తీఱును అని ఉన్మత్త చికిత్స చేసినారు. వేదము వేంకటరాయ శాస్త్రులవారు అపూర్వ పండిత భిషజ్ మణులు గదా. వారి చికిత్స అతి చిత్రమయినది. దుష్టాంగము చక్కబర్చుట కోసము నిర్దుష్టమయిన అంగము ఛేదిస్తారు. కరాళకుని వాక్యములో ఉన్న అనన్వితిదోషము 'ఇచ్చి పుచ్చినది' అనే వాక్యాంగమందు వారి శాస్త్రీయ దృష్టికి కనబడ్డది; గాని మా లౌకిక దృష్టికి ఈ వాక్యాంగమందు మాత్రము ఏ దోషమున్నూ కనబడలేదు.

శాస్త్రులవారి శాస్త్రీయదృష్టిన్ని వారిసిద్ధాంతములున్ను అమోఘమైనవి కావని ఈవ్యాసము పూర్వభాగములో రుజువు చేసినాము. 'లేఁచుమ్యేడిఁ' అనేశబ్దము 1898 వ సంవత్సరమువరకు అసాధువు అనివారి సిద్ధాంతమైనా, శ్రీనాథుని శృంగార నైషధము 1913వ సంవత్సరములోవారు చదువుకొన్నప్పుడు, ఆసిద్ధాంతము మార్చుకోవలసివచ్చినదికదా (చూ. ఈ వ్యాసము పేరాలు 16-18) మేము ఉదాహరించిన మహాకవి ప్రయోగములచేత ఆసిద్ధాంతము పూర్తిగా రద్దయినదని ఒప్పుకోకతప్పదు. (చూ. పేరా 21)

71. వేంకటరత్నము పంతులవారు వాడిన 'ఇచ్చిపుచ్చినది' వంటిదే 'అడిగి పుత్తేడు' అనేప్రయోగము ఒకటి శ్రీనాథుని శృంగార నైషధములో ఉన్నది.

"తే. తెలవయిన్నాళ్ల నడిగిపుత్తేఁడు నిన్ను" (చూ. ఆ. 3. 123) శాస్త్రిలవారు ఈ రూపము తప్పనుకొని, 'అడుగఁబుత్తేఁడు' అని తాము ఆ గ్రంథము తిరిగి ముద్రించి ప్రకటించినప్పుడు దిద్దినారు. తమ పరిష్కరణ వైదగ్ధ్యము వెల్లడిచేయుటకు గ్రంథమునకు అనుబంధముగా "పూర్వము ముద్రణ దోషములకు ఇందలి సవరణలు" ప్రకటించినారు. అందులో 'అడిగి పుత్తేఁడు' అనే పాఠము పూర్వము ముద్రణము లందున్నదని స్పష్టముగా ఉదాహరించినారు. అయితే 'అడుఁగబుత్తేఁడు' అనే పాఠము ఎక్కడనుంచి శాస్త్రిలవారు తెచ్చి దూర్చినారో తెలియదు. గ్రంథావతారిక (పుట 17)లో రెండు వ్రాఁత ప్రతులు తనకు ఎరవు దొరికినవనిన్ని, అందొకటి "శ్రీ శ్రీ పిఠాపురము రాజాగారు"న్ను రెండవది నెల్లూరిజిల్లాలో శ్రీ వరగలి రంగారెడ్డి గారియొద్దనుండి శ్రీ కోవూరి సుబ్బరామయ్యగారున్ను ఇచ్చినారనిన్ని వ్రాసి ఉన్నది. ఇప్పుడు ఆ వ్రాఁత ప్రతులు ఎక్కడ ఉన్నవో మేము ఎరుగము. చెన్నపట్నములో ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు సంగ్రహించిన వ్రాత పుస్తకములలో దీనికి రెండు వ్రాతప్రతు లున్నవి, వాటి నెంబర్లు 99, 887. వీటిలో నున్న పాఠము తే 16—8—20 దీని పరిషత్తువారి పుస్తకాలయములో బ్ర శ్రీ. పురాణపండా మల్లయ శాస్త్రిలవారి యెదుటను మేము స్వయముగా చూచినాము. పూర్వ ముద్రణములందు ఉన్నట్లే 'అడిగిపుత్తేఁడు' అని ఉన్నది. గవర్నమెంటువారి పుస్తకాలయమందున్న రెండు వ్రాతప్రతులలోకూడా ఇట్లే పాఠమున్నది. వాటి నెంబర్లు 11—13—32, 10-21-19, మావద్దనున్న రెండు తాటాకు పుస్తకములలోనున్ను ఈ పాఠమే కనబడ్డది. ఇట్లు ఆరు వ్రాతప్రతులలోను పూర్వముద్రణములలో నున్ను మాకు కనబడ్డ పాఠమునుబట్టి శ్రీనాథుడు 'అడిగిపుత్తేఁడు' అని వ్రాసి ఉంటాడుగాని, శాస్త్రిలవారు దిద్దినట్లు 'అడుగఁ బుత్తేఁడు' అని వ్రాసి ఉండడు, అని మేము ఊహించినాము. నన్నయాది పూర్వకవుల ప్రయోగములుకూడా మా ఊహను బలపర్చినవి. ప్రాచీనాంధ్రభాషా స్వరూపము తెలిసినవారు ప్రాచీన గ్రంథములో ఇట్టి మార్పులు చేయరు.

72. నైషధములో శ్రీనాథుడు వాడినట్టు పూర్వముద్రణములందు కంటికి కనబడినా, శాస్త్రిలవారికి అడిగిపుత్తేడు' తప్పుగా తోచుటకు కారణమేమిటి? ప్రాచీనాంధ్రములో ఇట్టి రూపము లున్నవని తెలియక పోవటమే. నేటి తెలుగులో ఇటువంటివి లేవు శ్రీనాథుని పద్యమునందు తాము చేసిన సవరణనుపట్టి తమ టీకలో "తెలవ=ఓయంతీ, (ఇంద్రుఁడు),ఇన్నాళ్ళున్ = ఇంతకాలంబును, నిన్నున్ అడుగన్ పుత్తేఁడు = తన్ను వరింపుమని నిన్ను దూత ముఖమునప్రార్థింపకయుండెను" అని వ్రాసినారు. 'అడిగి' అనేక్త్వార్థక

రూపము ఇట్టిచోట్ల పొసగదనిన్ని 'అడుగన్'( = అడుగుటకు) అనేతుమున్నా ద్యర్థకరూపము నేటి తెలుగులో ఉన్నట్లు వాదుటయుక్తమనిన్ని వారు ఊహించి యుందురు. 61వ పేరాలో మేముచెప్పినట్టి పస్తుమానాంధ్రభాషావాసన శాస్త్రిల వారి ఒంటికి దట్టముగా పట్టి ఉన్నందున, నేటి వాడుకకు విరుద్ధముగా ఉన్న రూపము ప్రాచీన భాషలోసాధువైనప్పటికిన్ని, ఆభాష బాగా తెలియనందున, వారికితప్పుగా తోచినది !* అయినా, వాదానికిమాత్రము చిన్నప్పటినుంచిన్ని ఒంటపట్టిన భాష నింద్య మనిన్ని, బాగా అలవడని ప్రాచీనభాష సాధువనిన్ని అంటారు. ఏమి చెప్పను; ఇప్పటి వ్యవహారమునకు విరుద్ధముగా మాట్లాడనూ కూడదు వ్రాయనూ కూడదూ, అలాగున వ్రాసినా, మాట్లాడినా, వ్యవహారహాని కలుగడమేకాక, చదువుటకున్ను వినుటకున్ను అసహ్యముగా ఉంటుంది. ఈలాగున శాస్త్రిలవారు సిద్ధాంతము చేస్తే మాకు సమ్మతమే; గాని, ఆపులము వారు స్వీకరించక దానికి విరుద్ధముగా వాదిస్తున్నారు గనుక, వారికి ఆదర్శమైన గ్రాంథిక భాషలో 'ఇచ్చిపుచ్చి' 'అడిగిపుత్తేఁడు' మొదలయిన రూపములు అసాధువులు కావు, సాధువులే, అని సిద్ధాంతము చేయుటకు నన్నయాది మహాకవుల ప్రయోగములు ప్రమాణముగా ఉదాహరిస్తున్నాము, చిత్తగించండి.

నన్నయ వాడుక —

(1) అష్టమ వసువు భార్య పతికిట్లనియె: మర్త్యలోకంబున నుశీనర నరపతి కూఁతురు జితవతి యను కోమలి నా ప్రియసఖి యేనెప్పుడు దానికిఁ బ్రియంబు గోరు చుండుదు, నిమ్మొదవు నమ్మదిత కిచ్చి పుత్తము (ఆది 4 158) (ఈఆవును ఆమెకు ఇచ్చి (సేవకునిచేత) పంపింతాము అని ఇప్పటి వాడుక.)

---

* ఈలాగుననే ప్రాచీనాంధ్రము బాగా తెలియనివారు, 'నీవు దెలిసితేని నిక్కము సెప్పు' అంటే, తప్పనుకొంటారు. వారి చెవులకు 'నీకు తెలిసితే' అనేది సాధువుగా వినబడుతుంది. ఇట్లే 'నన్నునగెను', 'తలుపు దివ్వుమనినఁ దివ్వండు', 'వాఁడు నన్నలిగెను', 'నేను నోసితిని', 'నన్నట్లునాకుము' మొదలయినవి నేటివారికి వింతగాను తప్పులుగాను తోచుట సాజమే. నేటి తెలుగులో 'వాడు వచ్చి నాలుగు దినములయినది', 'ఈ బియ్యము మంచివి', 'ఆ ధాన్యము మంచివికావు', 'నే నయినా వాడయినా వస్తాము' అనే వాక్యములలో అన్వయము ఎట్లున్నదో చూడండి. ప్రతిభాషలోను ఇట్టి పలుకుబడులున్నవి; లక్షణమునకు లొంగక పోయినా ఇట్టివి తప్పులనరాదు. ప్రాచీనాంగ్లేయభాష బాగా రాక 18-వ శతాబ్దములోని ఇంగ్లీషుపండితులు ప్రాచీనాంగ్లేయ గ్రంథములు దిద్ది పాడుచేసినట్టే మన ప్రాచీనాంధ్ర గ్రంథములు ఆంధ్రపండితులు తారుమారు చేస్తున్నారు. నాడెమైన ఆంధ్రభాషా పాండిత్యము నేడు దేశములో అరుదు.

(2) భీష్ముండు బ్రాహ్మణుల యనుమతంబున దాని (అంబను) సాల్వరాజున కిచ్చిపుచ్చి . (ఆది. 4 212)

(3) (పాండు విభుఁడు) వస్తువు లెల్లను ధృతరాష్ట్రున కిచ్చి పుచ్చి (ఆది 5. 67)

పాండురాజు వనమందుండెను. ధృతరాష్ట్రుడు హస్తినాపురమం దుండెను గనుక అతని కిమ్మని (ఇచ్చుటకు) (ఇతరులచేత పంపినాడని ఇప్పటి తెలుగులో అర్థము.)

(4) (విదురుండు) "దుర్యోధను చేసెడు దుష్క్రియ లిమ్ముగా నెఱింగి వానికిం బ్రతీకారంబు సెప్పి పుత్తెంచెద" ననియె (ఆది. 6. 147)

(5) వారణావతమ్మునవారు కుంతీ పాండవుల పంచత్వంబు ధృతరాష్ట్రునకుం జెప్పి పుచ్చిన (,, 167)

(6) ఆ ఒలసి యెంత కాలముండిన నేను మీదానఁగాన యొరుల దనమ నన్ను నెన్నఁడయిన నొరుల కిచ్చుచో నసురకు భోజనముగ నిచ్చిపుచ్చుఁడిపుడ (,, 257)

(7) పాండవ ద్రుపద ధృష్టద్యుమ్న కుంతీ ద్రౌపదులకు నుచిత భూషణావళులు వేఱు వేఱ యిచ్చిపుచ్చి (8. 37) (పాండవాదులు ద్రుపదుని పురమందున్నారు.)

(8) (నకులుఁడు) వాసుదేవునకు నిజాగమనం బెఱింగించి పుచ్చి (సభా. 1 264.)

(9) ఆ. దాని నెఱిఁగి ధర్మతనయుండు ధృతరాష్ట్రి తనయునకు సమీరతనయుచేత దివ్యవస్త్రములును దివ్యభూషణములు నిచ్చిపుచ్చెఁ బ్రీతి మేర్పడంగ (" 2. 87.)

తిక్కనవాడుక:—

(10) (ద్రుపదుండు) 'పిలువందగిన రాజులం బిలిచిపుచ్చ పలయు' (అనగా 'పిలుమటకు దూతలను పంపవలెను' అని అర్థము.) ఉద్యో. 1. 37.

(11) భూపతులకును ...నెఱింగించి పుచ్చుట కార్యంబు . .(ఉద్యో 1. 37.)

(12) (సంజయుండు) నారాయణునకుందనరాక యెఱింగించిపుచ్చి (" 1. 272)

(13) అంతఃపురంబున నున్న ధృతరాష్ట్రునకుం దనరాక యెఱింగించి పుచ్చి (" 2. 2.)

(14) సంజయుండు వచ్చి వాకిటనిలిచి పడిహారులవలనఁ దన్నెఱింగించిపుచ్చి (ఉద్యో 2. 115)

(15) ఉ. అంతలు సేసి పోనడిచి యక్కట సంజయుచేతఁ జెప్పి పుత్తెంతురె (3. 101)

(16) అచ్యుతుండు కరినగరంబున కరిగి మొగసాల నిలిచి యాంబికేయునకుఁ దనరాక యెఱింగించిపుచ్చి (శల్య 2 360)

(17) "అని నీకొడుకునకుం జెప్పిపుత్తెంచితి" (అని భీముడు గాంధారితో ననియె (స్త్రీ 1. 160)

(18) ఉ ఇత్తల కేగుదేవల వదేత్తెఱఁ బొమ్మని చెప్పిపుచ్చినన్ .. (నిర్వ 6. 147)

(ఎఱ్ఱన వాడుక: భారతకవులు మువ్వురున్ను వాడినారన్నమాటగాను

(19) గంధర్వ లాక్షణంబ చిత్రసేనునకు నంతయుఁ జెప్పి పుచ్చిన (అర 5. 388)

(20) (అయ్యాదవేశ్వరుండు) . యుగ్రసేన కళత్రంబులకు . భూషాంబరాదు లిచ్చి పుచ్చి (హరి ఉ 4 253)

కేతన వాడుక (దశకుమార చరిత్ర విజ్ఞానేశ్వరము)

(21) తదీయవాస గృహద్వారంబున నిలిచి యెఱింగింగి పుచ్చిన వాఁడును సంభ్రమంబున నెదురు వచ్చి (3 87)

(22) ఉ. ఇత్తెఱఁ గంతయుం బతికి నేర్పడ నప్పుడె చెప్పి పుచ్చె భూపోత్తముఁడున్ రయంబున నేఁగుదెంచి (4. 34)

(23) సింహ వర్మయు సహ్యాన్మహీపతుల కెఱింగించి పంచిన(4.83)

(24) సీ. గీ. పేరుఁ బెంపును గలవాఁడు ప్రియముతోడ, నడిగి పుత్తెంచెనేని నెయ్యంబెఱింగి, రేపు మాపని యాసలు చూపి చూపి, యింపు పుట్టించి తుదిఁ బిలిపింపవలయు (4. 14)

(25) గీ. లక్ష్మి కూరిమి సుతురాజ్య లక్ష్మివోని కామ మంజరి యను వార కాంతగలదు దానిచేత మీ యర్థ సౌందర్య తారతమ్య మేర్పడు మీరలు దాని కిపుడు.

వ. రో యిచ్చి పుచ్చుండు . ... (5. 49)

(26) అదియును నప్పలుకులకు మోసపోయి చర్మ ఛత్రిక వలనం ధన దానంబులు సేయువిధం బడిగి పుత్తెంచిన, లోకంబెఱుఁగను దారకుండు విన్న వించిన తెఱంగెఱుంగుదురు కదా (6. 49)

(27) గీ. వచ్చి కోటచుట్టుముట్టు వారంగఁ, బన్నిబిడ్డ నడిగి పనుచుటయును నియ్య కొనక వెడలి యేపునఁ దలపడి, యతఁడు పట్టు వడియె నతనిచేత (6. 187)

(28) పుష్కరికచేతఁ గల్పసుందరి నాకెఱింగించి పుత్తెంచిన (8 131)

(29) పదంపడి కనక రేఖచేత నతనికి నాక్రమంబును జెప్పి పుచ్చి (11.72)

(30) సింహ వర్మ నమాత్యుండు చనుదెంచి వినయంబునం బ్రణమిల్లి జలకంబు పెట్టియున్నది వేంచేయుండని దేవర వరవుఁడు విన్నవించి పుత్తెంచె ననవుడు (12. 4౦)

(31) రాజవాహనుడు ..నదీతీరంబున సైన్యంబులు విడియించి యమ్మ సింద్రునకుం దనరాక యెఱింగించిపుచ్చి . (2 82)

(32) క. నెయ్యమున నడిగి పుచ్చక, యియ్యకొనక యర్థ మీక యీర్ష్యా పరుఁడై కయ్యమున గెలిచి కన్యకఁ గ్రయ్యంబడి చేసికొనిన రాక్షస మయ్యెన్ (విజ్ఞా. ఆచా. 100)

నన్నె చోడని వాఁడుక —

(33) నిజాగమని ప్రయోజనంబు కశ్యపునకు నెఱింగించిపుచ్చి( ...112)

నాచన సోముని వాడుక:—

(34) (హంసడిభకులు పంచిన దూత) ద్వారకా నగర ప్రవేశంబు చేసి, యదువల్లభు నగరివాకిట హయావ తరణంబుచేసి, తనరాక యెఱింగించి పుచ్చి యద్దేవ దేవుని యనుమతంబున సభా మండపంబునకుంజని (4. 139)

(35) సాత్యకి సాళ్వపురము చొచ్చి వారికిఁ దన్ను శౌరి పుత్తెంచుటయుఁ జెప్పి పుచ్చెను. (4.172)

మంచేశ వాడుక :—

(36) క. ఏనుజెప్పి పుచ్చిన యపుడె వ్వరుగాని పిలువఁగావత్తురె ... (కేయూ 2.51)

(37) సీ దేవికున్నత ప్రమదముగాఁ జెప్పిపుచ్చి ("2. 77)

(38) వ క్రమ్మరఁ గళావతిచేతఁ జెప్పిపుచ్చి (4. 182)

(39) వ భాగురాయణుండు కలిపి పుత్తేర (4 120)

ఇంకా అనేక మహాకవులు ఈ విధమున వాడి ఉన్నారు.

73 ఈ ప్రయోగములున్ను ఇట్టివి ఇంకా అనేకములున్ను చూచి ప్రాచీనాంధ్రమందు "ఇచ్చి పుచ్చు" "అడిగిపుత్తెంచు" మొదలయిన రూపములు వాడుకలో ఉండెనని మేము నమ్ముతున్నాము. మననాటి తెలుగులో లేకపోవుటచేత, మనచెవులకు ఈ శబ్దములు తప్పులుగా తోచుట వింత కాదు అయితే, తెలుగు పండితులు తెలుగు గ్రంథములు లెస్సగా చదివినవారే, గనుక, వారికివి వింతగా ఉండవు; ఉండకూడదు. ఎవరిచెవులకు ఇవి వింతగా ఉండి తప్పులుగా తోచునో వారికి తెలుగు గ్రంథములతో పరిచయము లేనట్టే తలంచవలెను, అట్టివారు తెలుగు పండితులు కానేరారు. గ్రాంథికాంధ్రమందు నిజమయిన అనురాగమున్ను, అభిమానమున్ను, ఉన్న పండితులు ముందు వెనుకలు ఆలోచించకుండా, తప్పొప్పులు తెలుసుకోకుండా, తమకు తెలియనివన్నీ తప్పులనిన్నీ, తమకు తెలిసినవే ఒప్పులనిన్నీ, నమ్ముకొని ప్రాచీన గ్రంథాలు దిద్దరు. తెలుగు సారస్వతము దిక్కుమాలిన దయినది. భాషా సంప్రదాయము తెలియని పండితమ్మన్యుల చేతులలో పడి భారతాది గ్రంథములన్నీ చెడిపోయినవి. నేటి వాడుకకు ప్రాచీన గ్రంథములలోని ప్రయోగములు ప్రమాణముగా విధించుటచేత, పరిష్కర్తలు కొందరు ఉద్దేశపూర్వకముగా గ్రంథములు దిద్దుతున్నారు. తాము అసాధువనుకొన్న శబ్దములు తీసివేసి, తాము సాధు వనుకొన్నవి గ్రంథములో దూర్చి సవరణలు చేయడము తమ వాదమునకు ప్రమాణము కుదుర్చుకొనుటకే. ఇప్పటి తెలుగువారి వాడుకకు ఇప్పటి పెద్దల వాడుక ప్రమాణముగా, ఇతర దేశములలో ఉన్నట్టు, అంగీకరించక, ప్రాచీనుల వాడుక ప్రమాణముగా పండితులు పెట్టుకొని, ఎవరి యిష్టము వచ్చినట్టు వారు ప్రాచీనుల గ్రంథాలలోని భాష తారుమారు చేస్తున్నారు. పండితులన్న వారందరి మతమున్ను ఒకటి కాదు. వెంకటరత్నము పంతులవారికి సాధువయినవి వేంకటరాయ శాస్త్రులవారికి సాధువులు కావుగదా; వీరిద్దరికీ ప్రమాణము ప్రాచీనుల భాషే. ఎవరికి అవకాశము దొరికితే వారు

ప్రాచీనుల భాష స్వమతానురోధముగా మార్చుటకు వెనుకతీయరు. శాస్త్రిల వారు నైషధము పరిష్కరించక మునుపు భారతము బాగా చదువుకొని ఉంటే నిర్దుష్టమయిన శబ్దము దుష్టమని భ్రమపడిదిద్ది గ్రంథము పాడుచేయకపోదురు.* నైషధము రచించిన శ్రీనాథుడు కాశీఖండమున్ను హరవిలాసమున్ను రచించి నాడుగదా, ఆ గ్రంథములయినా శాస్త్రిలవారు చదువుకొని ఉంటే వాటిలో ఇట్టి శబ్దములు కనబడును.

సీ. పా. ఉఱక దివోదాసు నుచ్చాటనముచేసి
యా మేలువార్త మంథాద్రి నున్న

హరునకుఁ జెప్పి పంపిరి హరుఁడును వచ్చెఁ
గాశికానగరికిఁ గరము వేడ్క. (కాశీ, 6. 139)

హరివిలాసములో IV 63వ పద్యమందు 'అడిగి పుత్తెంచినాఁడు' అని ఉంటే, శాస్త్రిలవారి వంటి పండితు లెవరో పూర్వకాలమందు పలుకుబడి తెలియని వారు 'అడుగఁబుత్తెంచినారు' అని దిద్ది వేసినారు. శృంగార శాకుంతలములో కూడా 4 వ ఆశ్వాసమందు, గీ. "పిలువ బుత్తేక తడసె" అనే పాఠము ఇట్టి పండిత పరిష్కరణముచేత సంప్రాప్త మయినది. చెన్నపట్న మందున్న ప్రతి కాగితములపై కొత్తగా వ్రాసినది తాటాకులమీద పూర్వులు వ్రాసిన గ్రంథములు ఎట్లుండునో చూడవలెను. నన్నయ అరణ్యపర్వము ద్వితీయాశ్వాసములో "దమయంతి నీకుశలం బడుగఁబుత్తెంచె" అని అచ్చు పుస్తకము లన్నిటిలోను ఉన్నది, ఒక తాటాకు పుస్తకములో "అడిగిపుత్తెంచె" అనిన్ని మరిఒక దానిలో "అడిగి రమ్మని పుత్తెంచె" అనిన్ని ఉన్నది. ఎఱ్ఱన హరివంశము మూడో ఆశ్వాసమందు "అతనికి రుక్మిణి నడిగి పుత్తెంచిన" (చూ. 11) అనిన్ని, గీ. రుక్మవతి యనంగ రుచిరాంగి రుక్మికి బౌత్రియైన కన్యఁ బంకజాక్షు నాజ్ఞ నడిగిపుచ్చె (చూ. 221) అనిన్ని రెండు వ్రాత ప్రతులలో ఉన్నది; గాని, అచ్చులో "అడుగఁబుత్తెంచిన" "అడుగఁబుచ్చె" అని సవరణ అయినది. ఈలాటివి అట్టే చూపించి చదివేవారిని విసిగించ కూడదని మానివేసినాము. ఆంధ్రభాషలో కొన్ని శబ్దములు రూపమందు, అర్థ మందు, సంబంధమందు పూర్వకాలములో ఉన్నట్టు ఇప్పుడు లేవు; మారి పోయినవి. వాటి వడికట్లు వేంకటరాయ శాస్త్రిలవారివంటి పండితులకు బాగా తెలియక ఇట్లు భ్రమ ప్రమాదములకు లోనవుతున్నారు. శాస్త్రిలవారి కథా సరిత్సాగరముచూస్తే వీరికి గ్రాంథికాంధ్రభాషాలక్షణము బాగా బోధపడినట్టు

---

* ఏమో చెప్పలేము. బహుశః భారతముకూడా దిద్ది పరిష్కరింతు రని చెప్పవచ్చును.

కనబడదు. వాటిని గురించి ఈ వ్యాసము మూడో భాగములో విపరించి వ్రాస్తాము. గాని ఇప్పుడు వీరి సాహిత్య మెట్టిదో తెలియజేయుటకు శృంగార నైషధములో వీరుచేసిన సవరణలలో నొకదాని ఘోంకము చదువరులకు చపి చూపి, 'ఇచ్చి పుచ్చు' విమర్శము చాలిస్తాము.

74. శృంగారనైషధములోని కడపటి పద్యము ముద్దులు మూటకట్టి నట్టున్నది. అందులో శ్రీనాథుడు చంద్రుని ఇట్లు వర్ణించినాడు.

సీ. ముక్కంటి తలపువ్వు, మున్నీటిలేఁబట్టి,
కైటభారాతి డాకన్నుఁదమ్మి,
గగనలక్ష్మికి దంతకాండ తాటంకంబు,
కలువల విందు, జక్కవల గొంగ,
ఎలరాజు వెల్లెల్లి పసజభాండవునుద్ది,
శిశిరాంశు రత్నంబు, చేదుమందు
గన్నులపండువు, గ్రహసార్వభౌముండు,
సురలయాఁకటి పంట యిరులదాయ,

తే. శ్రీమహాలక్ష్మి సైదోడ శేషభువన
సౌధకల ధౌతకలశంబు చందమామ,
రాజవదన కల్యాణ పరంపరాభి
వృద్ధిగావించుఁగాత యీవిశ్వమునకు.

75 ఈ పారము ఆరు తాటాకు పుస్తకములలో ఉన్నది: (చూ పేరా, 71) మా కండ్లతోమేము చూచినాము. వేంకటరాయ శాస్త్రిలవారు చూచిన వ్రాతప్రతులలో ఎట్లున్నదో మే మెట్లు చెప్పగలము? వారేకన్నుల తో జూచినారో ఎవరెరుగుదురు? వారిచ్చిన పారములో మూడవపాద మందు "వలరాజు వెల్లెల్లి"కి బదులుగా "వలరాజు వెల్లల్లి" అనిన్ని, నాలు గోచరణమందు "యిరుల దాయ"కు బదులు "యిరులు దాయ" అనిన్ని, కడపటి చరణమందు "గాత యీ విశ్వమునకు" బదులుగా "గాతమీ విశ్వము నకు" అనిన్ని ఉన్నది. ఈమూటిలో మొదటిదాని సారస్యము విచారించ దగినది. రెండవ దానిని గురించి, సీతారామాచార్యులవారు 'ఇరులు' శబ్ద మేక వచనమన్నారని సమాధానము చెప్పినారు. అయితేనేమి 'పాలు' వంటిదే. మూడవదానిలో మకారము చిన్నయసూరిగారి 'అనుశాసనము' చొప్పున దూర్చి నది. వీటికేమిగాని, "వలరాజు వెల్లల్లి" అనే పారమూ, లేక వలరాజు

"వెల్లెల్లి" అనేపాఠమా నాధువు? ఏది శ్రీనాథుని వంటి మహాకవి వ్రాసి ఉంటాడో సాహిత్యము గలవారు విచారింతురుగాక. మనశాస్త్రిలవారు తమవ్యాఖ్యలో "వలరాజు వెల్లల్లి" అంటే, వలరాజుచేతి తెల్లగలువ ('నెచ్చెలి' యని పూర్వముద్రణ పాఠము, 'వెల్లల్లి' వ్రాతలలోనిపా.)" అని వ్రాసినారు, గాని, చంద్రుడు, మన్మథుని చేతిలోనిది గానీ, చెవియందలిది గానీ, తెల్లగలువ వంటివాడు అని, సంస్కృతమందయినా తెలుగులోనయినా, పూర్వులయినా, ఆధునికులయినా, వర్ణించిఉన్నారా? లేదనిచెప్పటకు మావంటివారికి అధికారము లేదు. మేము వట్టి లౌకికులము, మాకున్న కొంచెము సాహిత్యము అర్థగ్రహణమందు కొంత ఉపచరిస్తుందేమో గాని, సమయసిద్ధమైన పారస్యనిర్ణయమునకు చాలినది కాదు మేమెరిగినంతమట్టుకు కవులు చంద్రుణ్ని మన్మథుని "వెల్లెల్లి" అనగా "తెల్లని గొడుగు"తో పోల్చియున్నారు, చూడండి.—

1. మనోజరాజస్యసితాతపత్రం శ్రీఖండచిత్రం హరి దంగనాయాః.

2 గగనవిపినసింహః కామభూపాతపత్రం నిఖిలదిగబలానాం కందుకంక్రీడనాయా .

3. మృగాంకోఽయం ధత్తె గగన జలతః ఫేనతులానాం సితచ్ఛత్రాకారం మదన నృపతేర్విశ్వజయినః

4. యః శ్రీఖండ తమాల పత్త్రితి దిశః ప్రాచ్యాః స్మరక్ష్మాపతేః పాణ్డుచ్ఛత్రతి

౬. కించత్రం స్మరభూపతేః కిముయశః పుంజం పురస్తాదిదం.

6. త్రిభువన జయినో మన్మథస్యాత పత్త్రిం.

76. ఇట్టిప్రయోగము లున్నవి గనుకను, వ్రాతప్రతులలో — మేము చూచిన ఆరింటిలో— "వలరాజు వెల్లెల్లి" అనే పాఠమున్నది గనుకను, "ఆకాశవాపీసిత పుండరీకమ్" "వ్యోమసరః సరోజమ్" మొదలయిన వాటిని పట్టి చంద్రుణ్ణి పద్మముతో పోల్చినా, కలువ పువ్వుతో కవులు పోల్చినట్లు మేము చదువుకొన్న గ్రంథాలలో కనబడలేదు గనుకను, శాస్త్రిలవారి సవరణ సరియయినది కాదని నమ్ముతున్నాము. శృంగార నైషధములో వారు చేసిన సవరణలు చాలామట్టుకు వ్రాత ప్రతులలోని పాఠములకు, అనగా మంచిపాఠములకు విరుద్ధముగా ఉన్నవి, వాటిగురించి పెద్ద వ్యాసము వేరే ఒకటి వ్రాయవలెను. జయదేవ కవివ్రాసిన సంస్కృత నాటకము తిన్నగా తెనిగించక వేంకటరత్నము పంతులవారు జయదేవునికి అపకీర్తి తెచ్చినారని శాస్త్రిలవారు మోటతిట్లు ఎన్నోతిట్టి "హా! జయదేవా!" అని మాటిమాటికి హాహా కారము

చేసినారే, శ్రీనాథుని తెలుగు గ్రంథము ఉన్నది ఉన్నట్లుగా ఉండనీక కూడని మార్పులు చేసి పాడుచేసినందుకు శాస్త్రులవారిని ఏమనవలెనో మాకు తెలియదు అయ్యో శ్రీనాథా! ఓ కవిసార్వభౌమా! నీయందు భక్తితాత్పర్యములు గలవారమని చెప్పుకొన్నవారు, ఆంధ్ర పండిత భిషక్ పణులు, వేదము వేంకటరాయ శాస్త్రులవారుకూడా, పూర్వపరిష్కర్తల వలెనె ప్రభు ప్రమాద దురహంకారమునకు లోనై తబ్బిబ్బులైపడి నీ గ్రంథము పాడుచేసినారు! ఒక్కని ప్రాచీనప్రతులు సంపాదించి నీ గ్రంథములు అన్నిటిలో చదివి నీ భాష కట్టుబాట్లు లెస్సగా తెలుసుకొని, పాఠములు పరిష్కరించి అచ్చొత్తించి తెలుగు సారస్వతమును ఉద్ధరించే పుణ్యాత్ములు భాషాభిమానులు ఎప్పుడు పుట్టుదురో!

## ద్రుతమునకు అచ్చుతో "సంశ్లేషము"

77. వేదము వెంకటరాయశాస్త్రులవారి దృష్టికి ఇది ఒక మహాపాతకముగా తోచినది. వేంకటరత్నము పంతులవారు తమ మహాపాతకములు ఆంధ్ర ప్రసన్న రాఘవమునందు ముమ్మారు చేసినారట. 6 వ పుటలో "విజృంభణన్ననువు" అనిన్ని, 23 వ పుటలో 'అంగములన్నియున్' అనిన్ని, 53 వ పుటలో 'వాదునన్నా' అనిన్ని. తమ విమర్శము 6వ పుటలో ఇది మహాపాతకము అని నిషేధించుటకు గల కారణము శాస్త్రులవారు వివరించినారు చూడుడు :—

"'ఋక్సంశ్లేషొనాచి' యను నన్నయ భట్టీయ సూత్రముచే నిది గ్రామ్యము. పంతులవారు ఈ సూత్ర సిద్ధమైన ఋక్సంశ్లేషములో సంశ్లేషమును తాము యథేష్టముగా చేసి చిత్రకార్థము ఆ సూత్రము నన్నయభట్టుగారిది గాదని తొలుత వాదించి, ఆ సూత్రముగల శ్లోకమే లయినది గాదని ద్వితీయ వాదము వాదించి, నన్నయ భట్టీయమే నన్నయభట్టుది గాదని తృతీయ వాదము వాదించి, ఋక్కుచేసిన వారి యక్కసు ఆ సూత్రమునే ప్రమాణముగాఁ జూపి దూషించి, ఆత్మను ఘోషించుకొని యున్నారు"

శాస్త్రులవారి మతమందు 'విజృంభణన్ + అనువు' అని ఉన్నప్పుడు "విజృంభణన్ననువు" అని నాను నాముచిచ్చి ద్విత్వనకారము వ్రాయడమే గ్రామ్య సంశ్లేష దోషము గాబోలు. 'విజృంభణన్ అనువు' అని రెండవ శబ్దము మొదటను అచ్చుంచి వ్రాస్తే దోషముకాదు కాబోలు! దోషమైతే, తమ ప్రతాపరుద్రీయమందు ముమ్మాటికన్న ఎక్కువగా ఇట్లు ఎందుకు వారు వ్రాతురు?

(1) ఉదా. గరడీలేగడికోటతే... విరతిలేకే వంశపారంపరిన్ అరికంరాద్రి....(పుట. 25)

(2) ఉ లీలనేగుచున్ ఓడ (పు. 60)

(3) ఉ సిరిన్ ఆయగజాతకున్ (పు 97)

వీటిలో ఉన్నట్టే. 'విజృంభణ న్ననువు'లో కూడా పాదాంతమందే ద్రుత మున్నది ఎక్కడ నుంచేనేమి ?

వ్రాతలో ఒక్క సహాపొల్లు మాత్రమే ఉన్నా అవ్యవధానముగా అచ్చు చేర్చి నోటను పలికినప్పుడు 'న్న' పలికినట్టు చెవులకు వినబడక మానదు, వాస్తవముగా నోటపలికేది, చెవికి వినబడేది భాషగాని కంటికి కనబడే గీరలు కావు ఈ స్వరతత్త్వమును గురించి కొంచెము క్రిందను 80 వ పేరాలో వ్రాస్తు న్నాము

78. అయితే ఈ నన్నయ భట్టీయ సూత్రము అమోఘము కాదు, నన్నయాది మహాకవులు చాలామంది ఇందుకు విరుద్ధముగా సంశ్లేషము చేసి ఉన్నారు.ఈ నన్నయ భట్టీయమునకు టీక వ్రాసిన వారందరున్ను ఈసూత్రము నకు విరుద్ధముగా కొందరు లక్షణము చెప్పి ఉన్నారని ప్రమాణీకరించే ఉన్నారు. అరవై అయిదు సంవత్సరముల క్రిందట వర్తమాన తరంగిణీ ముద్రాక్షర శాలయందు మూడవ పర్యాయ మచ్చు వేయింపబడిన "సటీకాంధ్ర శబ్ద చింతా మణి యందు "కొందఱచ్చుపరంబగునపుడు ద్రుతంబునకు ద్విత్వ రూపంబగు సంశ్లేషంబు గలుగునని సేవింతు స్వచ్ఛ్యుదునని యుదాహరింతురు" అని ఉన్నది తాటాకు పుస్తకాలనేకాలు మేము మూచి ఉన్నాము. వాటిలోనున్ను ఇట్లేఉన్నది. ఇట్లు టీకలువ్రాసిన వారేకాక లక్షణ కర్తలు కూడా కొందరు ఈ మతము అంగీకరించినారు. ప్రసమాచార్యులవారు చేసిన అనుశాసనము పిమ్మట వారు మార్చినారు,

వెంకటరాయ శాస్త్రులవారివలెనే సంశ్లేష మనగా ద్విత్వరూపమను కొని ఈ వ్యాసమందట్లే వాసినాము.

ఐతే, "సంశ్లేషము" అనే పదను పారిభాషికము. దీనికి వ్యాకరణశాస్త్ర మందు ఏ అర్థమున్నదో మాకు స్పష్టముగా తెలియనందున బ్రహ్మశ్రీ వఝులచిన సీతారామస్వామి శాస్త్రులవారిని అడిగినాము. వా రిచ్చిన జవాబు ఏమంటే— "సంశ్లేషమున కాంధ్ర వ్యాకరణములో నెచ్చటను సరియగు పరిష్కారంకనం బడదు. ద్రుతమునకు హల్లు పరముగు నపుడె సామాన్యముగా సంశ్లేషము విధింపఁబడెను. సంశ్లేషమనఁగా సంయోగించుట, కలసికొనుట. ద్రుతము సహజముగా నడ్వ్యిష్టమై యుండును; గానఁ బరహల్లుతోఁ గలియనేరదు. కాఁగా సంశ్లేషవిధాన వైయర్థ్యాన్యథానుపపత్తిచే ద్రుతస్వరలోపము సిద్ధించును, అపుడు పరహల్లుతో దానికి సంశ్లేషము తటస్థించును. ఈ యభిప్రాయం తోడనే యహో

బలపతి "అలుకిచ సంశ్లేషస్స్యాత్" అను సూత్రవ్యాఖ్యానవసరమున "లుగభావేనస్య పరవర్ణేనసాకం సంశ్లేషశ్చభవేత్" అని వ్యాఖ్యానము చేసియున్నాడు. కాని యీ విషయము "లుక్సంశ్లేషౌనాచే" అనుదానికి విరోధించున ట్లగపడును. "వచ్చెను + అతడు" అనుచో ద్రుతమునకుఁ బరవర్ణముతో సంశ్లేము విరుద్ధము కానేరదుగదా. 'వచ్చెనతడు' అను రూపము సర్వసమ్మతముగదా. కాగా నిచట సంశ్లేషశబ్దమునకు హల్పరకస్థలములందు సంశ్లేషసంభావ్యతాయోగ్యమగుటం జేసి సంభవింపక తీరని ద్రుతస్వరలోపమేయని గ్రహింపక తీరదు. అట్లు గ్రహించినచో ద్రుతమున కచ్చు పర మగునపుడు ద్రుతస్వరలోపము రాదని తేలుచున్నది. అనఁగా 'వచ్చెన్ అతఁడు' అని యుండనేరదని తాత్పర్యము. పై కారణములచే సంశ్లేషమనగా "ద్రుతములుప్త స్వరమై పూర్వాచ్చునంటి యుండుట" అని అర్థము చేయుట లెస్సయని తోఁచుచున్నది. పై యభిప్రాయమే "నోవాద్విత్వంక్వచిచ్ఛ్లిష్టం" అను నధర్వణ కారికచే ధ్వనితమగుచున్నది. పైకారిక వల్ల నకార ద్విత్వము సంశ్లేష భిన్నమని స్పష్టపడుచున్నది

(1) ద్వితీయాచార్యుడైన, అధర్వణుని "నోవాద్విత్వంక్వనిచిచ్ఛ్లిష్టం" అనే కారికకు తృతీయాచార్యుడైన అహోబలుడు, 'ఏతదాచార్యస్యాపి సమ్మతం' 'ఎన్నడున్నేని మోఘము గాదు, 'ధైర్యశక్తి కిన్నరుదుగ' ఇత్యాది తత్ప్రయోగాత్' అని భాష్యమువ్రాసినాడు. గనుక వీరిద్దరికిన్ని ద్విత్వరూపము ఇష్టమే.

(2) తంజావూరి సరస్వతీ మహల్ పుస్తకాలయమందు "సకల లక్షణ సంగ్రహంబైన బాలబోధయను లక్షణము" అనే పేరుగల తాటాకుల పుస్తక మొకటి ఉన్నది. అందులో ప్రస్తుత విషయమును గురించి లక్షణమెట్లున్న దంటే.

క. చెన్నగు నొరపొల్లలకు న్నచ్చులతోడి సంధిగూర్పఁగ నొకటం
బన్నగ శయనుఁడు హరియించున్నఘములు భక్తులయినసుజనుల ననగన్.

ఇందుకు లక్ష్యములుగా ఆది పర్వము 7 141 పద్యమందున్న 'ఎన్నఁడు న్నేని' అరణ్యపర్వము 1. 321 వ పద్యమందున్న 'ధైర్యవృత్తి కిన్నరుదుగ' మొదలయినవి కొన్ని ఉదాహృతమయి ఉన్నవి. గుప్తార్థప్రకాశికలో కల్లూరి వేంకట్రామ శాస్త్రిలవారు' సర్వలక్షణ సారసంగ్రహమున' నున్నది అని

క. ఎన్నగనకార పొల్లులకున్నచ్చులు సంధిఁజేసి కూర్పగవచ్చున్
బన్నగ పతిశయ నుండోర్చున్నఘములఁ బాపభక్త సులభు డయినన్

ఉదాహరించినారు. ఈ గ్రంథము కూచి మంచి తిమ్మకవిదికాదు; తిమ్మకవి లక్షణములో ఈ పద్యము కనపడలేదు, చిత్రకవి పెద్దన్నదికాబోలు.

(3) రంగరాట్ ఛందస్సు (తాటాకులమీద వ్రాసిన ప్రతి) లో ఇట్టి సంధికి లక్షణ లక్ష్యము లున్నవి. (చూ. 43 b)

క. తెల్లమిగాను నకారము పొల్లులకున్ నచ్చుసంధి పొసగు గవులకున్
కొల్లలుగ రంగ ధరణీ వల్లభు డిచ్చున్ నపార వస్తువులనిన్.

అర్థం—నకార పొల్లుల వెనుక అచ్చులయిన అకార ఇకార ఉకారాదులకున్ను సంధి పొసంగును

ఇందుకు లక్ష్యములు నన్నయ ప్రయోగములేకాక పారిజాతాపహరణములోనిది (1.45) ఉదాహృతమయి ఉన్నవి.

(4) సీతారామాచార్యులవారు తమప్రౌఢ వ్యాకరణములో (చూ.సంధి 3) "కొన్ని యెడలఁ బ్రామాణిక ప్రయోగంబుల ద్రుతంబున కచ్చుపరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి" అనిలక్షణము చెప్పి, ఉత్తరహరివంశములోనిది ఒకటిన్ని, భాగవతము సప్తమస్కంధము లోనిది ఒకటిన్ని. కళాపూర్ణోదయములోనిది ఒకటిన్ని ప్రయోగము లుదాహరించినారు.

(5) గుప్తార్థప్రకాశికలో కల్లూరి వేంకటరామశాస్త్రిలవారు ద్విత్వవిధి అంగీకరించక ద్రుతముపైని ద్రుతము వచ్చినదని సమాధానము చెప్పి "ఎన్నడున్ + ను + ఏని = ఎన్నడున్నేని" అయినదని ఉన్న రూపము తప్పనక, సాధించినారు (చూ. పు. 39) వీరికిన్ని ఇది ఇష్టమే.

79. స్వరతత్త్వము, శబ్దములు వ్యుత్పత్తి తెలియక తెలుగు పండితులు "ఎన్నడున్నేని"లోని ద్విత్వనకారము సాధించుటకు చిక్కులు పడ్డారు. భారతము పరిష్కరించిన పండితులు ఎవరికి తోచినట్టువారు ఈ ప్రయోగముగల పద్యములు దిద్దివేసినారు. వావిళ్ళవారి ముద్రణమందున్ను ఆనంద ముద్రణమందున్ను "ఎన్నడున్నేని మోఘముగాదు దిగ్ధరణీ రవీందు లెఱుంగఁగాన్" (ఆది VII 141) అని ఉన్నది. 1833 వ సంవత్సరములో వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాలయందు అచ్చు పడ్డదానిలోను, 1893 వ సంవత్సరములో వాక్పతీ నిలయ ముద్రాక్షరశాలయందు అచ్చుబడ్డదానిలోని "ఎన్నడౌనేని." అని ఉన్నది. కొన్ని తాటాకు పుస్తకములలో "ఎన్నడున్నేని మోఘముగాదు దిగ్ధరణీందు భానులెఱుంగగాన్" అని ఉన్నది. ఏదో ఒక లక్షణము వేదవాక్యముగా నమ్మకొని, దానికి విరుద్ధముగా ఉన్న ప్రయోగము దిద్దడమునకు మనపండితులు వెనుక తీయరు తమ కిష్టముకాని సంధి తప్పు అని ఒకసిద్ధాంతము; తమ కిషము కాని యతి తప్పు అని ఒక సిద్ధాంతము,తి భార

కర్త నన్నయే ఆంధ్రశబ్ద చింతామణి వ్రాసినవాడని ఒక సిద్ధాంతము; గనుక తమకిష్టమయినదే నన్నయ వ్రాసినాడు అని రాద్ధాంతము *.

80. తత్త్వముచొప్పున 'ఉన్' అనేది సముచ్చయము. అరవములో, కన్నడములో 'ఉమ్' అని దీని రూపాంతరము ఉన్నది తెలుగు - వేదమున్ పురాణమున్, అర - వేదముమ్ పురాణముమ్. కన్న-వేదవుమ్ పురాణవుమ్' తె-'ఎప్పుడున్ - అర- 'ఎప్పోదుమ్' తె-'అమ్మయున్ అమ్మయున్ ।

* మరి ఒక విచిత్రము. 'ఏని' అనే రూపము అంగీకరించితే, సంధి దోషమో వడిదోషమో అంగీకరించవలసి వస్తుంది గదా ! ఏమిదారి' దేవుడా ? అని పండితులు తికమకలాడకుండా, మ. రామకృష్ణకవిగారు చిత్రంగా చిక్కు విప్పివేసినారు. వారు పరిష్కరించి ప్రకటించిన నన్నెచోడుని కుమార సంభవము పీఠికలో ఇట్లు వ్రాసినారు —"నన్నెచోడుఁడు, ఏనియనుశబ్దమును నేని యని నకారాదిగాఁ గూడఁ బ్రయోగించెను. కాబట్టియే నన్నయభట్టు—న్నేని దిగ్ధరణీ రవీందులు, అది-ఆ-ఉ అను నకారాదిగా బ్రయోగించె ఇది తెలియక దుస్సంధియు, యతికి వైకల్పిక భావమును నన్నయభట్టున కారోపించిరి" భేష్! పండితుల కెవరికిన్నీ తెలియని పరమ రహస్యము కవిగారు కనుక్కొన్నారు. 'ఏని' శబ్దమునకు 'నేని' అనే రూపాంతర మున్నదట ! గ్రాంథికాంధ్ర భాషారహస్యములు పండితులకే తెలియనప్పుడు పామరులు ఆ భాషజోలికి పోకూడదుగదా. ఏమంటే ఏమితప్పో ? మా మట్టుకు మాకు భయముగా ఉంటుంది అందుచేతనే తత్త్వజిజ్ఞాసకు మాత్రము దానినిస్మరిస్తూవాడుకభాషలో వ్యవహారము సాగిస్తున్నాము. సరేకాని. ద్రుతమునకు అచ్చుతో సంశ్లేషము దుస్సంధి అని నన్నెచోడని వాడుకనుబట్టి కవిగారు సిద్ధాంతము చేసినట్టా ? చూడండి,నన్నెచోడుడే ఏలాగున వ్రాసినాడో:—"పొన్నలుఁ గొండఁ గోఁగులునుబూరువులున్నాగిఁ—బూనకుండఁగా" (చూ. 447 ప 'బూరువులున్నాగి' అంటే 'బూరువులున్ + ఒగి' అనికాదా ? కాకుంటే 'నాగి' అనే రూపాంతర మున్నదంటారేమో కవిగారు ; శబ్దతత్త్వము చొప్పున అజాదిగా ఉండవలసిన శబ్దములు నకారాదిగా వ్యవహారములోనికి రావడము మారు వింతకాదు. 'నేను' 'ఏను' అనే సర్వనామములు అట్టివే. ఈలాటివి చాలా ఎరుగుదుము. ఇంగ్లీషులోని newt, nickname అనే శబ్దములు వాస్తవముగా అజాదులు. కొందరు బడిపిల్లలు "ఇది నుత్తమమైన పద్ధతి" అని వ్రాస్తున్నారు ; పండితులుకూడా అట్లు వాడితే 'నుత్తమము' రూపాంతరమై గ్రాంథికాంధ్రమున సాధువుకాదా ? గ్రాంథికాంధ్రములో పీరిణం, ఈరిణం; వతంస; అవతంస; మొదలయిన రూపాంతరములు ఎన్నో సంస్కృతమందే ఉన్నవే; ఇవి

అర అమ్మెమ్మయుమ్-అన్నెన్నయుమ్. 'అమ్మయును' అనేదానిని అమ్మ + యు + ను అని పండితులు విడదీసి, 'యు' 'ను' సముచ్చయములని చెప్పుతారు-గాని ఆ సిద్ధాంతము తత్త్వమునకు దూరము, ఇప్పటి తెలుగు పండితులలో వావిలి కొలను సుబ్బారావుపంతులుగారికి మాత్రము 'ఉన్' అనేరూపము కొంచెము పొడకట్టి నట్లున్నది; అరవముతో పరిచయము కలుగుటచేత కాబోలు. ఈ 'ఉన్' అనేది నొక్కి పలికినప్పుడు నకారము ఎక్కువకాలము పలుకకతప్పదు. ఇప్పటి తెలుగులోకూడా రెండున్ + అర = రెండున్నర, ఏడున్ + ఒకటి = ఏడు న్నొకటి అని వాడుతున్నాము నన్నయ కాలమందు 'రెండు వేలున్నే నూట పదునొకండు' 'మూఁడు వేలున్నే నూట యిరువది' రెండు వేలున్ని నమన్నూట మొదలయినవి వాడుకలో వుండేవి. శ్రీనాధుడు కాశీఖండములో 'ఇరువది యొక్క వేయున్నూఱు నూయువారంబులు' అని ప్రయోగించినాడు. 'ఒకటిన్నర' అన్నప్పుడుకూడా 'ఇన్' నొక్కిపలుకుతాము — ఒకటిన్. అరన్ నకారమే కాదు, ఏహల్లయినాసరే పదాంతమందు పొడిగించవచ్చును, ఉదా. జగత్ + ఉ జగత్తు 'సంస్కృతములో' 'ఎద్'ద అంటే తెలుగులో 'అది' అని అర్థము. "ఇంగ్లీషులో 'కమ్'మ అంటే, తెలుగులో 'రా' అని అర్థము. ఈవాక్యములలో కిందను గీతలు గల మాటలు 'రత్తంటే' 'కమ్మంటే' అని వ్రాస్తున్నాము. సంస్కృతములోకూడా 'తస్మిన్ + ఇదమ్' = తస్మిన్నిదమ్ ఇంగ్లీషులో in + er = inner, big + er = bigger. కన్నడములో కణ్, + ఉ = కణ్ణు, పాలీలో తమ్ + ఏవ = తమ్మేవ ఏకాక్షర శబ్దములలో హ్రస్వాచ్చు ఉన్నప్పుడు తెలుగులో ఇల్లు హల్లు పొడుగుగా పలుకకతప్పదు, దీర్ఘాచ్చు ఉన్నప్పుడున్ను ఎక్కువ అక్షరములున్నప్పుడున్ను, కొసయున్నవర్ణము ఏకారణముచేతనైనా నొక్కిపలికితేనే పొడుగవుతుంది, లేకుంటేకాదు. ఉదా:— ఇంగ్లీషులో 'టైమ్' మంటే' తెలుగులో 'కాలము', 'వన్'మంటే, అడవివనము, వనమ్ము— ఈ రెండు మాటలలో, మొదటి దానిలోని నకారముపై నున్న అకారము రెండవ

---

ఏలాగున సంప్రాప్తమయినవి? ప్రాచీనుల వాడుక ఏలాగున ఉన్నదో తెలుసు కోవలెనంటే; ప్రాచీన గ్రంథాలు సావకాశముగా పరీక్షించవలెను అది ఏలా గున ఉన్నా మన వాడుకకు సాధకమూకాదు, బాధకమూ కాదు. పూర్వుల వాడుకను బట్టి మన వాడుక దిద్దుకోలేము, మన వాడుకనుబట్టి పూర్వుల వాడుక దిద్దగూడదు. ఆకాలములో అది, ఈకాలములో ఇది, రెండూ సాధువులే. రూపములో మార్పు కలుగడము దోషమైతే, బ్రతికి ఉన్నవన్నీ మారుతూ ఉంటవి గనుక దుష్టమయినవి అని సిద్ధాంత మవుతుందే! భాషాతత్త్వజిజ్ఞాసు వులు భాషా ధర్మము భాషా ప్రయోజనము లెస్సగా ఎరిగినవారైతేనే కాని భాషాతత్త్వము పట్టుపడదు.

దానిలో నినకారముపైనున్న అకారమున్న ఎక్కువ పొడుగు. దానికి పరముగా ఉన్న మకారము రెండవ మాటలోని మకారముకన్న హ్రస్వముగా ఉంటుంది. ఇట్లే 'వాకు' లోని అకారముకన్న 'వాక్కు'లోని అకారము కొంత హ్రస్వము, ఎక్కువ పొడుగయిన అచ్చుకు పరముగా ఉన్న హల్లుకన్న పొడుగు తక్కువైన అచ్చుకు పరముగాఉన్న హల్లు ఎక్కువ పొడుగుగా ఉంటుంది. అచ్చులవలెనే హల్లులున్ను దీర్ఘముగా పలుకవచ్చును. హల్లుదీర్ఘమునకు వ్రాతలో ద్విత్వము గురుతు. ఇది ఎవరిమట్టుకు వారు పరిశీలించి తెలుసుకోవలసిన విషయము తగిన యంత్రము లుంటే ప్రత్యక్షమవుతుంది. ఈ స్వరతత్త్వమున్ను శబ్దతత్వమును తప్పయినా ఒప్పయినా. మన పండితులతో చేసే ప్రస్తుత వాదమునకు బాధకమూకాదు, సాధకమూకాదు. అది మా ప్రతిపక్షులకు మేము బోధపర్చలేము, వారు బోధపర్చుకోరు.

81 ప్రకృత మనుసరింతాము. ద్రుతముతో అచ్చుకు సంశ్లేషము కలుగుతుందా కలుగదా ? అనే విషయము గురించి ప్రస్తుత జిజ్ఞాస. వేంకటరత్నము పంతులవారు కలుగుతుంది అన్నారు. వేంకటరాయ శాస్త్రులవారు కలుగదు అన్నారు. కొందరు లాక్షణికులు అట్టి సంశ్లేషము సాధువన్నారు. కొందరు అసాధు వన్నారు. వీరి లక్షణము తప్పని వారివారున్ను, వారి లక్షణము తప్పని వీరివారున్ను తగువు లాడుతున్నారు. సాధువన్నవారు లక్ష్యముగా ఇచ్చిన ప్రయోగాలు అపపాఠాలు అని అసాధువన్నవారు నిరాకరించినారు. ఇప్పుడు మనము తత్త్వమెట్లు తెలుసుకోవడము ? అచ్చువేసే యంత్రములు మన దేశములో లేనప్పుడు పుట్టిన లక్షణ గ్రంథములందు ఏ పద్యములు లక్ష్యములుగా ఉదాహృతమయి ఉన్నవో ఆ పద్యములలోని పాఠములు అపపాఠములు అంటే, కావని ఏలాగున సాధించడము ? స్వమతాభిమానము చేతను అజ్ఞానముచేతను మునుపుకూడా పాఠాలు యథేష్టముగా దిద్ది మార్చి గ్రంథాలు తాటాకులమీద వ్రాసినారని తోచేటట్టు అప్పకవి చెప్పినాడు. అయితే మత భేదమున్నప్పుడు వ్రాత ప్రతులలో అభేదము కనబడవలెను. మనకు దొరికిన ప్రతులన్నిటిలోను పాఠము ఒక్కలాగున ఉన్నప్పుడు అవి అన్నీ ఒక్క దుష్టమూలమునుబట్టి వ్రాసిన వనవలెనా ? లేక, గ్రంథకర్తే అలాగున వ్రాసినా డనవలెనా ? ఇదమిద్ధమని సిద్ధాంతము చేయుట బహు దుష్కరము గదా. ఇట్టివాటిలో గ్రంథకర్తకు తప్ప మరి యెవరికిన్నీ సత్యము నిశ్చితము కాదు. గ్రంథకర్త స్వకృతమును గురించి చెప్పినమాట యందైనా మోసమున్నదని చెప్పి విశ్వాసార్హము కాదనుటకు ఇతరులకు అవకాశము లేకపోలేదు. గనుక, వాది ప్రతివాదులకు వాద విమర్శకులకు, తత్వ జిజ్ఞాసువులకు, అందరికీ ఒక్క

లాగున ప్రత్యక్షం కానివిషయములో సంభావ్యతాసంభావ్యతలు మాత్రమే విచారించతగినవి.

82 వర్తమాన వ్యవహారమునకు ప్రవర్తకముగా సద్యోనిర్ణయము చేయవలసినప్పుడు, అప్పటికి ఏది సంభావ్యమని ఊహించవచ్చునో దానిని బట్టి నిర్ణాయకులు నిర్ణయించక తప్పదు. అన్ని దేశములలోను న్యాయస్థానములందు లోక వ్యవహారముతో సంబంధించిన వివాదములన్నీ ఇట్లే నిర్ణయిస్తున్నారు. అయితే, ప్రాచీనకాలపు వ్యవహారములను గురించిగాని, ప్రకృతి ధర్మమును గురించిగాని, ఆధ్యాత్మిక విషయములను గురించిగాని, తత్త్వజిజ్ఞాస గలవారు ఒకరు చేసిన సిద్ధాంతమును ఒకరు ఖండిస్తూ, సావధానముగా సాక్ష్యమే కాక ప్రమాణములుకూడా మాటిమాటికి పరీక్షించి, అసంభావ్యములు తొలగించి సంభావ్య మయినవే అంగీకరించి, పక్షపాతము లేకుండా తమ బుద్ధికి నిశ్చితమని తోచిన అభిప్రాయము నిరూపిస్తారు. లౌకిక వ్యవహారములో సద్యఃప్రవృత్తి కోసము సద్యోనిర్ణయము అగత్యమయినా, తత్త్వజిజ్ఞాసలో అగత్యము కాదు. యథార్థము తెలిసేదాకా విమర్శ జరుగుతూనే ఉంటుంది. దీనికి కాలపరిమితి లేదు నిజమని ఒక కాలములో అందరూ నమ్మకొనే విషయము మరిఒక కాలములో అబద్ధమై హాస్యాస్పదము కావచ్చును భాషా జిజ్ఞాస కొంతమట్టుకు దేశ చరిత్ర జిజ్ఞాస వంటిది. మేము ఈ వ్యాసము వ్రాస్తూఉన్న దినమందు మన దేశచరిత్రకు కావలసిన భోగట్టా అంతా ఏలాగున తెలుస్తుంది ? ఈ కాలములో వార్తా పత్రికలున్నవి గనుక ఏవో కొన్ని వృత్తాంతములు వాటిలో ప్రకటిస్తారు గానీ దేశమందు అంతటా జరిగిన సమాచారము యావత్తూ వాటినిబట్టి తెలియదు. జరిగిన పనులలో ఏవి గొప్పవో ఏవి కొద్దివో అవి జరిగినప్పుడు బుద్ధిమంతులయినా ఊహించలేరు, ఏది ఏలాగున పరిణమించునో ముందుగా తెలియదుగదా. మనదేశమునకు కొంచెము కాలములో సంభవించే గొప్ప మేలుకుగాని కీడుకుగాని కారణమైనపని నేటి ఉదయమే జరిగి ఉండవచ్చును; అది యెవరికిన్నీ తెలియకపోవచ్చును. మేలుగాని కీడుగాని జరిగిన తర్వాత దానికి గల నిజమైన కారణము తెలియక ఎవరికితోచినట్టు వారు ఊహించి, అనేక కారణములు చరిత్రకారులు కల్పించవచ్చును; వాటిలో ఒకటైనా వాస్తవము కాకపోవచ్చును. ఇట్టి దోషములు చరిత్రలో కేవల సంభావ్యమే కాకుండా, యథార్థముగా సంభవించినవని చరిత్ర బాగా చదివినవారే చెప్పినారు. అయినా చరిత్రపఠనము నిరర్థకము కాదు; దానివల్ల బుద్ధివికాసము కలుగుతుంది. ప్రాచీన చరిత్ర సర్వవిషయములలోను మన కాలమందు ప్రవృత్తికి పరమ ప్రమాణము కాదనిమాత్రము జ్ఞప్తియందు ఉంచుకోవలసినది.

83. చరిత్ర జిజ్ఞాసకు దొరికే సాధన సామగ్రివంటిదే భాషా జిజ్ఞాసకు దొరికేదిన్నీ. ఇప్పుడు మేము వ్రాస్తూఉన్న వ్యాసము మా అలవాటుచొప్పున మా తెలుగుభాషలో రచిస్తూఉన్నాము. మా ఉత్తర ప్రత్యుత్తరములుకూడా ఈ భాషలోనే వ్రాస్తాము, సంభాషించినప్పుదున్ను ఈ తెలుగే వాడుతాము. అయినా అన్నివిధములయిన వ్రాతలలోను సంభాషణలలోను మా భాష ఏమీ భేదము లేకుండా, ఎల్లప్పుడూ ఒక్కలాగున ఉంటుందని ఒప్పుకోలేము. మా సన్నిహిత బంధువుల భాషకున్ను మా భాషకున్ను కొంచెము వ్యత్యాసము ఉండకపోదు. తెలుగుభాష అనేక కోటిముఖముల ప్రవహిస్తూ ఉన్నప్పుదు తెలుగువారందరూ నేడు సరిగా ఒక్కలాటి తెలుగే వ్యవహరిస్తున్నారని చెప్పలేము. దేశమునుబట్టి, జాతినిబట్టి, వృత్తినిబట్టి, మతమునుబట్టి; విద్యనుబట్టి, వయస్సునుబట్టి, నాగరకతనుబట్టి, ఎంతో కొంత వ్యత్యాసము ఏర్పడక తప్పదు. అయినా "నేటి నాగరకుల తెలుగు"లో సాధర్మ్యము అధికముగాను వైషమ్యము తక్కువగాను ఉన్నందున, దానినివిశేషించి, ప్రత్యేకించి సగటున, అనగా మొత్తముమీద, పరీక్షించి, ఒక్కలాటిదే అనవచ్చును. అన్ని దేశములలోను అన్ని కాలములలోను వ్యవహారిక భాషలు ఇంచుమించుగా ఇట్లే ఉంటున్నవి. మన కాలములో అచ్చుపుస్తకములు అచ్చు వార్తాపత్రికలు పోస్టు, వ్రాత మూలమయిన లౌకిక వ్యవహారము ఉన్నందున, వీటిని బట్టి "నేటి నాగరిక తెలుగుభాష"కు లక్షణము చెప్పవచ్చును; గాని సంపూర్ణమైన లక్షణము నిరూపించుట అసాధ్యమనక తప్పదు. వ్యవహారములో ఉన్నభాష యావత్తూ కాకితాలమీద కనబడదు. వ్యవహారములో ఉన్న శబ్దాలన్నీ అవశ్యమైనవే. ఒక్కటి విడిచినా వ్యవహార హాని కాక తప్పదు. పొల్లుమాటలు కోశాలలో ఉంటవిగాని వ్యవహారములో ఉండవు. వచనము, విభక్తి పురుషము, లింగము కాలము, మొదలయిన భేదములు, వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయ లక్షణమయిన సంస్కారములనుబట్టి తెలుసుకొని, శబ్దార్థము గ్రహించి వ్యవహారమందు ప్రవర్తించడము శైశవము నుండిన్ని అలవాటయి, పండిత పామరులు అందరున్ను తడవు కోకుండా, అచ్చులు హల్లులు యథాశ్రుతముగా ఉచ్చరిస్తూ ఇంచుమించుగా ఒక సంఘములో ఒక్కలాగున భాషిస్తారు అర్థమునకు బాధకముగాని వ్యత్యాసములు వ్యవహారములో ఎవ్వరి మనస్సుకును తట్టనేతట్టవు. మాట్లాడినట్టే చదవడము అలవాటయినవారు అన్నిమాటలున్ను అర్థమవుతూ ఉంటే, వ్రాతలోనైనా ఇట్టి వ్యత్యాసాలు పాటించరు ఇంత పరిచితమైనదయినా దేశభాష బహు చంచలమయినది; అతి చపలమైనది. దాని లక్షణము విశ్లేషముగా నిరూపించుట ఆకాశముమీది చుక్కలు లెక్కపెట్టుటవంటిది. ఎన్ని సూత్రాలు పన్నినా వ్యవహారమునకు సరిపడవు, ఉత్సర్గాలకు అపవాద

ములు; అపవాదములకుకూడా అపవాదములు విధించినా, మాటిమాటికి "బాహుళకము" "వైకల్పికము" అని, 'ఆకృతిగణా' లని," ప్రయోగానుసారముగా గ్రాహ్యమని లక్షణవిరుద్ధ మయినను ఆర్యవ్యవహారము "గ్రాహ్యా"మని, లక్షణమునకు లొంగని శబ్దములకు గతి కల్పింపక తప్పదు. సాధన సామగ్రి సమృద్ధిగాగల 'నేటి నాగరకభాష' అంతా లక్షణములో ఇముడ్చుట దుష్కరముగా ఉన్నపుడు, పూర్వకాలపు నాగరక భాషాలక్షణము సంపూర్ణముగా తెలుసుకొని, ఆభాష స్వాదీనము చేసికొన్నట్టుగా ఆంధ్రపండితులు నటిస్తే ఎట్లు నమ్మగలము? మనకాలములో ఉన్నట్టు ఆకాలములో వార్తాపత్రికలు లేవు; వ్యవహారమంతా ఇంచుమించుగా వ్రాత అక్కరలేకుండా మూజబానీగా జరిగెది. నన్నయ మొదలుకొని తిక్కనదాకా తెలుగుబాషా స్వరూపము తెలిపే సాధనములు ఏమున్నవి? నన్నయి వ్రాసిన గ్రంధమొక్కటే గదా. ఆకాలపు శాసనములయినా అట్టేలేవు; ఉన్నవయినా పండితుల దృష్టికి ప్రమాణముకావు. తెలుగుదేశమందున్న తెలుగువారి అందరిభాషా నన్నయభాషలో అంతర్భూతము అయి ఉండదు. నన్నయ వాడుకొనే తెలుగుబాషఅంతా అతడువ్రాసిన కొంచెము గ్రంధములో చేరి ఉండదుగదా, అందులోని కధచెప్పుటకు ఏశబ్దములు కావలెనో అవే అతడు వాడినాడు అతడు తన గ్రంధములో వాడని శబ్దములున్ను, వాడని ప్రత్యయాదులున్ను వేనవేలు గ్రంధస్థముకాక నశించినవికావా? నన్నయ వ్రాసిన మూడు పర్వములలోనున్న భాషఅంతా కంఠపాఠము చేసినా, నేటి వ్యవహారమునకు కావలసినవ్రాతలు నన్నయభాషలో వ్రాయలేము. ఇట్లే తక్కిన గ్రంథాలలోని భాష పండితులకు ప్రమాణమయిన తెనుగు గ్రంథాలు శృంగార ప్రబంధాలున్ను పురాణములున్ను, వాటిలోనున్న భాష వ్యవహారమందున్న భాషలో అత్యల్ప భాగమయి ఉంటుంది. ఏకాలములోనయినా దేశభాష అనేది అప్పటి లోకవ్యవహారమునకు సరిపడి, సమగ్రముగానే ఉంటుంది; గాని అందులో ఏమీ లోపముండదు. మనుష్యుల జ్ఞానమంతా వారి భాషలో ప్రతిబింబమయి ఉంటుంది. ఆజ్ఞానములో కొంచెము మాత్రమే గ్రంధస్థమయిన విషయముతో సంబంధము కలిగి ఉంటుంది అది వ్యక్తపర్చుటకు కావలసిన శబ్దములేకాని తక్కినవి కవులు వాడరు. ప్రాచీన గ్రంథములలో ఉన్న భాష మాత్రము ఆధారముగా చేసుకొని, కావలసినయెడల లక్షణము చెప్పవచ్చును గాని, ఆ లక్షణము దానికి సంపూర్ణమయినా, ప్రాచీన నాగరక భాషాలక్షణమని చెప్పవల్లకాదు గ్రంధములలో చేరక నశించిన శబ్దములు అనేకములు తెలియరానందున, లక్షణము అసమగ్రము కాక తప్పదు. అట్టి అసమగ్రలక్షణమునుబట్టి తప్పొప్పులు నిర్ణయించకూడదు. మాటకు, గ్రంథస్థమయిన ఒక ధాతువునుండి పుట్టిన చేదాద్యర్థము, తుమున్నాద్యర్థకము, ప్రేరణార్థకము,

కద్రూంతములు మొదలయిన శబ్దములన్నీ గ్రంథస్థము కానప్పుడు వాటి రూప ములు ప్రాచీనకాలమందు ఎలాగున ఉండేవో తెలుసుకొనుటకు సాధనమే మిటి? తెలుగులో ధాతుపాఠము గుణపాఠము ఏర్పడలేదు తెలుగు భాషా లక్షణము అత్యల్పము. అకాస్తలోను వైవిధ్యము, వైరుధ్యముకూడా ఉన్నది. గనుక తెలుగులో తప్పొప్పులు లక్షణమునుబట్టి తెలుసుకోలేము; గ్రంథములే ఆధారము. అయితే, గ్రంథములలో సమగ్రముగా భాషలేదు సరేకదా, గ్రంథస్థ మయిన భాష మారుతూ వచ్చినది. ఒక్కొక్క కాలములో ఒక్కొక్కవిధ ముగా ఉన్నది. దీనికి తోడు గ్రంథాలలోని పాఠాలు ఎవరి యిష్టము వచ్చినట్టు వారు దిద్దుతూ ఉన్నారు. లక్షణము పుట్టినప్పటినుంచిన్ని పండితులే ఈ పాడు పని చేస్తున్నారు. ఇట్టి కూటకరణమువల్ల తత్త్వనిర్ణయము దుష్కర మవు తుంది. బాషాతత్వ జిజ్ఞాస భాషా చరిత్ర జిజ్ఞాస భాషాభిమానులకు లేనందున మన భాషకున్ను మన గ్రంథములకున్ను ఇట్టి దౌర్భాగ్యము సంప్రాప్త మయి నది. గ్రంథాలలో భాష శాసనాలలోని భాష ఉన్నట్టు, మారకుండా ఉంటే భాషా చరిత్రకు నమ్మదగిన ఆధారముగా ఉండును. ప్రాచీనాంధ్ర కావ్యము లలో ఉత్తరాంధ్ర శబ్దములున్ను, ఉత్తరాంధ్ర కావ్యములలో ప్రాచీనాంధ్ర శబ్దములున్ను, చేర్చి భాషా సాంకర్యము చేయడముచేత భాషకు అవస్థాంతర ప్రాప్తి ఎప్పుడు ఏలాగున కలిగినదో తెలిపే జాడలు మరుగుపడినవి.

84. ఇట్టిస్థితిలో, "ద్రుతమునకు అచ్చుతో సంశ్లేషము" గ్రాంథికాంధ్ర ములో ఉన్నదని నమ్మేవారు తమకుగల ప్రమాణములు చూపించి ఆ ప్రమాణ ములు అంగీకరించదగిన పన్నందుకు హేతువులు చెప్పవలెను గదా. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నాచన సోమన, పోతన, పింగళ సూరన, ముడికి సింగన, వెన్నెలకంటి సూరన, పెద్దన, ముక్కు తిమ్మన, మొదలయిన 18 గురు కవుల ప్రయోగములు రమారమీ యాభై ఉదాహరిస్తాము. ప్రతిపక్షులు వీటిలోని పాఠములన్నీ అపపాఠములు అని రుజువుచేసేదాకా 'రెండున్నర' 'ఒకటిన్నర' అనే శబ్దములు గ్రాంథికాంధ్రమందు సాధువని నమ్మట మౌఢ్యముకాదు. తప్పు అని రుజువుచేసే పూచీ ప్రతిపక్షులయందే ఉంటుంది; రుజువుచేసేదాకా ఆశబ్దము అసాధువు అని వారు నిందించకూడదు. నిందించుట అవివేకము. గ్రాంథికాంధ్ర మందిట్టి శబ్దములు లేనే లేవని సిద్ధాంతమయినా, నేటి వ్యవహా రములో ఉన్నవి, శిష్టులు నోటను పలుకుతున్నారు. చేతితో వ్రాస్తున్నారు. "ఆర్య వ్యవహారంబు దృష్టంబు గ్రాహ్యంబు।" వేంకటరాయ శాస్త్రులవా రున్ను వారి పక్షమువారున్ను 'రెండునఱ' 'ఒకటియునఱ' లేక 'ఒండునఱ' అని ప్రయోగించి తత్ఫలము అనుభవింతురు గాక. రెండవతరగతి ఆనంద వాచక పుస్తకము, 20 వ పాఠములో "రెండునఱ' అని గ్రంథకర్తలు వ్రాసి

నారు. కాని, వారిని చూచి ఇతరులు ఈ శబ్దములు త్యజించరు. త్యజించకూడదని మేము ఉపదేశిస్తున్నాము. మా మట్టుకు మేము త్యజించలేము. ఈ చర్చ చాలును, ఇకను ప్రయోగములు చూడండి.

85. నన్నయ ప్రయోగములు వ్రాత ప్రతులలో ఉన్నట్టుగానే ఉదాహరించి, అచ్చుపుస్తకములలోని మార్పులు తెలియ జేస్తాము. వీటిలో 3 వది 6 వది పూర్వలాక్షణికులు ఉదాహరించినారు.

(1) క. గురుకులము నందు గురులకుఁ బరిచర్య లొనర్చు మన్న పరిమితినిష్ఠ (ఆది 1. 92)

(అచ్చులో "లొనర్చి తానపరిమితా ")

(2) క, నరవరుఁడగు శంతనున కమర నదికిన్నెట్లు సంగమంబయ్యె (ఆది IV. 119) అచ్చులో—"నదికినెట్లు")

(3) మత్తకోకిలము .దీని నెట్టులు గ్రమ్మరింతు మదీయ భాషణ మెన్నడు న్నేనిమోగముగాదు దిగ్ధరణీందుభానులెఱుంగఁగాన్ (ఆదిVII. 141) (చూ. పేరా 80)

(4) క నీకున్ నేనపహరించి యిత్తు (సభా II 122) (నన్నయ గ్రంథములో నేను శబ్దమునకు బదులుగా ఏను శబ్దమే తక్కిన చోట్ల కనబడు తున్నందున, ఇక్కడ ఈ ప్రయోగము ఉదాహరించడ మయినది )

(5) క ..ఇంద్రప్రస్థ పురంబున కింద్ర గురుప్రతిభుఁ డరిగి యింద్ర సమానున్ నింద్రయశు ననుజ సహితు నృపేందుని ధర్మసుతుఁ గాంచె నెంతయుఁ బ్రీతిన్ ("155) (అచ్చులో 'ఇంద్రయశు'కు బదులుగా 'జంద్రయశు' అని ఉన్నది నాలుగు పాదములలోను మొదట యింద్రశబ్దము నన్నయ వాడినట్లు రశికులకు తోచక మానదు. వ్రాత ప్రతిలో కూడా కనపడుతున్నప్పుడు ఈ ప్రయోగము సంభావ్య మనుటకు సంశయ ముండకూడదు )

తిక్కన ప్రయోగములు

(6) ఉ ఎఱిగింపునావుఁ డున్, అయ్యతి ముఖ్యుఁ డన్నరవారాగ్రణికిం (విరా. 1 190)

(అచ్చులో, ఎఱిగింఁపుడు న్నరూ, పయ్యది నావుడున్...పారాంతరము లున్నవి.

(7) చ.. వడిగొని గోగణంబుఁ బొదువం బఱతెంచితి మెల్లవారము న్నొడఁబడి ("4. 200)

(అచ్చులో—బఱచితిరెల్లవారము న్నొడఁబడి ..)

(8) క .యతని నా, శుగములఁ బొదివెన్నె మ్మెయి (భీష్మ 2. 239) అచ్చులో యతనినా శుగములఁ బొదివిననమ్మెయి. గాని వ్రాత ప్రతిలో వేరేదోషమున్నది.

(9) క. వివిధోత్పాతంబులకు నన్నర నీపతికిఁదోఁచుకీడునకు. (శాంతి, 11 303) అచ్చులో 'తంబులకున్న వశులలోఁ దోఁచుఁ కీడునకు' యతిలో దోషమున్న దనిన్ని సంధిలో దోషమున్నదనిన్ని ప్రథమపది శాబోలు దిద్ది నారు

నన్నయ తిక్కనల కాలములో ఇట్టి "సంశ్లేషము" విరళముగా ఉండే దంటే అంగీకరించవచ్చును, గాని లేనేలేదంటే నమ్మలేము. పోతనగారి కాల ములో తరుచుగా ఉండేవని ప్రయోగములను బట్టి ఊహిస్తున్నాము.

ఉదా — సంస్కృతములో 'ఏవంచేత్', 'నోచెత్' అని తరుచుగా 'చేత్' అనేశబ్దము కొన్నిటికి చేర్చి వాడురారు. తెలుగు వ్యాకరణములో 'చేదర్థక మనేది' ఈ మాటను పట్టివచ్చినదే. అయితే ఇది ఋగ్వేదములో ఒమ్మారే వాడినట్టు కనబడ్డదట. వేదములో విరళముగా ఉన్న 'చేత్' సం స్కృతములో ప్రచురముగా వాడుకకు వచ్చినది గదా? సంస్కృతములో కృత్వా, గత్వా అని త్వాంతములుగానే క్త్వార్థక రూపము లుండును గాని, ఋగ్వేదములో కృత్వీ, గత్వీ అనిత్వీ అంతమందు గలిగి ఉండునట, కొన్నిటి ధాతువులకు మాత్రము త్వాంతక్త్వార్థకము లున్నవట; అధర్వ వేదములో-త్వీ అంతమందుగలవిలేవట. ఋగ్వేదమందు విరళముగా ఉన్నత్వీ రూపములు బ్రాహ్మణములలో అరుదయి అధర్వవేదములో కనబడకుండా పోయినవి; తర్వాత వ్రాసిన సంస్కృత గ్రంథాలలో ఎవ్వరున్ను-త్వీ అంతమందుగల క్త్వార్థకములు వాడనేలేదు. వేదమందు విరళముగా ఉన్న త్వాంతరూపములు తరుచయి, సంస్కృతములో త్వీ-అంతములు కనబడకుండా చేసినవి. కర్తవ్య వంటి తవ్యాంత శబ్దములు ఋగ్వేదములో లేవు: అధర్వవేదములో జనితవ్య, హింసితవ్య అనే రెండు శబ్దములు మాత్రమే ఉన్నవట. బ్రాహ్మణములలో విరళముగాను, తర్వాత వ్రాసిన సంస్కృతభాషాగ్రంథములలో తరుచుగాను ఇట్టివి ఉన్నవి. అహంగతవాన్, త్వంకృతవాన్ అని అపరిమితముగా నవీన సంస్కృత గ్రంథములలో అన్ని క్రియలకు-తవన్ చేర్చి పండితులు వాడుతూ ఉన్నరూపములు ప్రాచీన సంస్కృత గ్రంథములలో విరళమట; వేదములో లేనేలేవట. ఈలాగున ఇంగ్లీషులో ఇంచుమించుగా మూడువందల సంవత్స రములయి వాడుకలో ఉన్న it (=తెలుగులో 'అది') అనే శబ్దము

పూర్వకాలములో లేనేలేదు; దీనికి బదులుగా hit అనే రూపము వుండేది. 1327 వ సంవత్సరములో వ్రాసిన ఒక గ్రంథములో రెండు రూపములున్ను కనపడ్డవట. అప్పటినుండి క్రమక్రమముగా hit శబ్దము తగ్గి itశబ్దముయొక్క వాడుక ప్రచురమయి తుదకు hit భాషలో కనబడకుండా పోయినది. నేటి ఇంగ్లీషులో it అనే మాటకు బదులుగా hit వాడితే తప్పుగదా. సంస్కృతములో 'గత్వా' అనే రూపమునకు బదులుగా 'గత్వీ' అంటే తప్పుకాదా? ఆలాగే తెలుగులో కూడా నియమముండవలెను భాషా తత్త్వ జిజ్ఞాస భాషా చరిత్ర జిజ్ఞాస మన ఆంధ్ర పండితులకు లేనేలేదు. లోకములోని శిష్టుల వాడుకనుబట్టి లౌకికభాషకు అనుశాసన మేర్పడవలెనని అనేకులకు తెలియదు. గనుక మన తెలుగు భాషకు, తెలుగు గ్రంథములకు ఇట్టి దౌర్భాగ్యము పట్టినది. ఉపదేశకులు, మార్గదర్శకులు, ఆచార్యులు తత్త్వదూరు లయినప్పుడు లోకమునకు అపరిమితమైన హాని కలుగునని మనము జ్ఞప్తియందుంచుకోవలెను. భాషాతత్త్వ మెరుగనివారు భాషా పండితులు కాజాలరు. అట్టివారు తాము మోసపోయి ఇతరులను మోసపుచ్చి లోకమునకు చాలా కీడు చేస్తున్నారు దుర్బుద్ధిచేత కాదు అజ్ఞానముచేత.

86. గ్రాంధికభాష అనగా ఒక్క నన్నయ తిక్కనల భాష మాత్రమే కాదుగదా. ఇంకా చూడండి ప్రయోగాలు. ఎఱ్ఱాప్రగడ హరివంశము పూర్వ భాగములో మూడు పద్యాలలోనున్ను ఉత్తరభాగములో రెండు పద్యాలలోనున్ను ఇట్టి సంధి వ్రాత ప్రతులలో కనబడినది. జ్ఞాపకము పెట్టుకొనిఉన్నాము. ఆ ప్రయోగములు ఇక్కడ వుదాహరిస్తాము.

1. మ. ఇన చంద్రద్యుతి కోటికిం జొరఁగ రాకెల్లప్పుడున్నాత్మభా, షన. (వ్రాతప్రతి) అచ్చుపుస్తకములో.. కెల్లప్పుడాత్మావభా, వన."

(పూ. 4. పుట 99, పద్యం 192)

2. క, సకల చరాచర ..వాసుదేవుం, డొకఁడున్నాధారశక్తి . (వ్రాతప్రతి) అచ్చుపుస్తకములో వాసుదేవుం, డొకరుఁడ యాధారశక్తి.

(పూ. 5. పుట 104, పద్యం 32)

3. క. ఈదేవి యట్లు దుఃఖితయై దూఱఁగ నూరకుండ నగునే మనకున్, అదిభవుండవు. అచ్చులో .దుఃఖితయై యూఱఁగ మనకీ, వాదిభవుం డవు. (పూ. 5, పు. 104)

4. మ. ప్రగుణోత్సాహులు యాదవోత్త....తొల్లి యే, మగలున్నెమ్మెఱుఁ బోరొనర్చిరె . (వ్రాతప్రతి), అచ్చులో....మగలున్ మైమయి .

(ఉ. 4. పుట 151, పద్యం 143)

5. మ, (మూడవ చరణములో) నీవును న్నట్టిభా, వను పాటించి (వ్రాతప్రతి). అచ్చు "నీవు నన్నట్టి" (ఉ. 7 123)—రెండు పాఠము లున్ను సందర్భోచితముగానే ఉన్నవి.

6. శా. (3వ చరణము) ఈ కార్యంబొనరించి యిందఱ ఋణంబెల్లం దగన్నీఁగుమ (ఉ. 10, పు. 283)

ఒక వ్రాత ప్రతిలో "లగన్ ఈఁగు" అని విసంధిగా ఉన్నది. శ. ర. లో 'ఈఁగు' 'నీఁగు' యొక్క రూపాంతరమని ఉన్నది. లత్త్వము తెలిసేవరకూ ఏలాగనుకున్నాసరే 'ఏనికి' 'నేని' రూపాంతర మని రామకృష్ణ కవిగారు నన్నయను కాచినారు గదా.

పోతరాజు ప్రయోగములు:—

1. మ .దావాగ్నిన్ వెనన్నార్తు నే, నన (II 180. 3వ చరణము)

2. మ సూనృతే తరులునుం భాషండులు నైనన . (II. 198. 2వ చరణము)

3. తలంపన్, అరసి నను గాచుటెల్లను (III. 155)

4. దండకము. ఎబ్బంగి వర్తింతు మేనిల్కడన్నుందు మీటిపలో కంబె. (III. 203)

5. ,, భోగంబులం బొందుచున్నన్న యికార్యా (III. 203)

6. ,, పరంజోతి వన్నన్ బ్రపంచంబవన్న న్నధిష్ఠాతవన్నన్. (III. 203)

7 మ ...జరయున్నంతము నొంద, (ఆనందముద్ర: జరయున్నా శము.) (III. 306)

8. ఉ .నావుడు, న్నానయశాలి. (III. 348, 4వ చరణము)

9. మ. పూర్వమందు జగముల్ నిర్మించునాఁడాదిన ప్పులం బుట్టించిన మీఁద నవ్వసుమతిం బుట్టించి తిన్నట్టు య, ప్పులలో. (ఆనంద: బుట్టించిలింబుత్ర) (III. 405)

10. చ ..గజవిఘ్నఁదుద్ధతిన్ననఁటి కంబములున్. (III. 451)

11. మ .. నే, నెనయిన్ వన్యమృగంబయొాడు బలిమిన్నే తెంచు బోఁటి యీ శునకశ్రేణివధింతు, (ఇట్లుపూర్వ ముద్రణము లందున్ను, వ్రాత ప్రతులందున్ను; కాని, ఆనంద: బలిమై యేతెంచు.) (III. 653)

12. క . బలిమి గలదేని నాతోఁ గలన న్నెదిరించిపోరఁగడఁగుము
(ఆనంద॰ గలనను. 645)

13 క తామరసాక్షు, న్ననిమిష మునియోగిజనావన దక్షున్.
(III. 703)

14. మ .విభ్రాజమానాంగుడున్, అనురాగ... శోభాలోకుడున్నై
(3. 754)

15. మ .వరింతున్నంచు నేతెంచె॰ (ఆనంద, వరింతున్ వేగయం
చెంచె.) (3. 778)

16. మ. .నీదక్షుని, న్ననువర్తించినవాడు సంసరణ కర్మారంభుఁడై
నిచ్చలున్ జననం బందుచుఁ జచ్చుచున్ మరల నోజంబుట్టు చున్నుండెడిన్.
(4. 48)

17. చ .కనకకుశాజినాయసనికాయవినిర్మిత పాత్రసీమము, న్నను
పమ. (4. 81)

18. ఉ .సర్వము న్నతని దివ్యకళామయమంచు. (7. 142)

19. శా .నాల్గింట గుజ్జంబులన్, ఏకాత్రంబున సారథిన్. (8. 333)

20. క అనుచు, న్నిన్నిదినంబుల నుండియు. (8. 163)

21. శా .భూకాంతాదులున్నర్థశా, మాశన్. (8. 572)

22. మత్త విద్యల మూలగో, ష్ఠిన్నెఱింగిన (8. 593)

23. మ సహస్రంబు న్నజస్రంబు. (9. 537, 2వ చరణము)

24. క.. క్రందుకొ నెన్నూరివారిఁ గావలివారిన్,
(10. పూ. 142. వ్రాతప్రతి)

25. క . .యోజనమున్న రమేరథ, రాజంబులు నుగ్గులయ్యె.
(10. పూ. 229)

26. క సత్సంసగ్గు, న్నారాధిత భర్గున్. (10. పూ. 282)

పద్మపురాణమందు సింగన ఇట్టి సంశ్లేషము కావించినాడు. పోతన
వలెనే పాదమధ్యమందు కూడాను.

1. క .కనియెన్, ఆతని కుత్తర మిచ్చుట. (7. 63)

2. క.. సుబాహున్, అనిఁగూల్చెను. (8. 70)

3. శా. ఆయార్తధ్వ....పోయెడి, న్వేయు న్నేల దశాస్యమస్తకము
లుర్వింగూల్తు. (8. 164)

4. క....వినవలయున్నతని చరిత వినుపింపుదగన్ ?

87. శ్రీమద్భాగవతములో (ఇప్పటి ఆనంద ముద్రణములో) పరిష్కర్తలు దిద్దక విడిచి పెట్టినవే అనేకము లిట్టి ప్రయోగములున్నవి. పోతరాజుగారి గ్రంథములో ఇట్టివి ఉండవని కొందరి భ్రమ. ఇట్టి ప్రయోగములు తప్పని భ్రమపడి, పోతరాజుగారియెడల గౌరవముచేత, ఇట్టి తప్పులు ఆయన వ్రాయవలసినవాడు కాడని ఆలాగున ఊహించి ఉంటారు ఇవి తప్పులని తెలివితక్కువవాళ్లెవరో అంటే. ఆమాట నిజముచేసి, విమర్శించకుండా పరిష్కర్తలు గ్రంథాలు 'దిద్ది' పాడుచేస్తున్నారు, తెలియక లోకులున్ను నమ్ముతున్నారు. పోతన్నగారి కృతులలోనివే ఇరవై ఆరు ప్రయోగాలు ఉదాహరించినాము. వీటిలో అయిదు ఆనంద ముద్రణములో కనబడవు. పూర్వముద్రణములోనున్న వాటిలో కొన్ని యిందు మాయమయినవి. వ్రాత ప్రతులలోనున్నవి కొన్ని పూర్వముద్రణములలోనే పోయినవి ఏమి లాభము కలిగినదో పరిష్కర్తలకు కొన్ని ప్రయోగములు చెరిపివేసినంతమాత్రాన ; తక్కినవాటివల్ల పోతన్న ఈ రూపము వాడినట్లు ఏర్పడదా ? కొలదిగా ఉంటే ప్రయోగవైరళ్యమని చెప్పి ఆ రూపమునకు అసాధుత్వము సాధించవచ్చునని కాబోలు ఈ పండితమ్మన్యుల తలంపు. శబ్దానుశాసనమంటే ఏమిటో తెలిసినవారైతే యిట్టి తలంపులు తలచి ఉండరు వింతగా ఒక్క రూపము కనబడ్డా దానిని నిరాకరించి విడిచిపెట్టకూడదు. దానికికూడా అనుశాసనము చేసి తీరవలెను. నన్నయ తిక్కన ఎర్రనల కాలములో విరళముగా ఉన్నా పోతరాజు నాటికి ఈ రూపము ప్రచురముగా ఉండెనని నిశ్చయముగా చెప్పవచ్చును. వేదం వెంకటరాయశాస్త్రులవారు పోతరాజుగారికంటె గొప్ప పండితులైతే కావచ్చును; వారియందు భక్తిగలవారు వారి మాట శిరసావహించవచ్చును. గాని పోతరాజుగారి ప్రయోగము ప్రమాణముగా చేసుకొన్నవారిని శాస్త్రులవారు తిట్టితే, పోతరాజుగారినే తిట్టినవారవుతారు. మేమది విన సహించలేము. శాస్త్రులవారికి తెలిసి ఉండదు. పోతరాజుగారు తరచుగా ఈ ప్రయోగము వాడినారని. శాస్త్రులవారు భారతము బాగా చదువుకోలేదని తేలినట్టే, భాగవతముకూడా బాగా చదువుకోలేదని తేలినది. అదే రహస్యము, అది మేము బయలుపెట్టవలసివచ్చినది, తత్త్వ జిజ్ఞాసలో చేయక తప్పనిపని గనుక సాహసించినాము. తెలుగుభాషకు, తెలుగు సారస్వతమునకు, తెలుగు వ్యవహారమునకు, తెలుగు దేశమునకు ఇట్టి పండితుల భ్రమ ప్రమాదాహంకారములవల్ల అపరిమితమయిన కీడు కలుగుతున్నదని నమ్మి, ఆ కీడు తొలగించడము లోకోపకారకమయిన పని అని ఉపదేశిస్తున్నాము. మాచేత నయినంత మట్టుకు అట్టిపని చేస్తున్నాము. గనుక మొగమోటము లేకుండా మాకు సత్యమని తోచిన సంగతులు స్పష్టముగా విశద పరుస్తున్నాము. మా ప్రతిపక్షుల ప్రాచీనాంధ్ర

భాషాభిమానము కేవలము వేడబమని తెలియనందున వారు ఆదర్శముగా చూపించే భాష కృత్రిమము, అసంభావ్యము, అదృష్ట పూర్వము అయినా, ప్రవాద మోహితులయి, విమర్శించి సత్యము తెలుసుకోలేక, అసత్యమునే గురి యందుంచుకొని, వాస్తవమయిన దేశభాష నింద్యమని ఉపేక్షించి, తెలుగు వారు తమ దేశాభివృద్ధికి గొప్ప ఆటంకము కలుగజేసుకొన్నారు. సులభము, సుబోధము, సర్వజన సామాన్యము అయిన దేశభాషవల్ల కలిగే మేలు ఎట్టిదో ఎరిగినవారికి ఈ ఆటంకము మిక్కిలి దుఃఖకరముగా ఉంటుంది. అందుచేత వారు, ఎంత నింద వచ్చినా, సరే; ఎవరికి కోపము వచ్చినా సరే; ఏమి నష్టము కలిగినా సరే; అని వెనకదీయకుండా నిజము చెప్పవలసిన వారవుతున్నారు.

ఇంకా మరికొందరు మహాకవుల ప్రయోగములు చూపిస్తున్నాము —

1. నాచన సోముడు సామాన్యుడుకాడు. అతని ఉత్తర హరివంశము వీరేశలింగంపంతులుగారున్ను వావిళ్ళవారున్ను ముద్రించినారు. సీతారామాచార్యులవారు ప్రౌఢవ్యాకరణములో ఉదాహరించిన సోముని ప్రయోగము ఈ రెండు ముద్రణములలోను కనబడదు. పరిష్కర్తలు దిద్ది రూపుమాపినారు. తంజావూరి పుస్తకాలయమందున్న వ్రాత ప్రతిలో సీతారామా చార్యులవారు ఉదహరించి నట్లున్నది. అచ్చుపుస్తకముల రెంటిలోనూ పాఠము యెట్లున్నదంటే:— (6. 226, 2వ, 3వ చరణములలో)

మ ఘనచక్రాయుధనిష్ఠు రక్షతగళ ద్రక్తార్ద్ర సర్వాంగున
 భ్యనుభూతాప్రతిమ ప్రగల్భ పరివాదాంతర్ధితోద్విక్రమున్.

సీతారామాచార్యులవారి పాఠము:—“ఘన . గళ ద్రక్తాస్యసర్వాంగుని, న్ననుభూ వాదాంతర్ధితో... ”

వ్రాత ప్రతిలో “ఘన ..గళద్రక్తార్ద్ర సర్వాంగుని, ననుభూతా ప్రమధ ప్రగ . ర్ధితో ” లేఖకుని పొరబాటు స్పష్టము. ‘న్నను’ అని ఉండవలెను.

మేము మరిఒక ప్రయోగము చూపిస్తాము, అది అచ్చుపుస్తకములలోనున్ను వ్రాతపుస్తకములోనున్ను ఒక్కలాగే ఉన్నది. సందేహమున కేమీ అవకాశములేదు.

క॰ అవ్విబుధ జగతిలోపలఁ గ్రొవ్వదఱిఁగి సురగణంబు క్షోభము నొందెన్
 ఇవ్విధమననుత్పాతము, నివ్వటిలం దొడగుటయును నిష్కరుణతతోన్
 (6. 159)

2. మనుచరిత్రము 3. 48వ పద్యము, 4వ చరణములో "రతి పయ్యెద కున్నను వైన చేతులన్" అనే పాఠము కొందరున్ను' "రతిపయ్యెదకున్నను పైనచేతులన్" అనే పాఠము మరికొందరున్ను అంగీకరిస్తారట. అచ్చుపుస్తకము టీకలో ఆలాగున ఉన్నది. మావద్ద నున్న వ్రాత ప్రతిలోనున్ను మండపాక పార్వతీశ్వర శాస్త్రులవారి వద్దనున్న వ్రాతప్రతిలోనున్ను మొదటిపాఠమే ఉన్నది. మాదృష్టికి అదే సందర్భోచితముగా ఉన్నది. తాటాకు పుస్తకాలలో రెండవ పాఠము కనబడే వరకూ పాఠాంతర మున్నదని చెప్పకూడదు. అచ్చుపుస్తకాలలో ఇట్టి చోట్ల పండితమ్మన్యులు పాఠాలు మార్చివేసినారు గాబోలు.

3. పారిజాతాప హరణము 1 45వ పద్యమందు ప్రస్తుత ద్విత్వనకార మున్నట్లు చెప్పిన లక్షణమునకు లక్ష్యమున్నదని రంగరాట్ ఛ్చందస్సులో ఉదాహృతమయి ఉన్నది. అందులోని పాఠము ఇట్లున్నది.

క. వచ్చినమునిపతి కెదురుగ వచ్చి నమస్కృతులొనర్చి వనితయుఁ దానున్
నొచ్చెంబు లేని భక్తి వియచ్చర రిపుభేది సలిపెనాతిధ్యంబుల్.

ఇప్పటి అచ్చుపుస్తకములో మూడవచరణము మొదటిమాట "బొచ్చెంబు" అని.

4. కళాపూర్ణోదయము 7. లోనిది ప్రౌఢవ్యాకరణములో ఉదాహృతము. మ. తరుణీశాతకటాక్ష వీక్షలకొనల్దారొ్కన్న చోట్లుంబలె, న్నరు శోభా

5. విష్ణు పురాణము 3. 172 లో "మూడున్నర"

6. పాంచాలీ పరిణయము ఆ 1. పు 5 "రొండముంగొని తగన్నెగఁ జిమ్మ"

7. కుచేలోపాఖ్యానము 3. 85—"శ్రీయుతుఁడై యన్యులకున్నె యెడ"

8. శుకసప్తతి 3. పుట 131. క.... వినుచుంటి నంత వేపులు, తిని యెన్నిమాఱు వండిదించిన దెల్లన్. 1 పుట, 156. చ. మించిన యెడన్నొకచో"

9. సానందోపాఖ్యాన 95 మత్త కోకిల వైఖరి, బొందితి న్నెమిగా వలెఁ"

10. రామరాజీయము "సంహారులున్నెన్నన." (?)

11. తిమ్మకవి రాజశేఖర విలాసము. 3. 109. "ఉ. వారక యీ పురిన్నెచట,"

12. రామ స్తవ రాజము. 2. మ. తాపత్రయం, బెఱుఁగన్నియదో.

13. లక్ష్మణకవి లంకావిజయము 1 12, మ. వాచస్పతి న్నార్యునిన్.

14. కవిజనాశ్రయము; పు. 57, మనోహర వృత్తము 3 వ పాదము "ఆరంగఁ బడన్ను భయార్థములన్ ;"

పుట. 61, కందములక్షణము,—వానిపాదం, బుల నికునది మూఁడు నేను మూఁడున్నేనున్.

88. అముద్రిత గ్రంథచింతామణి మయూఖము 1895 సం. మేనెల సంచికలో మన శాస్త్రిలవారు, "ద్రుతమున కచ్చుతో సంశ్లేషమును గుఱించి" వ్రాసిన ఉపన్యాసమందు, ఆంధ్రశబ్ద చింతామణి సూత్రమున్ను దానికి అప్పకవి వ్రాసిన టీకను ప్రమాణముగా, పెట్టుకొని, అందుకు విరుద్ధముగా వాదించిన వారిచ్చిన రెండు ప్రయోగములు అపపాఠములని నిరాకరించినారు, గాని అవి అపపాఠములన్నందుకు హేతువులు చెప్పలేదు. ఈరెండు ప్రయోగములలో ఒకటి పోతరాజు భాగవతము 7. 142 వ పద్యములోనిది, రెండోది నాచన సోముని ఉ. హరివంశము 6 226 వ పద్యములోనిది, ఇవి మేము ఉదాహరించే ఉన్నాము. శాస్త్రిలవారు లక్ష్యములు తెలుసుకోకుండా, లక్షణము మాత్రము నేర్చుకొని తెలుగు పండితులయినందున, లక్షణమే—అనగా తాము చదువుకొన్నదే—పరమప్రమాణ మనుకొన్నారు; గాని, లక్షణము ఏలాగు పుట్టినదో ఆలోచించుకొన్నారు కారు. లక్షణము చెప్పినవారికి దివ్యదృష్టి ఉండెనని భ్రమపడ్డారు గాబోలు. ఎట్లయినా, లక్షణమందు వైవిధ్య మున్నదని తెలియక, తాము చదువుకొన్నదే లక్షణమని విశ్వసించి, దానికి విరుద్ధముగా ఇప్పటివారు వ్రాస్తే నిందించడమునకున్ను, పూర్వులు వ్రాసిఉంటే అపపాఠమని దిద్దడమునకున్ను సాహసించినారు. "సర్వమున్నతని" అనే అచ్చు పుస్తకముల పాఠము దాహరించిన వారిని ఎట్లు అధిక్షేపించినారో చూడండి·— లక్షణ విరుద్ధమయిన నీ పాఠమున నింత నమ్మకమేమి ? "సర్వమావిభుని" అని యచ్చు పుస్తకములలో నున్నయెడల "సర్వమున్నతని" అని యెవరైన దిద్దుదురా ? "మావిభు" అనుటకుగాని యట్టి యవిరుద్ధమయిన మఱి యేపాఠమునకుఁగాని బదులుగా నీపొరబాటచ్చునంజొచ్చి యుండరాదా, లేదాసర్వము + ఉన్న + అతని అనియేల విభాగము కాగూఁడదు ? ఇదియకవి హృదయమని నా యభిప్రాయము. సర్వము=ఈ విశ్వమెల్ల, ఉన్న = సత్పదార్థమయిన, అతని = ఆహరి యొక్క" యని యన్వయము శ్రుతి. "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" అని యుపనిషత్తులుద్ఘోషించెడు సదాత్మకమయిన బ్రహ్మమే యా విష్ణుఁడనియుఁ దన్మయమే విశ్వమనియుఁదాత్పర్యము. "ఈ వ్యాఖ్యానము ఎట్లున్నదంటే వేంకటరత్నము పంతులవారి యాంధ్రీకరణమును గురించి శాస్త్రిలవారన్నట్లే "కొండుభట్లు కమ్మవారికి శాంతాకార పురాణము చెప్పిన

చొప్పున"బహుజొగుజుగా"ఉన్నది. (చూ.పుట.16) "సర్వమావిభుని" అనే పారముకంటికి కనబడుతూఉంటే ఎవరైనా ఎందుకు దిద్దుతారు? ఆప్రశ్నరు అవకాశమేమిటి? అది సాధువుకాదని ఎవరన్నారు? ఐతే, అది అచ్చుపుస్తకములలోలేదు, దానిజోలేమున్నది? అచ్చుపడ్డ పారము "సర్వమున్నతని" అనేది అసాధువన్నవారు వ్రాత ప్రతులలో ఏపారమున్నదో చూచి మరిదిద్దవలెను. చెన్నపట్నమందు కావలసినన్ని ప్రతులు 1895 వ సం॥లో ఉండెను గదా, ఎందుకు పరిశీలించలేదు? శాస్త్రిలవారు అట్టి పరీక్షచేయకుండా ఏలాగున "సర్వమావిభుని" అనేపారము పోతరాజు వ్రాసి ఉంటాడని ఊహించినారు? కర్ణ పిశాచి చెప్పినదా? యోగనిద్రలో వారున్నప్పుడు కనబడినదా? ఈపారము కవివ్రాసిఉంటే శ్రుతులనుబట్టి తాము తెలుసుకొన్న పరమార్థము కవి హృదయమని సాధించడమునకు వల్లపడదు వారు కనుగొన్న కవి హృదయము వాస్తవమైతే, వారూహించిన పారము వాస్తవము కాదు పారము వాస్తవమైతే, కవి హృదయము వారనుకొన్నదికాదు. వివేకము లేనివారివిమర్శము,ఇట్లే ఉంటుంది. 1895వ సం॥లో పండితులకు తెలిసిన వాటికన్న ఇప్పుడు ఎక్కువగా ఈ విమర్శకు కావలసిన ప్రయోగములు దొరికినవి. వ్రాతప్రతులలో, ఓపికతో వెదకవలెను గాని, కావలసినన్ని కనబడతవి. పాటాంతమందు ద్రుతము నిలిపి తర్వాత అచ్చుఉంచితే దోషముండదనిన్ని, లక్షణవిరుద్ధము కాదనిన్ని, కొందరి భ్రమ. పాదమధ్యమందు సంశ్లేషముగల ప్రయోగములుకూడా మే ముదాహరించిన వాటిలో ఉన్నవి. అట్టిదైనా తప్పనికదా అచ్చులో దిద్దినారు. ద్విత్వశ్లేషములున్నవని సిద్ధాంతము. పండితులు తమ యిష్టముచొప్పున ప్రక్రియ చెప్పవచ్చునుగాని 'రెండున్నర అనే శబ్దము అసాధువనకూడదు. అంటే చెల్లదు.

## స భి కు లు

89 ప్రసన్నరాఘవమందు 6 వ పుటలో సూత్రధారుని వాక్యమిట్లున్నది;—

"బావా! నిజకవిత్వ తత్త్వ వినోద ముదితు లీ సభికు లెట్లన్నుని యొక్క కవితచేతఁ జొక్కుదురు?"

ఇందున్న 'సభికులు' అనేశబ్దమును నిందిస్తూ వేంకటరాయశాస్త్రిలవారు తమ విమర్శమందు వ్రాసిన దేమంటే'—

"సభికులనఁగా జూదమాడించువారు. 'సభికా ద్యూతకారకాః" అమరము. అట్టివానికొకనికి మదరాసులో ఈ నడుమ 250 రూపాయలు దండము విధింపఁబడినది. అమరుఁడు ఈ యర్థము నీ శబ్దమునకు కంఠోక్తముగాఁ జెప్పుటయు, 'సభాసదస్సభాస్తారాస్సభాభ్యాస్సామాజికా శ్చతే" అని సభ్యపర్యాయములలో ఈ శబ్దమును చెప్పమియుఁ జూడ, దీని కిది రూఢ్యర్థ మనియు సభ్యార్థ

మందు దీనిని వ్యవహరించుట లేదనియు నెఱుకపడుచున్నది. యోగముచే సభ్యార్థమును సాధించుపక్షమున, 'సభాద్యూతమాత్ర యత్వేనాస్యాస్తీతి వ్రీహ్యాదిత్వాత్ ఠన్" అని రామాశ్రమీయము. 'రూఢిర్యోగ మపహరతి' అనఁగా రూఢియోగమును హరించు నను న్యాయ మేమిచేయును: మత్వర్థముచే సభ్యార్థమును సాధించుట క్లిష్టము. ఇన్నిటికిని విరుద్ధముగా ఎట్లో యోగాశ్రయముచే 'ఓసభికులారా!' యని సభ్యులను సంబోధించుట, (విధవ శబ్దమును గొప్ప ప్రభువని యర్థముగా దూతాది గణమందు చేర్పనెంచి) వారినే 'ఓ విధవలారా' యనుటవలె నున్నది. సభ్యులు సభిక శబ్దతత్త్వము నెఱింగినచో ఈ రెండు సంబోధనలచేతను సంబోధ యితలకు తుల్యఫలమే గలుగును." (పు. 23)

90. వీరివద్ద నేర్చుకొని కాబోలు బ్ర. శ్రీ. వావిల కొలను సుబ్బారావు పండితులవారు తమ సులభ వ్యాకరణమందు (చూ. పు. 16, 3వ భాగము.):

"వ్యాసలేఖకుఁడేది సంస్కృత శబ్దమయినది, యేది తెలుగుమాటయైనది యెఱింగి యుండవలయును *ఎఱుంగకున్నఁ బెక్కుఁ దప్పులు వ్రాయవలసివచ్చును పశుసమూహమును బోధించు సమజశబ్దము సమాజపర్యాయముగను, జూదగాండ్రను బోధించు సభిక శబ్దము సభ్య పర్యాయముగను వాడుట ప్రశస్తముగాదు. సభికులారాయని దూషించునపుడు చెప్పవలయుఁ గాని భూషించునపుడు చెప్పరాదు."

91. ఇట్లు 1912 వ సంవత్సరమున విద్యార్థులకు శబ్దార్థము బోధించిన పండితులవారు, 1893 వ సంవత్సరము నవంబరు తే 12 దిని తమ్ము గౌరవించుటకు సభచేసి, గజమాలతో సంభావనచేసిన నెల్లూరి పండితులకు పారితోషికముగా తాము సమర్పించిన పంచరత్నములలో నాలుగవదానియందు, వారిని తాము భూషించనుద్దేశించినవారై, "సభికులారా" అని ప్రయోగించి, దూషించినవారైనారు చూడండి ఆ వాక్యము (అముద్రిత పు. 4)

సీ. గీ ...మీబోటి సచ్చరితులు, జగతి వెలయుట, గొదవేమి సభికులార!

బహుశా ఈ పద్యము రచించేనాటికి ఈ పంతులవారి పాండిత్యము బాగా పరిపక్వతము కాలేదని తోస్తుంది. వీరున్ను వీరివంటి పండిత భిషక్కులున్ను తమ భేషజాలుచేత బడిపిల్లలను మోహింపజేస్తూ ఉంటారు. వీరి భేషజతత్త్వము బయలుపడిన తర్వాత 'అహా! యొజ్జల పుచ్చకాయ వితమౌరా' అని నవ్వుకొంటారని ఎరుగరు. ఈ భిషక్కుల భేషజాలు చాలా ఉన్నవి.

---

* ఇందుకు సులభోపాయము అమరము కంఠపాఠము చేయుటే అని వారే బోధించినారు.

అవి వేరే ఒక వ్యాసములో ప్రదర్శింపదలచి ఉన్నాము. ప్రస్తుత విషయముతో సంబంధించినది గనుక ఇదిమాత్రము ఇక్కడ ఉట్టంకించినాము. అముద్రిత గ్రంథచింతామణి పత్రికా సంపాదకులు పూండ్ల రామకృష్ణయ్యగారు ఈ పంచరత్నములు తమ పత్రికలో ముద్రించి ప్రకటించినప్పుడు, ఈ సభిక శబ్దమందు దోషమున్నదని విమర్శకులు ఎవరూ చూపించలేదు.

92. ఇట్లే 1880 సం. లో అముద్రిత గ్రంథ పత్రికాధిపతియగు వీర నాగయకవిగారు రచించిన 'శ్రీ బకింగ్‌హామ్ సింహపురీ సందర్శనము' 1885 సం మందు ముద్రితమయినప్పుడు, అందు రెండు పద్యములలో సభిక శబ్దము ప్రయుక్తమై ఉన్ననూ ఏల ఆక్షేపించలేదు. ఆ పద్యము లుదాహరిస్తూ న్నాము.

క. ఇక్కరణి సభిక లందఱు,
బకింగాం సార్వభౌము భావంబునకున్
బెక్కు తెఱంగుల మెప్పులు,
నెక్కొన ఘటియించి రాత్మ నిపుణత మెఱయన్. (29)

ఉ. ఈ సభికోత్తము ల్వసుమతీశుని యాగ మనంబెఱింగి . . (30)

93. అయితే, 1897 వ సం, లో కొక్కొండ వెంకటరత్నం పంతుల వారు ప్రసన్నరాఘవములోనున్న, కోలాచలం శ్రీనివాసరావు పంతులవారు సుఖమంజరీ నాటకములోనున్న ఈ సభికశబ్దము, సుబ్బారావు పంతుల వారున్నూ వీరనాగయకవిగారున్ను వాడినట్టే సభ్యార్థమందు వాడినప్పుడు, దీనినిగురించి విమర్శములు ఆరంభమయినవి. అముద్రిత గ్రంథ చింతామణి పత్రికాధిపతులయిన పూండ్ల రామకృష్ణయ్య గారున్ను వేదం వేంకటరాయ శాస్త్రిలవారున్ను జట్టుగా ఉన్నట్టు తోస్తుంది. వీరు ఉభయులూ కలిసి వేంకటరత్నము పంతులవారిని శ్రీనివాసరావు పంతులవారిని ఆక్షేపించి, నిందించి, దూషించి, వారు గ్రాంథి కాంధ్రము రానివారని తోచేటట్టు అనేక వ్యాసములు వ్రాసినారు. తక్కిన విషయములతో మన కిక్కడ పనిలేదు. వేంకట రత్నము పంతులవారు వాడిన సభిక శబ్దమును గురించి శాస్త్రిలవారు వ్రాసినది (89 వ పేరాలో) ఉదాహరించినాము గాదా. శ్రీనివాసరావుగారి ప్రయోగమును మొట్ట మొదట రామకృష్ణయ్యగారు—'సభికులనగా జూదగాండ్రు. సభికాద్యూత కారకాః అని అమరము. గాన, నిచటి సభయందు జూదగాండ్రుండుటకు కారణ మేమి' అని ఆక్షేపించినారు. అందుపైని. శబ్ద రత్నాకరమందు ఈ సభిక శబ్దమునకు 'సభయందుండు ధర్మజ్ఞుఁడు' అనే అర్థ మున్నదనిన్ని, కొందరు

కవులు ప్రయోగించి ఉన్నారనిన్ని, శశిలేఖా పత్రికలో రావుగారు సమాధానము చెప్పినారు. రామకృష్ణయ్యగారు శబ్దరత్నాకరములోని అర్థమసంబద్ధమని, 'సంస్కృతేతరప్రయోగముల కేమిగాని సంస్కృతమున నిట్టి ప్రయోగములున్న రావుగారువానింజూపఁ బ్రార్థితులు' అని తిరిగీ అధిక్షేపించినారు. శ్రీనివాసరావు గారుచూపించిన ప్రయోగములను అంగీకరించక శేషాద్రి వేంకటేశ్వరరావుగారు పత్రికాధిపతిగారికి ఒకజాబు వ్రాసినారు దానిలోని వాక్యము ఉదాహరిస్తాము: 'అవి అన్నియు నాధునిక కవిప్రయోగము లగుటచే వానింగురించి నేనేమియు వ్రాయనక్కఱలేదు, మీ వాదము ప్రకార మీ శబ్దమునకు సభ్యుఁడను నర్థము నైఘంటికముకాదు. కాకపోయినను లోకమునఁ గొందఱు సభ్యులనుటకు బదులు సభికులని వాడుచుండుట నిజము ఇట్లే శ్రీనివాసరావుగారును పొరబడి దీనిం బ్రయోగించి, మీవలన నాక్షేపింపబడి యెట్లైన నా పదమునకు సభ్యుఁడను నర్థమును సమర్థింప యత్నించు చున్నారని తోఁచెడిని. .సభ్యపర్యాయము లలో నమరుఁడు సభిక శబ్దము చెప్పమి యేలొకో దానికిఁ గారణమరయవల వదా? ఆ యర్థ మీ శబ్దమునకు రూఢి విరుద్ధ మగుటయే కారణము. రూఢ్యర్థము ద్యూతకారులు గావున నదిచెప్పఁబడినది. దాని నెఱుంగక సభ్యార్థమున నాధునిక కవులు చేసిన సభిక ప్రయోగముల నెన్నింటంజూపిన నేమి ప్రయోజనము? ఈ కోలాచలముగారి వాదము చీఁకటితోనే తాంబూల మేమిరా? ఉల్లి గడ్డలతో జల్దియన్నముం దింటిని. ఉల్లి గడ్డ లేలరా? సెగసెంకటము. ఛీ ఛీ ఎక్కడ తగిలించుకొంటివి? నాకును మా నాయనకును మా వదినె తగిలించినది. మా యింట నందఱికి సెగ సంకటమే' అన్న సామితెగా నున్నది. ఎంత సరస ముగా ఉన్నదో చూచినారా సభిక శబ్ద విమర్శము?

"ఈ సభికుల్ గనుంగొనఁగ నిట్లయితిన్ వగనాకు వింతయే" అనివిరాట పర్వము 2. 176 వ పద్యమందు సభ్యార్థమందు తిక్కన సభిక శబ్దమువాడినట్టు ఒకరు ఆప్రయోగము చూపిస్తే, ఈ వెంకటేశ్వరరావుగారు ద్రౌపదీ వాక్యమున మత్స్యరాజు నాస్థానమువారు అందలి ప్రముఖులా సమయమున జూదమాడు చుండిరి గావున నాసభయందు ధర్మరాజుయొక్క పూర్వకృత దుర్ద్యూత దోషముచేతఁ దనకిట్టి భంగపాటు కలిగె ననియు భావమగునట్లుగాన సభవారి నందఱిని 'సభికులు' అని వచించినది, ఈ పద్యమునకు మూలభూతమైన శ్లోక సముదాయములో సభికులను నీమాటకు ధూర్తాపి అని ఉన్నది "ధూర్తోక్ష దేవ కితవాక్ష ధూర్తోద్యూత కృత్సమా." "సభికా ద్యూత కారకాః" అని అమరము. ద్రౌపది కీచకపాద తాడనము పొందిన విరాట సభయందు జూదము జరుగు చుండెను. "విఘ్నంకరోషి మాత్స్యానాం దీవ్యతాం రాజసంసది = జూదమాడు చున్న మాత్స్యులకు విఘ్నముం జేయుచున్నావు" అని ధర్మరాజు ద్రౌపదితో

అన్నట్టు సంస్కృత భారతమందున్నది, అని సమాధానము చెప్పినారు. వీరి వాదములో మాకు బోధపడని వింతయేమిటంటే, అమరములో సభిక శబ్దార్థము ద్యూత కారకాః అనిఉన్నదంటూ "సభికులనగా జూదగాండ్రు" అని రామకృష్ణయ్యగారున్ను. "జూదగాండ్రను బోధించుసభిక శబ్దము సభ్య పర్యాయముగ వాడుట ప్రశస్తము గాదని" సుబ్బారావుగారున్ను, ద్యూతకృత్, ద్యూతకారక శబ్దములున్ను వాటి అర్థములున్ను తారుమారుచేసి ఒప్పిబ్బులు పడినట్టు కనబడుతున్నది. వీరిమిత్రులు వెంకటరాయశాస్త్రులవారున్ను వేంకటేశ్వర రావుగారున్ను వీరిభ్రాంతిపోగొట్టక ఉపేక్షించినారేమి? సభిక శబ్దమునకు సంస్కృతములో ఏమి అర్థమున్నదో ప్రయోగములు చూపి ఎవరూ చెప్పరేమి? సభికులనగా ద్యూతకారకులుగాని ద్యూతకృత్తులు కారుగదా.

94. సభిక శబ్దముకు 'ద్యూతకారకః,' అనే అర్థము అమరములో ఉన్నదన్నమాట నిజమే. అయితే, అమరుదు చేసిన నామలింగాను శాసనము సంస్కృత గ్రంథము లందున్న సంస్కృత భాషాశబ్దములకే చెల్లునదేను. సంస్కృతభాష లౌకిక భాషగా వాడుకలో ఉన్నప్పుడు ఆ భాషలోని శబ్దములున్ను వాటి అర్థములున్ను ఏర్పడ్డవి. ఆ భాషయొక్క వాడుక పోయిన తర్వాత, ఆభాషలో గ్రంథములు వ్రాసేవారు పూర్వము ఏర్పడి ఉన్న శబ్దములున్ను వాటికి ఏర్పడిఉన్న అర్థములున్ను లెస్సగా తెలుసుకోవలసిన నియమము ఉచితమయినదే. సభాశబ్దమునకు సంస్కృత భాషలో అనేకార్థము లున్నవి. (1) గృహము, (2) సమాజము, (3) ద్యూతము—(సభాద్యూతం. సభాగృహామితి రుద్రః) రాజుకొలువుకూటము 'రాజసభా', ధర్మ నిర్ణయము చేసే సభ. 'ధర్మసభా', మల్ల యుద్ధమందు జయాపజయములు నిర్ణయించే సభ "మల్లసభా", అట్లే జూదరుల సమాజము 'ద్యూతసభా' జూదమాడే గృహముకూడా 'ద్యూతసభా'. ఏ సభలోనయినా కూర్చున్నవారు 'సభ్యులు', 'సభాసదులు', 'సభాస్తారులు', ఈశబ్దమును 'రాజ నియుక్తులకున్ను' ఉత్తనే కూర్చుంచి చూచేవారికిన్ని చెల్లును. చాణూరముష్టికులతో రామకృష్ణులు మల్లయుద్ధము చేసినప్పుడు కంసునిచేత నియుక్తులయిన మల్లసభాధి కృత్తులు మల్ల సభాసదులని సంస్కృత భాగవతమందున్నది. యాజ్ఞవల్క్యస్మృతిలోనున్ను దాని వ్యాఖ్య విజ్ఞానేశ్వరీయములోనున్ను 'ద్యూతసభా' 'ద్యూతః' 'సభికః', 'ధూర్తకితదః 'గృహాః మొదలయిన శబ్దములకు ధర్మశాస్త్రమందు ద్యూత సమాహ్వాయమనే వివాద పదనిరూపణములో పారిభాషిక పదములుగా నిర్వచనము లున్నవి. 'సభికుడు' రాజుచేత 'నియుక్తుడ'యిన 'ద్యూత సభాధికారి' 'ద్యూత సభాపతి' 'ద్యూతసభాధ్యక్షుడు', అనే పేళ్ళుకూడా ఉన్నవి. సభాపతి శబ్దము సభిక శబ్దమువలెనే 'ద్యూతగృహస్వామీ' అనే అర్థము కలిగిఉన్నది.

'ద్యూతసభ' ప్రసిద్ధమయిన స్థలమందుండవలెను. నిర్ణీతమయిన 'శుల్కము' గెలిచిన జూదరులు 'సభాధికారికి' చెల్లించవలెను 'సభికుడు' నిర్ణీతమయిన సుంకము రాజుకు చెల్లించవలెను. తగవులు పరిష్కరించే అధికారము 'సభికుని'యిందే ఉన్నది. అతని మాట మీరినవారిని రాజు దండించవలెను. కొన్ని తగవులు తీర్చుటకు పంచాయతీవారిని నియమించవలెను, అందులోని 'సభ్యులు' ద్యూతసభాధికారులే, సాక్షులు జూదరులు. ఇప్పుడు అబ్కారీ ఉద్యోగస్థులు, ఇజారాదార్లు, లైసెన్సులు, డిపోలు అంగళ్ళు మొదలయినవన్నీ ఉన్నట్టే, పూర్వము ద్యూత వ్యవహారము నిర్వహించే డిపార్టుమెంటు ఒకటి సాంగముగా రాజ్యములో ఉన్నట్టు కనబడుతున్నది. దీనివల్ల రాజుకు కొంత ఆదాయము వచ్చేది. ఈ కాలములో పన్నులు వసూలుచేసే అధికారము కలవానికి కలెక్టరు అనే హోదా ఉన్నట్టే, ద్యూత సభాధికారికి 'సభికః' అనే హోదా ఉండేది 'సభికులు' అన్నవారు జూదమాడేవారు కానేకారు, రాజుచే నియుక్తులయిన అధికార్లు· ద్యూతక్రీడల సూపర్వైజర్లు, సూపరింటెండెంట్లు ద్యూతము వ్యసనమైనా, ద్యూతకృత్ నింద్యుడైనా, సభికత్వము నింద్యము కాదు. సురాపానము నింద్యమైనా, అబ్కారీ కంట్రాక్టరుగాని అబ్కారీ డిపార్టుమెంటువారుగాని నీమలు నింద్యులు కారు వినోదార్థము ఇప్పుడు చదరంగము, చీట్లపేకవలెనే, పూర్వము రాజులు తమ సభాగృహములలోను, సంసార్లు తమ యిండ్లలోను, ద్యూత మాడుకొనేవారు. అట్టిచోట్ల ద్యూతకారకు లయిన 'సభికులు' అనే అదికార్లుండరు. అందుచేతనే సభాపర్వములో ద్యూతవర్ణనమందు ఎక్కడా సభికశబ్దము ప్రయుక్తము కాలేదు. జూదమాడేవారు ద్యూతకృత్తులు, ధూర్తులు, కితవులు. విరాటసభలోకూడా ద్యూతకృత్తులేగాని ద్యూతకారకులు లేరు.

94. పూర్వకాలమందున్న రాజ్యవ్యవస్థను పట్టి ఏర్పడ్డ వ్యహారములో 'సభా' అంటే 'ద్యూతసభ' అనే అర్థముండేది. గనుక 'సభికః' 'సభ్యః' 'సభాపతిః' 'సభాధికారీ' 'సభాధ్యక్షః' పర్యాయ పదములుగా 'ద్యూత' అనే మాట ముందు లేకుండానే వాడుకలో ఉండేవి. ఇప్పుడు 'కలెక్టరు' అనేశబ్దమునకు ముందు 'రెవిన్యూ' అని చేర్చి 'రెవిన్యూ కలెక్టరు' అననక్కరలేదు. కలెక్టరు అంటే, బిల్ కలెక్టరని యెవరూ అనుకోరు ఆ ప్రకారముగానే సభిక శబ్దమునకున్ను సభాపతిశబ్దమునకున్ను ద్యూతసభతోగల సంబంధముచేత 'ద్యూతకారకాః' అనే అర్థము వచ్చినది ఆ అర్థము సభికశబ్దమునకుమాత్రము అమరుడు చెప్పినాడు. "సభా(ద్యూతసభా) ఆశ్రయత్వేనా_స్త్యస్యేతిసభికః"అని ఒకరు, 'సభా (ద్యూతమ్) ఆశ్రయత్వే నా_స్తస్యేతి సభికః' అని ఒకరు, 'ప్రీహ్యాదిత్వాత్ఠన్' అని ఒకరు, 'వికార సంఘేతిష్ఠికః' అని ఒకరు.

'ద్యూతంకారయతీతి ద్యూతకారకః షణన్తాత్ స్వార్థేకః' అని ఒకరు— ఇట్లు లక్షణము చెప్పినారు. సభిక శబ్దమునకు 'సభీకః' అని శబ్ద రత్నావళిలో రూపాంతర మున్నది. 'సభ్యః' అంటే 'సభికః' అనే అర్థముగూడా ఉన్నదని జటాధరుడు చెప్పినాడు. శబ్దకల్పద్రుమములో 'సభాపతిః = సభికఃద్యూతగృహ స్వామీ' అని ఉన్నది. ఆప్టే (Apte) గారి ఇంగ్లీష్-సంస్కృత కోశమందు 'Courtier' అంటే సభ్యః, 'సభిక' అని కూడా ఉన్నది. శబ్దరత్నాకరములో 'మెంబరు=సభికుడు' అని ఉన్నది. సభ్యసభిక శబ్దములు సమానార్థకము లయి నట్టే కదా.

95. సభా శబ్దమునకు ద్యూతమనిన్ని ద్యూతసభ అనిన్ని ఏభాషలో వ్యవహారమున్నదో, ఆ సంస్కృత భాషలోనే సభిక శబ్దమునకు 'ద్యూత కారకః అనే అర్థము రూఢమయిన దని చెప్పడము యుక్తము; గాని, సత్స మాజార్థమందే సభాశబ్దవ్యవహారము గల తెలుగుభాషలో .సభా శబ్దమునుండి పుట్టిన సభిక శబ్దమునకు తత్సంబంధమువల్ల కలిగిన సభ్యార్థము నిషేధించి, తెలుగువారి వ్యవహారములో సభాశబ్దమునకు లేని అర్థము విధించుట కేవలము అయుక్తము; అందువల్ల లోక వ్యవహారమునకు విరుద్ధమయి పండితుల భాష హాస్యాస్పదమవుతుంది. 'పండితులను సభికులారా' అని ఎవరైనా సంబోధిస్తే, తమ్మును నిందించినారని వారనుకోవడము; పండితులు జూదమాడేవారిని 'సభికు లారా, అని సంబోధిస్తే, లోకులు నవ్వడము—ఇంతే ఫలము తెలుగుభాష వేరు, సంస్కృతభాష వేరు. తెలుగు ఇప్పుడు ప్రజల వాడుకలో ఉన్నది. సం స్కృతము గ్రంధాలలో మాత్రమున్నది. సంస్కృత శబ్దములు తెలుగులో చేరిన తర్వాత తెలుగువారి వాడుకను పట్టే వాటి అర్థము, ప్రయోగము నిర్ణ యించవలెను; గాని, సంస్కృత భాషాలక్షణమును పట్టి నిర్ణయించ వల్లకాదు. యజ్ఞములు చేసేకాలములో యజమాన శబ్దమునకు 'యజ్ఞము చేస్తూ ఉన్నవాడు' అనే అర్థమే ఉన్నది. ఆ శబ్దము విశేష్యము కాదు. యజ్ అనే క్రియయొక్క శత్రర్థకరూపము, యజ్ఞాలు నామావశిష్ట మయినతర్వాత 'యజమానః' అంటే గృహపతిః అనే అర్థము వచ్చినది. తెలుగులో 'యజమానులు' అంటే గృహ పతులు అనే అర్థమేకాక, సేవకులకు స్వాములు, అధికారులు మొదలుగా గల మరికొన్ని అర్థములు పుట్టినవి; బహు వచనరూపము యజమానులుగా నున్నం దున, తెలుగుభాషావ్యవహార వాసనచేత ఇకారాంతశబ్దమని భ్రమపడి ఆ పండి తులు 'యజమాని' అని ఏకవచనరూపము ఊహించి, వాడుకలోనికి తెచ్చినారు. 'యాజమాన్యము' అనే శబ్దము ఇప్పుడు వాడుకలో ఉన్నది 'మహమ్మదల్లీ సాయబుగారి యాజమాన్యము క్రింద నొక సభ జయప్రదముగా జరిగెను' అని పత్రికలలో వ్రాస్తున్నారు. ఇట్లే తెలుగువారి వాడుకలో ఉన్న సంస్కృత

శబ్దాలు వేనవేలు రూపమందుగాని, అర్థమందుగాని, రెంటియందునుగాని ఏదో మార్పుచెంది ఉన్నవి. గ్రంథములలో కొన్ని దూరినవి, కొన్ని వ్యవహారములో మాత్ర మున్నవి. పాణిన్యాదుల అనుశాసనము చొప్పున వాటి రూపము లేదని, కోశకారులు చెప్పిన అర్థములకు విరుద్ధమని, సంస్కృత భాషాపండితులు నిందించి, సంస్కృతములో ఉన్నట్టు తెలుగులో వాడమంటే చెల్లుతుందా? భాషాతత్త్వము బోధపడ్డ పండితులు ఇట్టిపని తల పెట్టుదురా? వాడుకమారుతూ ఉంటుందని తెలిసినవారు గనుక, వాడుక ఏలాగు ఉంటే అలాగే శబ్దాలకు అర్థము చెప్పుకోవలసి ఉంటుందనేగదా 'తదశిష్యం సంజ్ఞా ప్రమాణత్వాత్' (1. 2. 58), 'లుబ్యోగా ప్రఖ్యానాత్ (1. 2 54). యోగప్రమాణేచ తదవావేం దర్శనంస్యాత్ (1. 2. 55), ప్రధాన ప్రత్యయార్థవచన స్యాన్య ప్రమాణత్వాత్ (1-2-57) కాలోపసర్జ నంచతుల్యమ్ (1. 2, 57) అనిచెప్పి నియమాలు చేయడము మానివేసినారు పాణిన్యాదులు"

95 ప్రతిభాషలో నున్న అన్య భాషాశబ్దములు ఎక్కువగానో తక్కువగానో చేరిఉంటవి. వేరువేరు భాషలు మాట్లాడే జనులు పరస్పర సంబంధము కలవారైతే, ఒక భాషలోని మాటలు మరిఒక భాషలో కలియక తప్పదు, అన్యభాషా గ్రంథములు చదువుకొన్నవారు ఆభాషలోని శబ్దములు తమ భాషలోనికి చేర్చుకోవడమునకు అనేక కారణము లుంటవి. అట్లా చేర్చుకొన్న శబ్దములు లౌకిక భాషలో నుండక, కేవలము గ్రంథస్థమయి ఉంటే, అవి వాస్తవమైన దేశభాష (అనగా పండితపామర సామాన్యముగా దేశస్థులు వ్యవహరించేభాష) లోనివని చెప్పకూడదు. అన్యదేశ్యములయినా, లౌకిక భాషలో చేరినవయితే, అవి గ్రంథమందున్నా, దేశస్థులకు దేశ్యపద ములవలెనే పరిచితమయి ఉంటవి దేశభాషా పండితులు లెస్సగా విమర్శించి దేశభాషలోనున్న ప్రతి శబ్దమునకున్న వ్యుత్పత్తి నిరూపించి, ఇది దేశ్యము, ఇది అన్యదేశ్యము, అని ఏర్పర్చగలరు, గాని, ఇతరులందరూ లోక వ్యవహా రములో ఈ భేదము తెలుసుకోకుండానే, తెలిసినా, పాటించకుండానే, భావ బోధకముగా ఏమాట ఏవేళకు స్ఫురిస్తే ఆమాటే వాడుతారు. ఏ భాషనుండి ఏ శబ్దము తమ భాషలోనికి వచ్చినదో, కనుక్కొని, ఆభాషలో ఆ శబ్దము యొక్క తత్వము ఏమిటో తెలుసుకొని, ఆ తత్త్వము చొప్పున ఆ శబ్దము యొక్క రూపము, అర్థము, ప్రయోగము బోధపర్చుకొని, అన్యదేశ్యములు వాడవలెనని నియమముంటే, పండితులకయినా, నాలుక కదలదు సరేకదా, కలమయినా నడుస్తుందా? మన తెలుగుభాషలో ఉన్న శబ్దములు తెలుగుమాటలే కాక, సంస్కృతము నుండి వచ్చిన తత్సమాలు, పాళీ మొదలయిన ప్రాకృత ములనుండి వచ్చిన తద్భవాలు, అరవము కన్నడమునుండి వచ్చిన అన్య

ద్రావిడములు, హిందూస్తానీ, ఇంగ్లీషు, ఫ్రెంచి, పోర్తుగీజు, మలై మొదలయిన వాటినుండి వచ్చినవన్నీ కలవుగదా, ఈ చెప్పిన భాషలన్నీ అభ్యసించడమునకు తగిన ఓపిక భాషాతత్త్వాన్వేషణమందు అభిలాష కలవారికి ఉంటే ఉండేనిగాని, సంసారములో ఈదులాడే అందరికీ ఉంటుందా? అంత ఓపిక ఉన్నవారికయినా, ఈ చెప్పిన అన్నిభాషలలోనుండి వచ్చిన శబ్దముల తత్త్వము నిరూపించడము సాధ్యమా? అది సాధ్యమయినా లోక వ్యవహారమందు సిద్ధమయి స్థిరపడి ఉన్న శబ్దముల రూపమున్ను అర్థమున్ను సంబంధమున్ను ప్రయోగమున్ను తాము నేర్పిన తెలుగు శబ్దతత్త్వమునకు విరుద్ధముగా కనబడితే, దిద్ది వ్యవహారము మార్చడము సాధ్యమా? తాము నిరూపించిన తత్త్వము తాము గాని ఇతరులుగాని పునర్విమర్శము చేసినప్పుడు తప్పని తెలిస్తే, తిరిగీ లోక వ్యవహారము మార్చవలసి వస్తుందే! ఈలాగున లౌకికభాష 'సంస్కరించడమునకు ఏదేశమందున్నూ ఎవ్వరున్నూ ఎప్పుడున్నూ పూనుకోలేదు. బాగా ఆలోచించుకొంటే అది పిచ్చిపని అని బోధపడక మానదు.

96. సంస్కృత భాషాపాండిత్యముకల తెలుగు పండితులు సంస్కృత శబ్దముల లక్షణ మెరిగినవారు గనుక అవిమాత్రము ఆ లక్షణము చొప్పున వాడగలరేమోకాని, వాటివలెనే తెలుగులోనికి వచ్చిన సంస్కృతేతర భాషా శబ్దములు ఆయా భాషల లక్షణము చొప్పున వాడగలరా? అసలు అట్టి శబ్దములు యేయే భాషలనుండి తెలుగులోనికి వచ్చినవో తెలుగు పండితులు చెప్పగలరా? కోశాలలో అట్టి శబ్దముల వ్యుత్పత్తిని గురించి వ్రాసిన వ్రాతలలో చాలా తప్పులున్నవే. ప్రాకృత భాషలనుండి వచ్చిన శబ్దములు అయినా వ్యుత్పత్తి సరిగా తెలియక అన్నీ 'వైకృతము' అని చెప్పి ఊరుకుంటారే. ఐతే, సంస్కృతేతర శబ్దములన్నీ—ప్రాకృతభవములుకానీ, అన్యదేశ్యములు కానీ, దేశ్యములేకాని తెలుగుభాషలో ఏకాలమందు ఏలాగున తమ సహచరులు వాడుతారో, ఆకాలమందు అలాగుననే పండితులుకూడా వాడక తప్పదు. అన్యదేశ్యములు అన్యదేశ భాషా లక్షణమునకు విరుద్ధమయినప్పుడు ఆయా భాషల లక్షణము ఎరిగినవారు తప్పు పట్టితే, తెలుగు పండితులు ఏమి సమాధానము చెప్పుతారు? 'అన్యదేశ్యాలు అనేక భాషలనుండి వచ్చినవి. ఆభాషలన్నిటి లక్షణమున్ను మేము నేర్చుకోలేము. తెలుగులో ఆశబ్దములు ఏరూపమున్ను ఏఅర్థమున్ను కలిగి ప్రసిద్ధముగా ఉన్నవో, అట్లేగాని మరిఒకలాగున వాడలేము, ఆలాగున వాడుట తప్పుకాదు" అనిగదా సమాధానము చెప్పవలెను. ఇట్లే ఇంగ్లీషు భాషలోనికి వచ్చిన అన్యదేశ్యాల విషయమై ఇంగ్లీషు పండితులు ఇంగ్లీషు భాషా వివరణములో స్పష్టముగా వ్రాసినారు. ఈ లోకములో ఎన్ని భాష లున్నవో ఇంచుమించుగా అన్నిటిలోని శబ్దాలున్ను ఇంగ్లీషుభాషలో

చేరినవి. అవి ఇంగ్లీషువారు సాధారణముగా ఏ చొప్పున ఉచ్చరిస్తారో, ఏ అర్థమందు వాడుక చేస్తారో, అల్లే సాధువుగా నిశ్చయించు కొన్నారు. ఐతే వాటి వ్యుత్పత్తి నిరూపించినప్పుడు సాధ్యమయినంత శ్రద్ధతో పరీక్షించి ఆయాభాషలలో ఆయాశబ్దములకు గల రూపములున్ను అర్థములున్ను వ్రాస్తారు, ఆ అనుశాసనమునకు వాడుక విరుద్ధముగా ఉంటే తప్పుకాదు. సంస్కృతమునుండి తెలుగులోనికి వచ్చినశబ్దములు తెలుగువారి వ్యవహారములో రూపమందు అర్థమందు మారితే ఆమార్పు అంగీకరించక తప్పదు. అన్యదేశ్యములను గురించి తెలుగు పండితులు చెప్పే సమాధానమే సంస్కృత శబ్దములను గురించి సంస్కృత భాషా లక్షణము తెలియని తెలుగువారు చెప్పగలరు. "ఏశబ్దము సంస్కృతమో, ఏశబ్దము ప్రాకృతమో, ఏది దేశ్యమో. ఏది అన్యదేశ్యమో, ఆచర్చ మాకెందుకు? సిద్ధాంత కౌముదిలోను అమరములోను ఎట్లుంటేమాకేమి? తెలుగున వ్యవహరించే టప్పుడు సంస్కృతము వచ్చినవారున్ను రానివారున్ను ఒక్కలాగునే మాట్లాడుతున్నారు. సంస్కృతము బాగా చదువుకొంటేనేకాని తెలుగు వ్రాయకూడదని నియమించడము అవివేకముకాదా? అట్టి నియమము చెల్లుతుందా? సంస్కృత పండితులయినా, గ్రంథాలలోనే సంస్కృతశబ్దాలు సంస్కృత భాషా లక్షణమునకు విరుద్ధముగా వాడుతున్నారే అని మావంటి వాళ్ళు సమాధానము చెప్పుతారు.

97. సభిక శబ్దము గురించి ఇంతమట్టుకు పీకులాడిన వేంకటరాయ శాస్త్రులవారు సంస్కృతమందు బ్రహ్మాండ నాయకులట గదా! ఇంతోటి సంస్కృతపండితులు తమ కథాసరిత్సాగరములో సంస్కృత శబ్దాలు ఏలాగున వాడినారో చూడండి.

"ఒకరిమీఁద నొకరికి అనుమానము కలిగెను. (పు. 31) వివాహ లగ్నము, ఇప్పుడే నిశ్చయించుటకు ఏమి అభ్యంతరము? (పు 272), మొదటి ప్రతిజ్ఞను జ్ఞాపక పఱిచి (226), గుట్టు బుజావు చేసెదను (276) మహాధనుఁడైన వర్తకుఁడు (84). రత్నవర్తకము (86) నంది అతనిని ఆటంక పఱిచెను (4) శివశర్మమాత్రము నిరాటంకముగా ప్రవేశించెను. (26). ఇతని సంగతి వాసవదత్తచెవికి అంది (74). ఉత్సవము అనేక దినములు జరిగి (నివర్తించినది) (189). ఆశాపము మూడునెలలకు నివర్తించును. (477). ప్రేరేపింప (445). అపదూరు (281). అపనమ్మకము, (797) కుచోద్యము."

ఇవిన్నీ, వీటివంటివి ఇంకా ఎన్నో ఆ గ్రంథమందేకాక వీరు వ్రాసిన తక్కిన గ్రంథములందుకూడా ఉన్నవిన్నీ, తప్పులు అని సంస్కృత శబ్దతత్వమును పట్టి వీరిలాటి సంస్కృత పండితులు కొందరు ఆక్షేపిస్తారే,

ఇవి తప్పులయితే. సఖిక శబ్దము అసాధువని ఆక్షేపించడము గొంగళిలో తింటూ వెంట్రుకలు ఏరినట్లు కాదా? అయితే, మేముమాత్రము ఈ శబ్దములలో లోక వ్యవహారానుసారముగా ఉన్నవన్నీ, సాధువులనే వాదిస్తాము. మేము చెప్పే సమ్జాయిషీ చిత్తగించండి. ఇవిన్ని ఇట్టి శబ్దములు ఎన్ని ఉంటే అన్నిన్ని' సంస్కృతమునుండి వచ్చినా, తెలుగువారి వ్యవహారములో సిద్ధ శబ్దములయినవి సంస్కృతములో వాటికున్న అసలు రూపమున్ను, అర్థమున్ను, ప్రయోగమున్ను సంస్కృత పండితులకయినా సంస్కృత గ్రంథములలో మాత్రమే స్ఫురించును. లోక వ్యవహారములో ఉన్న రూపము, అర్థము ప్రయోగము మాత్రమే తెలుగుభాష వాడుచున్నప్పుడు తటుక్కున మనస్సుకు తట్టుతవి. తెలుగువారిలో సంస్కృతము వచ్చినవారు ఒకరు ఉంటే, సంస్కృతము రానివారు పదివేలమంది ఉంటారు. వారూ వీరూ కలిసి మెలసి, పరస్పర సంబంధము గలవారై ఎల్లప్పుడూ ఒక్క విషయమును గూర్చి ఒక్క విధముగానే భావబోధకముగా వ్యవహరిస్తూఉంటారు, గనుక, సంస్కృతము చదువుకొన్నవారి భాషకున్ను అది చదువుకోని వారి భాషకున్ను వైషమ్యము తగ్గి, సామ్యము స్థిరపడుచుండి. సంస్కృతాలు వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయాది బహువిధముల మారిగదా తద్భవాలయినవి. ఈమార్పు అపండితుల నోటనయిన దనవలెను, గాని, పండితులు తెలియక చేసినదన వల్లకాదే. అపండితుల సంఖ్య ఎక్కువగా సున్నందున వారితోసహవాసము, సంభాషణము అనివార్యమయి, వారివాడుక పండితులకు అలవాటు కాక తప్పదు, పండితులన్నవారు పుట్టేసరికే వారి పూర్వులు వ్యవహారముకోసము లౌకికభాష తయారుచేసి ఉంచినారు. పుట్టినది మొదలుకొని వారు ప్రతి దినము, ప్రతి క్షణము అదే వాడుచున్నారు. 'అపండితులు' అంటే హీనజాతుల వారని తలచ కూడదు. అగ్రవర్ణముల వారిలోనే, తగు మనుష్యులన్న వారిలోనే, శిష్టులన్న వారిలోనే, పండితుల బంధువులలోనే, వారి కుటుంబమువారిలోనే, సంస్కృత భాష బాగా అభ్యసించని వారున్నారుకారా? వారే అపండితులని మా అభిప్రాయము. ఏ భాషలోనుండి వచ్చినవయినా దేశభాషలోని మాటలన్నీ దేశములోనున్న అగ్రవర్ణముల వారినోటనే నలిగి, వ్యవహార యోగ్యమయి, సాధుత్వము పొంది, సంస్కార నిరూపణమునకు తగి ఉంటవి. లౌకిక భాషలన్నీ ఇట్లే ఏర్పడ్డవి. ఇట్టి లౌకిక భాషకే ఒక దానికి పాణిన్యాదులు శబ్దాను శాసనము చేసినారు. అదే సంస్కరణము. ఇక వేంకటరాయ శాస్త్రులవారు వాడిన అనుమానాది శబ్దములు, కుండలికరణము చేసిన 'నివర్తించినది'తప్ప, లౌకిక వ్యవహారానుసారముగా ఉన్నవి; గనుక, సాధువులు. నన్నయ మొదలుకొని కవులందరూ ఇట్టి శబ్దములు వాడుతూ ఉన్నారు.

'పృషతు పరోక్షంబున, (ఆది 4. 218) అంటే 'పృషతుడు చనిపోయిన పిమ్మట' అని అర్థముగదా, సరిగా ఇట్లు పరోక్ష శబ్దము సంస్కృత గ్రంథ ములందున్నదా ? ఎట్టి ఘట్టములను, నెట్టి యాపదలను, నెట్టి తీరములను ముట్టఁబడిన వంతలెల్లఁబాయు (ఆది 4 83) అనే వాక్యములో నన్నయ వాడి నట్లు ఘట్టశబ్దము సంస్కృతములో వాడుదురా ? శ్రీనాథుడు భేషజమనే శబ్దము మోసమనే అర్థమందు హరవిలాసము (3, 90) లో వాడినాడుగదా: ఈ శబ్దమః ఈ అర్థములో వ్యవహారిక భాషలో తెలుగువారు వాడుతున్నది గాని సంస్కృతమం దున్నదా ? తిక్కన 'అనుమానము' అనే శబ్దము సందే హార్థ మందు ప్రచురముగా వాడి ఉన్నాడు, (చూ విరాట 1. 260. 2. 102, 268) అయితే సంస్కృత నిఘంటువులో అనుమానమ్—అనుమితి కరణం, అనుమితిః అనుమా, వ్యాప్తి విశిష్టపక్ష ధర్మతాజ్ఞాన జన్యజ్ఞాన మనుమితిః' అని ఉన్నదిగాని 'సంశయము', సందేహము అని లేదే. తిక్కన కాలమందు మన కాలమందున్నట్లే, తెలుగువారి లౌకిక వ్యవహారములో అనుమాన శబ్దము నకు సంస్కృతమందు లేని ఈ అర్థ మున్నందున, ఆ శబ్దము సంస్కృత భాషలోని దైనా, తెలుగువారి వాడుక ప్రకారమే సంశయార్థమందు భారతమున ప్రయోగించి, ఆ శబ్దము నుండి తెలుగున పుట్టిన క్రియా రూపము 'అనుమా నించు' (చూ. విరా 2. 34) కూడా యథేష్టముగా తన గ్రంథమున వాడి, తెలుగుభాష స్వతంత్రమైనదనిన్ని తెలుగు కవులకు లోక వ్యవహారమే ప్రమాణ మనిన్ని అతడు ఉపదేశించినవాడయినాడు. శబ్దరత్నాకరములో 'దీని నీ యర్థమునఁ గొందఱు దేశ్యమని చెప్పి యున్నారు' అని ఉన్నది ? అంటే తాత్పర్య మేమి ? ఈ శబ్దము సంస్కృతభాషలోనిదే కాని, దానికీ అర్థము ఆ భాషలో లేదు, అర్థమును పట్టి శబ్దాల జాతులు ఏర్పర్చవలసి ఉంటే, ఈశబ్దము దేశ్యముగా వర్గీకరణము చేయవలెను' అనిగదా ? సరే, అలాగున చేయగోరే వారు అలాటి శబ్దాలు దేశ్యములలో చేర్చుకోవలెనుగాని అసాధువులని నిరాక రించకూడదు. గనుకనే శబ్దరత్నాకరములో సభిక శబ్దమునకు (1) సభయందు ధర్మజ్ఞుడు; (2) జూదమాడించువాఁడు (3) న్యాయవాది. అని మూడర్థములు చెప్పినారు, రెండవ అర్థము మాత్రమే అమరములో ఈ శబ్దమున కున్నది; తక్కిన రెండర్థములు తెలుగులో ఈ శబ్దమునకు వచ్చినవి. వచ్చినవాటినే పారదోలడము ఎవరికీ శక్యము కాదు, వాటిని ఉపేక్షిస్తే వ్యవహారహాని కలు గుతుంది. వివక్షితార్థము చెప్పడమునకు వ్యవహారములో ఉన్న శబ్దము మాను కొని, వ్యవహారములో లేని శబ్దము వెదకి తెచ్చుకోవడము వృథా ప్రయాసమే గాని, సార్థకము కాదు, గనుక అట్టి పని అవివేక మనిపించుకొంటుంది. తెలుగు నిఘంటువునందు, కావలసివుంటే, ఈ అర్థమందిది దేశ్యము. అని

తెలియజేయ వచ్చును. వేంకటరాయ శాస్త్రులవారే నిఘంటు నిర్మాత లయితే, సీతారామాచార్యులవారు చెప్పిన అర్థములు నిరాకరింతురు గాబోలు! శబ్దరత్నాకరమందు ప్రయోగము ఉదాహరించక పోవడము లోపమే. ప్రాచీన కావ్యములలో ప్రయోగము ఉండగా అవి ఇయ్యక ఉత్తరాంధ్ర కావ్యములలోనివి ఇవ్వడముకూడా లోపమే. అనుమాన శబ్దమునకు సందేహార్థమందు కవికర్ణ రసాయనములోనిది ఒక్క ప్రయోగము మాత్రమే. శబ్దరత్నాకరమందు ఉదాహృతమయి ఉన్నది. అందుచేతనే కాబోలు, ఉత్తరాంధ్ర భాష ఉపేక్షించి, ప్రాచీనాంధ్ర భాష మాత్రమే వాడులామని దీక్ష పట్టిన * శాస్త్రులవారు రమ కథా సరిత్సాగరము మొదటి కూర్పులో అనుమాన శబ్దము లౌకిక భాషలో ఉన్నట్టుగానే సందేహార్థమందు వాడి, రెండవ కూర్పులో ఆశబ్దము తీసివేసి, దానికి బదులుగా 'సంశయ' శబ్దము దూర్చి తప్పు దిద్దుకోవడము సంభవించి నది. అట్టివారు జంకుకళంకు లేని కవిచంద్రు లనిపించుకొంటారా? ఆ శబ్దము ఆ అర్థమందు వాడుక చేయడములో 'కళంకు' ఉన్నదని 'జంకు' పుట్టక పోతే ఉత్తనే ఎందుకు సవరణ చేసినారు? మాటలు సరిగా వాడడము చేతకాక పండితులు తప్పుపట్టి ఆక్షేపిస్తారేమో అని దిగులుపడుతూ, "అయ్యవారేమిచేస్తు న్నారు? అంటే, తప్పులు దిద్దుకొంటున్నారు." అన్నట్లు మాటిమాటికిశబ్దాలు మార్చుకొనేవారు పిరికి పండితులు గాని "జంకు కళంకులేని కవిచంద్రులు" ఎన్నటికిన్ని కారు. ఈ అనుమాన శబ్దమును కవిబ్రహ్మ కాపాడుతున్నాడన్న జ్ఞానముంటే, స్వపాండిత్యమందు విశ్వాసము లేకపోయినా, శాస్త్రులవారి కీ జంకు పుట్టకపోవును. ఒక్క తిక్కననే కాదు, అతని తర్వాతివారు మహా కవులు చాలామంది ఈ శబ్ద మిట్లు వాడి ఉన్నారు. వీరందరి గ్రంథాలలోను కనబడుతూ ఉన్న ఈ శబ్దము, తమ గ్రంథము మొదటి కూర్పులో కనబడి, రెండవ కూర్పులో అంతర్ధాన మయినంతమాత్రాన, లోకములో లేకుండా పోతుందా? గ్రాంథిక భాషనుండి బహిష్కృత మవుతుందా? ఈ శబ్దము వాడిన కవులందరికన్న శాస్త్రులవారు గొప్పవారయిపోతారా? వీరి గ్రంథము మొదటి కూర్పు మాత్రమే చదివి, రెండవ కూర్పు చూడని వారికి ఈ శబ్దము వీరి కిష్టమయినదని తోచదా?

98. తమ కథా సరిత్సాగరము మొదటి కూర్పులో శాస్త్రులవారికే తప్పులుగా తోచి రెండవ కూర్పులో దిద్దుకొన్న మాటల సంఖ్య 'ఎక్కువ'

---

* 'వలన'కు రూపాంతరమని శబ్దరత్నాకరమందు ఆంధ్ర కవిరాపితామహుని ప్రయోగ సహితముగా ఉదాహృతమయి ఉన్న 'వల్ల' వాడినందుకు వెంకటరత్నం పంతులవారిని శాస్త్రులవారు దూషించినారు. (చూ క్రింది పేరా 'వల్లబెల్లము'.)

'దాహం', 'శతం' దాటి సహస్ర స్థానమునకు ఎక్కుతుంది. ఇవిన్ని అంతకు పూర్వము వీరు వ్రాసిన గ్రంథములలో కొన్ని తెలుగు మాటలున్న చూస్తే ఇట్టి తెలుగు వ్రాసినవారు తెలుగు పండితులని ఎట్లా పేరు పొందినారో గదా అని ఆశ్చర్యము కలుగుతుంది. వీటిని ఈ వ్యాసము మూడవ భాగములో వివరిస్తాము గాని ఇక్కడ అనుమానము వంటి మరి ఒక శబ్దమును వాడటములో శాస్త్రిలవారు పడ్డ పాట్లు చెప్పి ప్రస్తుత మనుసరిస్తాము. కథా సరిత్సాగరములో అనుమాన శబ్దము వాటినట్లే అభ్యంతర శబ్దము వాడినారు. రెండవ కూర్పులో మొదటిది దిద్దుకొన్నట్లే, రెండోదికూడా దిద్దుకొని దానికి బదులుగా ఆటంక శబ్దము వాడినారు అభ్యంతర శబ్దము శబ్దరత్నాకరమందున్నది. దానికి చెప్పఉన్న అర్థములలో మూడవది 'ఆటంకము' సంస్కృతములో ఆతంక శబ్దమున్నదిగాని ఆటంకశబ్దము లేదు, దానికున్న అర్థములలో శంక భయము అనేవి చేరిఉన్నవి 'నిరాతంకముగా' అంటే 'శంక లేకుండా' 'భయము లేకుండా' అని అర్థము. సరిగా ఈ అర్థములో మొదట పండితులు ఈ శబ్దమునేవాడి ఉంటే, అది అపండితులనోటను 'నిరాటంక' మయి, 'అడ్డము లేని'దనే అర్థము పొందినది. ఆటంక శబ్దము సంస్కృతముగా పండితులు అంగీకరించక, తెలుగులో సాధువని ఒప్పుకొని, కొందరు దేశ్యమని, కొందరు తద్భవమని అంటారు. శబ్దరత్నాకరములో ఆటంకశబ్దము దేశ్యమని ఉన్నది. ఇట్టి దేశ్యమైతే వేంకటరాయశాస్త్రిలవారు 'నిరాటంకముగా' (చూ. 26, 83) అని చాలామాట్లు ప్రయోగించి, రెండవ కూర్పులో దిద్దకుండా విడిచి పెట్టినారే, సంస్కృతమందున్న కొన్ని శబ్దాలలోని తకారము రూపాంతరములలో టకారముగా నున్నది , గాని 'ఆతంకము' అట్టి శబ్దములలో చేరి ఉన్నట్టు మాకుతెలియదు, పండితులు కొందరు అసాధువనే 'నిరాటంకముగా' అనేది వాడుటకు 'జంకులేని కవిచంద్రులు' అభ్యంతర శబ్దము తప్పనుకొని, జంకి దిద్దుకొన్నారుగాని, తాము మెచ్చుకొన్న ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో మ. శ్రీ జయంతి రామయ్య పంతులువారు అభ్యంతరమనేకాక 'నిరభ్యంతరముగా అని కూడా నిరాటంకముగా వాడుతున్నారు. (చూ. 2. పు. 97). అన్నట్టు చెప్పవచ్చి మరచిపోయినాము. కథా సరిత్సాగరము రెండవకూర్పు అచ్చుపడ్డది గనుక అభ్యంతర శబ్దము అందులో దిద్దుకొనుటకు అవకాశము దొరికినదిగాని ఆంధ్ర ప్రసన్నరాఘవ విమర్శములోనే 318 వ పుటలో 16 వ పంక్తిలో 'వాని కవిగల్గుట కేమభ్యంతరము' అనే వాక్యములో అభ్యంతరము స్పష్టముగా కనబడుతున్నది. ఆ పుస్తకములో ఆ వాక్యము చూచిన మా వంటి వాళ్ళము ఈ శబ్దము శాస్త్రిలవారి కిష్టమని తలంచుట తప్పా ? వీరు బృహదాంధ్ర నిఘంటు నిర్మాతలై యుంటే ఈ శబ్దమున కీ యర్థము చెప్పుదురా ?

శబ్ద రత్నాకరములో లేనివీ, కేవలము వాడుకలో మాత్రమున్నదీ గదా 'కుచోద్యము' అనే శబ్దము ? ఇది కన్నడ కోశములో తత్సమముగా 'మోసము' అనే అర్థము కలిగి ఉన్నట్టు కనబడుతున్నది బ్రౌన్ దొరవారి నిఘంటువులో 'కుచోద్యగాడు' మొదలయిన వాడుక మాటలుండుట వింతకాదు. ఈ శబ్దము కథా సరిత్సాగరములో 'నేనుచేసిన కుచోద్యమెఱిఁగి నన్ను శపించెను.' (చూ. 624) అనే వాక్యమందు శాస్త్రిలవారు ప్రయోగించినారు. ఇది సంస్కృత మయితే, ఆప్టేగారి కోశములోగాని శబ్దకల్ప ద్రుమములోగాని చేరలేదేమి ? కోశాంతరములలో ఉన్నదేమో ? మేము చదివిన సంస్కృత పుస్తకములలో గాని తెలుగుపుస్తకములలో గాని ఇది ఉన్నట్టు మాకు జ్ఞప్తియందు లేదు. సిద్ధ శబ్దమని అభిమానముచేత వ్యాకరణ సూత్రాలు నలిపి, తెంపి, ముళ్ళువేసి దానిని సాధువుగా సాధిస్తారా ? ఇది సాధువుగా తెలుగుగ్రంథములో వాడుటకు జంకులేనివారు సధిక శబ్దము విధవ శబ్దమువంటి దనడమునకు తగిన కారణ మేమోతోచకుండా ఉన్నది. శాస్త్రిలవారిబుద్ధి అలౌకికము. కేవల శాస్త్రాధీనము; గనుక "విధవా" అన్నా "గొప్ప ప్రభువా" అని అన్నట్టే భావించగలరుగాని లోకములో మరి యెవ్వరూ అట్లా భావించరు. అందుచేత మావంటి వాళ్ళకు లోకమే ప్రమాణము అయితే విధవ శబ్దానకు గొప్పప్రభువనే అర్థము సాధించ గల శాస్త్రము లోకవిరుద్ధ మయినది, గనుక అది లోకానికి ప్రమాణము కాదు. లోకవిరుద్ధ మయినా శాస్త్రమే పండితులకు ప్రమాణము గనుక వారే దానినిపట్టి అన్ని కర్మలు అనుష్టించ వలసినవారు వారి కిష్టమయితే, దోషమును గుణ ముగా సిద్ధాంతము చేయనూగలరు, ఇష్టము కాకుంటే, లోకులందరూ గుణ ముగా గ్రహించినది దోషమని నిరాకరించనూ గలరు. శ్రీనాథుఁడు 'పణినా సత్య' శబ్దమున్ను, పెద్దన 'పణినసూను' శబ్దమున్ను, సంస్కృత భాషా లక్ష ణమునకు విరుద్ధముగా ప్రయోగించిఉన్నా, శాస్త్ర రహస్యములు తెలినవారు గనుక మన శాస్త్రిలవారు 'మహాకవి ప్రయోగములుగాన ప్రామాదికములు గావను విశ్వాసముచే స్థితగరి చింతనగా ప్రక్రియయూహ్యా' మని, నామైకదేశ గ్రహణే నామమాత్ర గ్రహణమ్ అనే న్యాయము చొప్పున 'పణి + నః అంటే పణియొక్క నప్తా, మనుమఁడు" అని సుశబ్దములుగా సిద్ధాంత పర్చినారుకారా? 'వాచాటో బహుగర్హ్యవాక్. అని శాస్త్రాభిధాన ముండగా, శ్రీనాథుఁడు 'వాగ్మి' అనే అర్థమందు వాచాట శబ్దము ప్రయోగిస్తే సహించినారుకారా ? సీతారామా చార్యులువారు గ్రామ్యమన్న అవధారు శబ్దము శ్రీనాధుని నైషధమందు కనబడి నప్పుడు శాస్త్రిలవారు దానికి ప్రక్రియ చెప్పినారుకారా ? 'తల్లమాంబ' వంటి శబ్దములు అహోబలుడు తప్పని దూషిస్తే 'పెద్దనాది మహాకవులును ఇట్టి ప్రయో గములు చేసియున్నారు; కాన వీనికి గతినరయుట యుచిత' మని సమాధానము

కల్పించినారుకారా ? వారణాసి అని శ్రీనాధుడు లౌకికరూపము ప్రయోగిస్తే 'వారాణసి' అని శాస్త్రవిహితమైన శబ్దమునకు విరుద్ధముగా ఉన్నా, తద్భవము గానోపునని అంగీకరించినారు కారా? ఇటువంటివి ఎన్నో ఒప్పుకొన్నవారు 'నిషధేశు బచ్చుకున్' అని నైషధములో శ్రీనాధుడే ప్రయోగిస్తే. 'జఘన్య ప్రయోగ'మని నిందించినారే ; శ్రీనాధుడు నైషధములోనే 'పసుపుకు' అనిన్ని 'పిచ్చుకుంటుకు' అనిన్నీ ప్రయోగించినాడు. అనేక కవులు ప్రయోగించిన రూపములు ఇట్టివి వేలకొలదిగా ఉన్నా. శాస్త్రిలవారి కిష్టములేదు గనుక సీతా రామాచార్యులవారు వీటికి చెప్పిన సమాధానము నిరాకరించి నిందించినారు. తమకు ఇష్టమయితే, మహాకవుల ప్రయోగములు ప్రామాదికము లనకూడదు ; వాటికి 'గతినరయుట యుచితమంటారు , ఇష్టము కాకపోతే, మహాకవి ప్రయోగములు వేనవేలున్నా జఘన్యాలంటారు ' ఏమి చెప్పను ? వారి న్యాయము మాకు అయోమయము

99. వేంకటరాయ శాస్త్రిలవారు అంగీకరించినా, అంగీకరించక పోయినా, మాకు యుక్తమని తోచినట్లు ఈ శబ్దమును గురించి మేము సిద్ధాంతము చేసుకొంటున్నాము. ఈ శబ్దము లోకములో సభ్యార్థమందే శిష్టులు వాడుతున్నారు. సభాశబ్దమునకు ద్యూతమని కాని ద్యూతశాల అనికాని తెలుగులో అర్థము లేనేలేదు గనుక, సభికశబ్దమువలన ద్యూతముతో సంబంధించిన భావము ఏదీ స్ఫురించదు. తెలుగులో 'సభా ; శబ్దమునకు శిష్టులుగల పరిషత్తే అర్థము , గనుక సభికశబ్దముచేత దానితో సంబంధించిన సభ్యభావమే స్ఫురిస్తుంది. ఈ వాడుకను అనుసరించే నేటిపెద్దలు గ్రంథములలో ఈశబ్దము ప్రయోగిస్తున్నారు. విజ్ఞానేశ్వరీయ మను ధర్మశాస్త్రమునకు ఆసూరి సరస్వతీ తిరువేంకటాచార్యులవారు రచించిన "వ్యవహారకాండ తాత్పర్య బోధిని" అనే ఆంధ్ర టీకలో "బ్రాహ్మణోత్తములను ముగ్వురనైనను అయిదుగురనైనను ఏడ్వురనైనను, తన సభయందు సభికులనుగా నుంచుకొనవలయును; ఈనియుక్త సభికులు ప్రభువు న్యాయ వ్యతిరిక్తముగా తీర్పుసేయు నెడల అట్లుకాదని నిరాకరించి న్యాయప్రకారము తీర్పు సేయింపవలయుననియు అట్లు చేయనియెడల నియుక్త సభికులకు దోషము సంభవించును. ప్రాడ్వివాకుం డనఁగా వాది ప్రతివాదులను ప్రశ్న చేసినవారు చెప్పెడి మాటలలో ఇది విరుద్ధం బిదియవిరుద్ధం బని సభికులతోఁగూడి నానావిధములుగా విచారించువాఁ డని యర్థము." ఇట్టివి అనేకప్రయోగములున్నవి

ఆరేండ్లక్రిందట యూనివర్సిటీవా రేర్పరచిన కాంపోజిషన్ కమిటీలో మన శాస్త్రిలవారుకూడా సభికులలో ఒకరుగా ఉండి, నిర్దుష్టమైన ఆంధ్రభాషకు ఆదర్శములనతగిన గ్రంథములని కొన్ని అంగీకరించి పేర్కొన్నారు. వాటిలో

నుండి ఉదాహరించిన ప్రయోగములు శాస్త్రిల వారు అంగీకరించవద్దా? (1) చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి మహాపురుషుల జీవితములు. సభికుఁడు (చూ. పు. 8, 9, 11, 13); సభికులు (పు. 17) సభికత్వము (68); (2) లక్ష్మీకాంతరావుగారి చీనాదేశపు చరిత్ర—సభికులు (139, 206, 218, 224), (3) వారి అశోక చరిత్రము—సభికులు (6, 281). (4) లక్ష్మీనారాయణగారి అక్బరుచరిత్ర—సభికులు (9, 12, 15, 28, 40), (5) సీతారామ శాస్త్రిలవారి కథలు—సభికులు (63). (6) గురజాడ శ్రీరామమూర్తిగారి కవి జీవితములు-సభికులు(174, 222)ఈశబ్దము అన్నిటిలోనూ సభ్యార్థమందేఉన్నది. ఇట్లు గ్రంథములందే కాక, ఆంధ్ర పత్రిక, కృష్ణాపత్రిక మొదలయిన సుప్రసిద్ధ పత్రికలలో తరుచుగా ఈ శబ్దము కనపడుతున్నది. శాస్త్రిలవారు నిర్దుష్టమైన భాష గలదని మెచ్చుకొన్న ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటితమయిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు పరీధావి సంవత్సర కార్య నివేదనమందే, "పాఠశాలలలో గ్రామ్య గ్రంథములు చదివింపకుండునట్లు సభికు లేకగ్రీవముగా నిశ్చయించిరి." అనే వాక్యములో సభ్యార్థమందే సభిక శబ్దము ప్రయుక్తమయి ఉన్నది. ఈ చెప్పిన సభికులలో చేరినవారే అయినా శాస్త్రిలవారు పల్లెత్తు మాటయినా, అప్పుడుకాదు ఎప్పుడయినా, అనలేదు. మ. పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులవారి 'సాక్షి' అనే గ్రంథమందు నాటకము చూడవచ్చిన వారిని ఉద్దేశించి 'సభికులు' సభ్యార్థమందు వాడినారు (చూ. పుట 185) ఈ కవిగారి భాష నిర్దుష్టమయినదని మ. కూచి నరసింహం పంతులవారు ప్రమాణీకరించినారు.

100 పైని ఉదాహరించిన వాక్యములు వేంకటరత్నము పంతులవారి వంటివారు ఆధునికులు వ్రాసినవి; ప్రమాణము కావంటే, పూర్వుల గ్రంథములలోనుండి కూడా ప్రయోగములు ఉదాహరించగలము. ఆదికవీశ్వరుడు నన్నయభట్టు ఆది. 2. 132 సీ. గీ. లో 'భక్ష్యభోజ్యలేహ్య పానీయములమీఁద సభికులైన విప్రజనులమీఁద' అని వ్రాసినట్టు కొన్ని తాటాకు పుస్తకములలో పాఠము మేము చూసినాము. వావిళ్ళవారు అచ్చువేసిన పుస్తకములలో కూడా ఉదాహృతమయి ఉన్నది. ఉన్నా, అది అప్రసిద్ధమైన పాఠమంటే, తిక్కన విరాట పర్వము 2.76 లో ఉ. "ఈ సభికుల్ గనుంగొనఁగ నిట్లయితిన్ వగ నాకు వింతయే" అనే ద్రౌపదీ వాక్యములో. 'సభికులు' అనే శబ్దము సభ్యార్థమునందు ప్రయుక్తము అని మేమంటాము. కాదు, ఇక్కడ 'సభికులు' శబ్దమునకు 'ద్యూతకారకులు' అని అమరములో చెప్పిన అర్థమేఅంటే అందుకు మా ఆక్షేపము,—విరాటుడు. ధర్మరాజు మొదలయినవారు 'ద్యూతకృత్తులు' గాని 'ద్యూతకారకులు కారు, అమరములో 'ద్యూతకృత్' అని

వేరే శబ్దమున్నది. 'సభికులు' జూదమాడేవారు కానేకారు, (ద్యూత) సభాధికారులు (ద్యూత) సభాపతులు, రాజుచేత నియుక్తులయి నిర్ణీతమైన సుంకము రాజుకు చెల్లిస్తూ, ధర్మశాస్త్రమందు విధించిన ప్రకారము ప్రసిద్ధమయిన ద్యూతశాలలో, వావలసిన సాధనము లుంచి, జూదరులలో గెలిచినవారినుండిసుంకము పుచ్చుకొంటూ, జూదముతో సంబంధించిన తగవులు తీర్చవలసిన అధికారస్తులు ద్రౌపదీ వాక్యములోని సభిక శబ్దమునకు ఇట్టి సభాపతులు అని అర్థము చెప్పవల్లకాదు. 'ద్యూతకృత్తులు' అనే అర్థము సభిక శబ్దమునకు లేదు. మరి ఏ అర్థమైనా చెప్పవలెనుగాని ఈ అర్థము పొందదు. తిక్కన తర్వాతి కవుల వాడుకనుబట్టి చూస్తే, తిక్కనకూడా అట్లే వాడుట సంభావ్య మనవచ్చును. ఇది మా నష్టాయిషీ.

పోతరాజు భాగవతము 4 39. క. చనుదెంచిన యాదక్షుఁడు వనజజునకు మ్రొక్కి భక్తివశులై సభికుల్, దనకిచ్చిన పూజలు గైకొని ' అని తాటాకు పుస్తకములలోని పాఠము (చూ 148) అచ్చులో 'సకుల్' అనే మాటకు బదులుగా 'సభ్యుల్' అని ఉన్నది. ఎవరు దిద్దినారో ? పోనీంది, అచ్చుపుస్తకములో (ఆనంద ముద్రణములోనే) ప్రత్యక్షముగా కనబడుతూ ఉన్న ప్రయోగమొకటి మేము గుర్తుపెట్టుకున్నది ఉదాహరిస్తాము. అది విశ్వసింపక తప్పదుగదా ఇంకా ఉంటవి, వెతికితే కనబడతవని మాకు నమ్మకమున్నది. దీనినిపట్టి పోతననాటినుండి కవులు సభిక శబ్దము సభ్యార్థమందు వాడుతూఉన్నట్టు సిద్ధాంత మవుతుంది.

క. చూ చెదరుగాని సభికులు, నీవిన్న కుమారకులకు నీ మలురకున్
ఓ చెల్ల యీడుగాదని సూచింపరు పతికిఁ దనుకు శోకముగాదె.
(10. పూ. 1350:—)

1. ఉత్తర నైషధము 4. 217.—

క. ఇభయాన యోర్తురత్న ప్రభలీనెడు పీఠమిడిన రాజేంద్రుఁడు ప్రా
గభిముఖముగఁ గూర్చుండెను సభికులు ప్రాసీనులైరి సముచితలీలన్.

(దమయంతీ వివాహ వర్ణనలో నిది. ఈ గ్రంథము బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయశాస్త్రిలవారు పరిశోధించినదట.)

2. ఉత్తరరామా 8 పు. 152:—

క. కొలువుండి యకుమారులఁ బిలిపించి సమీప భూమిఁబ్రీతి వసింపన్
సెలవిచ్చినఁ బ్రతిబింబయుగళము న్వలెనున్న వారిఁగనుఁగొని సభికుల్.

(రాములవారి సభలో కుశలవులు రామాయణము పాడుటను గురించినది)

3. ,, 8 పు. 163:—

క. కులగురుఁడైన వసిష్ఠుని నలఘుమతుల మంత్రివరుల నార్యుల హితులం
బిలిపించి జమునిరాక మొదలుకొని సకలంబుఁదెలిపెఁదత్సభికులకున్.

4. ,, 8 ,, :—

క. ఆ మాటలు విని సభిక స్తోమము విధిచెట్ట యనుచు మూలుఁగి.

5. కృష్ణరాయ విజయము 2. 15 —

శా విద్యారణ్యులనంగ నెవ్వరతఁ దేవిద్యన్ బ్రకాశించె నీ . . తెన్నగా
దెల్పుఁడీ, యాద్యంతంబునటన్నఁ దత్సభికులాహ్లాదంబుతో నుండగన్

6. కాళహస్తి మహా 211.—

తే. ఆదియుఁ దాఁ గాంచి సభికు లాహ్లాదమందఁ
దగవుఁ దలపోసి చిత్తంబు బిగియఁబట్టి
(బ్రహ్మసభలో నున్నవారు 'ఆది' సరస్వతి)

7. జైమిని భారతం 8. 185.—

క. క్రతువులకు నెల్ల హరికర్మకరుఁడు గామి స్వర్గ ఫలమాత్ర మిపుడు
సాక్షాత్కరించి, శౌరియున్నాఁడు మామకాస్యమ్మున ననుచు సభికులకు
జెప్పెనన గృష్ణ సహిత ఋషులు.

8. నారాయణకవి పంచతంత్రము మిత్రభేదము. 551. ఈ పద్యములోని
సభికులు 'ధర్మాధికారు'లని 549.

చ. అని పలుకంగ నా సభికులప్పు డెఱింగి యితండు సెట్టి నీ
యిను మొసఁగుం గుమారుని నిమ్మని వారలు చక్కఁబెట్టినన్
మనమున సమ్మతించి 'తమముందట నా' సభవారు తీర్చి చె
ప్పినగతి నట్లచేసిరని పెంపెసఁగన్ గద సెప్పి యిట్లనున్.
వాయు పురాణము కవుల చరిత్రలో ఉదాహృతము (చూ. పు. 361)

కృతి నాయకుని కొలువుకూటము వర్ణన.

సీ. అతులిత శాస్త్రేతిహాసంబు లొకవంక
నొకవంక దండనాయకగణంబు.

(ఉత్తరార్థము)

గీ. కొలువుకూటంబునందు కలిత వచన
గౌరవము మీఱ సభికులఁ గాంచి పలికె.

9 చిత్రభారతము 5. 59.—

గ. అయిన నీకొక యతి రహస్యంబు గల్గఁ
దెలియఁ జెప్పంగఁ బూని యేతెంచినాఁడ
నిచటి కాంతల సభికుల నెల్ల ననుపు,
మంత్ర భిన్నంబుగాకుండ మానవేంద్ర.

10. రామ స్తవరాజము, 3:—

క. వచ్చిన కాంతామణి గని
యచ్చెరుపడి సభ్యు లెల్ల నానందముతో
ముచ్చటకుఁ జొచ్చి తమలో...

ఈ వచ్చినది ముక్తికాంత, ఈ సభికులు రాజయోగ సామ్రాజ్యాధిపతి సభలో నున్నవారు.

11. చెన్న బసవపురాణము, వీరసంగమయ్య పెండ్లి కథలోనిది:

చ. అని ఎచియింపఁ దత్సభికు లందఱు సంతసమంది బాపురే;
వననిధి మేఖలా వలయవాసి జనంబుల యందు బంధు భా
వన దిలకింప వీరి సరివారలఁ గాంచితిమే యటంచుఁ బె
క్కనుతు లొనర్చి రత్తఱి నకుంఠిత కౌతుక మావహిల్లఁగన్ (4. 85)

12. చెన్న బసవపురాణము, దక్షుని యజ్ఞశాల యందున్న వారిని గురించినది.

సీ. గీ. పాదరక్షలు వదలిన మీఁది కెగసి
యొకటి యాకట్ట హరియించె నొకటి వాని
మోముపైఁబడి బండ్లూడ మోదె సభికు
లెల్ల విస్మయ చిత్తులై తల్లడింప. (5. 318)

101. నన్నయ ప్రయోగము అచ్చు పుస్తకాలలో కనబడ లేదనిన్ని, తిక్కన ప్రయోగమునకు విరుద్ధార్థము చెప్పిన్ని, అవి నిరాకరించినా, అచ్చు పుస్తకాల లోనివే మేము చూపించిన ప్రయోగాలు ప్రమాణముగా శాస్త్రిలవారు అంగీకరిస్తారా? అంగీకరించరా? పరమ భాగవతోత్తముడు, కవిరాజు పోతన్న, భువనభాసురకృతి నిర్మాత, 'వాణినారాణి' అన్నవాడు పినవీరన; దిగ్గజములాటివాడు ధూర్జటిలాటివాడు కుమార ధూర్జటి, ప్రౌఢకవి కంకంటి పాపరాజు, లాక్షణికులకు లక్ష్యము లిచ్చినవాడు తరిగొండ ధర్మన్న; సుప్రసిద్ధుడయిన నారాయణ కవి; విష్ణుభక్తుడు మల్లన, శివభక్తుడు పాపన; వీరందరూ ప్రయోగించినట్టే వేంకటరత్నము పంతులవారు సభిక శబ్దము ప్రయోగించి ఉన్నప్పుడు, అందుకు ఆయనను దూషిస్తే, ఈ చెప్పిన కవి పుంగవులను దూషించినట్టు కాదా? అట్టి పాపమునకు వేంకటరాయ శాస్త్రిలవారు

సాహసిస్తే, సాహసించిరిగాక, వారికి ప్రాపకులుగా నున్న వారును, వారి శిష్యులును వారి అప్తులున్ను, వారి సాహసము కొనియాడితే, కొనియాడిరిగాక; పామరలోకము పరమార్ధము ఆలోచించక గతానుగతికమయి వారిని పొగడితే, పొగడెనుగాక, మేముమాత్రము సహించలేము. మేమేకాదు. మావలె ఇట్టిపని గర్హించేవారు అనేకు లున్నారు. సత్యము తెలిసిన తర్వాత పక్షపాతము లేకుండా మంచి చెడ్డలు ఏర్పరించేవారు లేకపోలేదు తెలుగువారందరూ పండితులు కారంటే ఒప్పుకొంటాము గాని, అవిచక్షణులు అంటే, సమ్మతించము. దురాగ్రహముచేతను, దురభిమానము చేతను ప్రత్యక్షప్రమాణ మున్నా ప్రతిపక్షుల మాట విశ్వసింపక పండితులే కొందరు వివేకము విడిచిపెట్టుట అసంభవము కాదని అందరూ ఎరిగినదే

శ్రీనాధుని ప్రయోగములే అభారత ప్రయోగములని, జఘన్య ప్రయోగములని, చెప్పి నిరసించి పండ్లిగిలించే పండితులు వ్రాసే గ్రంథాలలో వేయింట తొమ్మన్నూట తొంభై తొమ్మిదిపాళ్ళు ఉత్తరాంధ్ర శద్దాలే ఉంటవి భారత భాష బాగా బోధపడక అది వాడినప్పుడు తబ్బిబ్బులు పడుతూనే ఉంటారు. ఉత్తరాంధ్రము వాడమని పెగ్గెలు (పగ్గెలు ?) పలికే అయ్యలు ఉత్తరాంధ్ర కవులుకన్న గొప్పవాళ్ళ మనుకొంటారు గాబోలు. కదపు శబ్దము గ్రంథాలలో వాడుక చేయుటకు వెనుక దీయని ఆంధ్ర పండితులు లౌకిక భాష గ్రామ్యమని నిందించి పరిత్యజించి అభారత ప్రయోగములు ఒల్లమని ప్రగల్భాలు పలికితే, సామాన్యులు మోసపోతారుగాని, వివేకులు నవ్వరా ? వార్తాకము వర్జించ మన్నాడు. ధర్మశాస్త్రములో వంకాయ తిన కూడదు; అలాబు అభక్ష్యము గనుక అనపకాయ నిషిద్ధము, అని అందరికి ఉపదేశించి, ఇంటివద్ద దీక్షితులుగారు వంకాయకూర, అనపకాయ ముక్కలు ములంకాడలువేసిన పులుసు, దేవునికి నైవేద్యము పెట్టితింటూవుంటే ఇంట్లోవాళ్ళుకూడా నవ్వుతారా నవ్వరా ? ఎందుకు వట్టివేషాలు ? భేషజాలు ? కదపు (కదుపు) శబ్దము ప్రాచీనగ్రంథాలలో చూచినట్టు మాకు ఏమీ జ్ఞాపకము లేదు. కోశాలలోలేదు, వ్యాకరణాలలో లేదు. ఎందుకుంటుంది ? 'కదలు' *ధాతువునకు ప్రేరణార్థకము 'కదల్పు' గాని కదపు కాదుగదా, ఇదిభాషలోనికి ఎప్పుడు వచ్చినదో ఇంకా చెప్పలేముగాని నేడు దేశమందు అంతటా వాడుకలో ఉన్నది. శిష్టులుకూడా వాడుతున్నారు; లకారము పోయినదని అందరూ ఎరుగరు; ఎరిగినవారయినా ఎవరూ నొప్పుకోరు ఏలాగయితేనేమి, కదపు

---

* కథా సరిత్సాగరమందు 'కదులు' రూపాంతరమున్నది (చూ. పుట. 496) శ. ర. లో లేదు. ప్రాచీనుల ప్రయోగములలో ద వర్ణము యతిస్థానమందున్నది. గనుక 'కదులు' కొత్త తెలుగు.

(కదుపు రూపాంతరము) భాషలో స్థిరపడ్డది. సరికొత్త తెలుగమాట గదా ఇది! నూతన ప్రియులు కాని వా రెవరుంటారు? వృద్ధపండితులు, పండిత భిషజమణులు, ఎప్పుడూ భాషాదేవి చేతినాడిపరీక్షిస్తూ, రోగాంకూరములు పొడ చూపగానే నిదానించవలసినవారు, మన వెంకటరాయశాస్త్రిలవారే తమ కధా సరిత్సాగరమందు 195-వ పుటలో, 10-వ పంక్తిలో 'కదపక' అని ప్రయోగించి కేవలలౌకికభాషలో ఉన్న సరికొత్త తెలుగుపదము 1891-వ సంవత్సరములో తమ గ్రంధమందు చేర్చికొని, వెలితీసివేసి, గ్రాంధికము చేసివేసి, పుణ్యము కట్టుకొన్నారు. పంచములకు బ్రాహ్మణులతో సమముగా మన గవర్నమెంటువారు హక్కులు కలుగజేసినట్టే. సమముగా అంటే, లౌకికవ్యవహార మందని మా అభిప్రాయముగాని, యజ్ఞాలలో ఋత్విజులుగాను శ్రాద్ధాలలో భోక్తలుగాను ఉండడములో సమానమని కాదు. "కదపు" శబ్దమునకు మన శాస్త్రిలవారు యోగ్యత అనుగ్రహించిన తర్వాత, బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలవారు తాము రచించుచున్న సరికొత్త భారతములో § ఈసరికొత్త పదమునకు నన్నయశబ్దములతో సమానమైనస్థానము పద్యములోనే ప్రసాదించినారు. మ. పానుగంటి లక్ష్మీనృసింహారాయ కవిపుంగవులుకూడా తామురచించిన గ్రంధములలోను, అన్నిటికి శిరోమణి అనదగిన 'సాక్షి'లోను 'కదపు' శబ్దమును ముమ్మారు ఆదరించి, "స్థిరోభవ, వరదోభవ, సుప్రసన్నోభవ," అని ప్రతిష్ఠాపించినారు. 'లౌకిక భాష పాకీచచ్చడిబాష' ‖ అని పైకి నిందించినా. సదయహృదయులున్ను పక్షపాతము లేనివారున్ను గనుక ఇతర పంచములతో పాటు పాకీ చచ్చడులకు లౌకిక వ్యవహారములో గవర్నమెంటువారివల్ల కలిగిన హక్కులు చెల్లక తప్పవని ఎరిగి, కదపుయొక్క 'తోబుట్టువు' 'మెదపు'ను *కూడా స్వీకరించి తమ ఔదార్యము ప్రకటించినారు. నేడు ఆంధ్రగ్రంధములు వ్రాసేవారు అపరిమితముగా ఉన్నారు. 'కదపు' శబ్దము వాడేవారుకూడా ఇంచుమించుగా అందరున్నారు. ఎవరు లెక్కపెట్టగలరు? ఈలాటి 'పాకీ చచ్చడి' మాటలు వందలు, వేలు ఉన్నవి వారిగ్రంధాలలో; అందుచేత అవి బాపన మాట లయిపోయినవి.

---

§ చూ వనపర్వము 4. 273. శా. 4 వ పాదమందు. పూ, న్కింగ్గె గొంచు నొకింతయేని కదుపన్ లేక మ్మహాపుచ్ఛమున్.

‖ చూ. పు. 3, 168 తుదకు 'రామవాక్య' మంగీకరించక తప్పినది కాదు.

* చూ. పుట. 34

• కల్పలతా సంపాదకులు బ్రహ్మశ్రీ ఆచంట వేంకటరాయసాంఖ్యాయనుల వారికి మేము కొనియాడుచున్న వ్యవహారికభాష యిష్టమయినది కాదని

## వల్ల బెల్ల మయినదట !

102. 'వలన'కు బదులుగా వేంకటరత్నము పంతులవారు 'వల్ల' వాడినారని శాస్త్రులవారు నిందించి, ఆంధ్రకవితాపితామహునియందుకూడా దోషము ఆరోపించినారు. చూడండి వారి విమర్శము—'ఏ పొరబాటుననో ఈ భాషకెల్ల ఒకమాఱు మనుచరిత్రలో పడిన వల్లను బెల్లముగాప్రయోగించుకొన్నారు ! (చూ. అనుబంధము పుట 4) పెద్దనగారే పొరబాటు పడ్డారట ! ఆంధ్రభాషలో మరెక్కడా ఎవరూ, 'వల్ల' వాడలేదట, ఆంధ్ర సారస్వతమంతా గాలించి, వెదకి తాము చూచినట్లే సగర్వముగా సిద్ధాంతము చేసినారు. ఎట్టిప్రాగల్భ్యము! ఎంత డాబు ! ఈ భేషజాలకు లోకులు మోసపోతారు 'వల్ల ప్రయోగించిన కవులు వందలున్నారని వారెరుగరు. 106-వ పేరాలో మే ముదాహరించిన ప్రయోగములు చూచిన వారికి శాస్త్రులవారి బడాయి బట్టబయలు కాక మానదు అంతేకాదు; ఈ శాస్త్రులవారి విమర్శము 'ఒజ్జల పుచ్చకాయవిద' మని స్పష్టముగా చూపిస్తాము. 'వల్ల' యందు ఇంత దోష మున్నదని శాస్త్రులవారి ఎప్పుడు తెలిసినదో మే మెరుగముగాని, 1891-వ సంవత్సరమున వారు కథాసరిత్సాగరము రచించినప్పుడు వారికి తెలియలేదని చెప్పగలము తెలిసి ఉంటే, తమ గ్రంథములో తామే వాడి ఉందురా ? చూడండి 524-వ పుట, మూడవ పంక్తిలో ఉన్నది— అతనివల్లనుండి' అని మరి యిరవై సంవత్సరములయిన పిమ్మట, ఈ గ్రంథము రెండవకూర్పు ముద్రించి నప్పుడైనా, వేనవేలు సవరణలు చేసుకొన్న "కళంకులేని కవిచంద్రులు" ఈ "వల్ల" ఉన్నదున్నట్లే ఉంచినారు గాని దిద్దుకోలేదు, అది నిర్దుష్టమని నమ్మకము లేకుంటే దిద్దక విడుతురా ? గనుక 1911-వ సంవత్సరముదాకా శాస్త్రులవారికి కూడా 'వల్ల' బెల్లమేగాని చేదుకాదని సిద్ధాంతీకరించుటకు వారి గ్రంథమే

---

కొందరు భ్రమపడుతున్నారు సాంఖ్యాయనులవారు వర్తమానాంధ్రభాషా ప్రవర్తక సమాజములో చేరినవారే. వారికి అనిష్టమైనవి అపశబ్దాలున్నూ గ్రామ్యములున్నూ; అవి మాకూ అనిష్టమే శిష్టులనోటను అట్టివి రావు— హాస్యానకు తప్ప, హాస్యమందవి ఉచితమే కల్పలత మొదటి సంపుటము 2-వ, 4 వ సంచికలలో "కదుపుచు" కదుపక అని ఉన్నవి. (చూ. కట్టుపెండలము, 3-వ పుట, 2-వ వరుస 22-వ పంక్తి). సాంఖ్యాయనులవారు రచించిన రహస్యదర్పణమందుకూడా "కదపఁబడు" కనబడుతున్నది; (చూ. 6-వ పుట, 5-వ పంక్తి) ఇటువంటి కొత్తతెలుగులు అనేకముగా గ్రంథములలో వాడేవారు వ్యావహారిక భాషను నిందించేవారని మేము నమ్మలేము.

ప్రమాణము. మరి ఇంకా, 1914-వ సంవత్సరములో ప్రకటించిన యూనివర్శిటీ 'ఇంటర్మీడియెట్ కాంపోజిషన్ కమిటీవారి రిపోర్టు, 20-వ పుటలో, మన శాస్త్రిలవారు, సబ్ కమిటీ మెంబరుగా నుండి. చేసిన శబ్దాను శాసనమున్నది. అందులో 'వల్ల' 'కన్న' సంస్కారములకు, వారు స్వయముగా నియమము అంగీకరించినారు. ఈ రెండు విభక్తులున్ను తమ గ్రాంధిక భాషలో ఉన్నం దున సాధువులయినవి కాబోలు. 'వల్ల' కథా సరిత్సాగరములోనున్నది. 'కన్న' వారు రచించిన 'అలంకార సారసంగ్రహనమందు 41-వ పుటలో ఉన్నది. అవి పూర్వులు అనేకులు వాడినవే, వీరి అనుశాసనమువల్ల వాటికి సామత్వము కలిగినదా ? లేక వాటివల్ల ఈయ' అనుశాసనము సాధువయినదా ? వివేకులు ఆలోచింతురుగాక

103. శాస్త్రిలవారికి కూడా 'వల్ల బెల్ల' మయి ఉండగా, పంతుల వారికి మాత్రమే బెల్ల మయినట్లు ఎత్తి పొడిచి, వారితోపాటు పెద్దనవారికి కూడా నెత్తిమీద నొక పెట్టు పెట్టినారే! ఇంత సాహసమునకు కారణ మేమి ? 1895 వ సంవత్సరములో ప్రసన్న రాఘవము విమర్శించి నప్పుడు మన శాస్త్రిల వారికున్న ఆంధ్ర భాషా పాండిత్యమంతా అల్ప లక్షణమును పట్టి సంపాదించినది; గాని, లక్షణమునకు ఆధారమయిన కావ్యములు చదివి నేర్చికొన్నది కాదు. చింతామణి మంత్రము జపించినా, సిద్ధ సారస్వత సం సిద్ధి అయినట్టు కనబడదు. వారు చూచిన లక్షణ గ్రంధములు ఆంధ్ర శబ్ద చింతామణి, అప్పకవీయము, చిన్నయసూరి బాలవ్యాకరణము మాత్రమే అయి ఉండును. ఈ వ్యాకరణాలలో ఇమిడ్చి ఆంధ్రభాష అంతా ఎవరూ అనుశాసించి ఉండలేదు. వీటిలో 'వల్ల' పంచమీ విభక్తి ప్రత్యయముగా సంస్కార నియమము కాలేదు. వ్యాకరణాలకు విరుద్ధమయినదే కాక, వ్యాకర ణాలలో చెప్పనిది కూడా అసాధువే అని శాస్త్రిలవారు భ్రమపడి ఉందురు. చిన్నయసూరి తాను రచించిన 'మిత్రలాభము' నందు, 5వ పేరాలో 'లోభము వల్ల' అనిన్ని 6వ పేరాలో 'యీ మాటలవల్ల' అనిన్ని రెండుమాట్లు వాడి ఉండిన్ని, తాను రచించిన వ్యాకరణములో దానికి అనుశాసనము చేయకుండా మరచి పోయినాడు. చిన్నయసూరి చెప్ప మరచిన లక్షణము చెప్పడానికి సంక ల్పము చేసుకొని, సీతారామాచార్యులవారు 'త్రిలింగ లక్షణ శేషము' అనే 'ప్రౌఢవ్యాకరణము' రచించినా, అందులో 'వల్ల'కు అనుశాసనము చేయ లేదు; అయితే ఆ వ్యాకరణమునందే కొట్టకొసను ముక్తలక్షణ వివేచనము, 2వ సూత్రమందున్న వాక్యములో 'వలను'కు బదులు 'వల్ల' ప్రయోగించినారు; ఇంతేకాక, వారి శబ్దరత్నాకరములో 'వల్ల' చేరిఉన్నది, అందుకు ప్రమాణ ముగా పెద్దనగారి ప్రయోగమున్ను ఉన్నది; 'వలను'కూడా 'వల్లగా' మారి

నందుకు 'సూచనలేమియు వల్లగావు'అని పారిజాతాపహరణమునుండి ప్రయోగ ముదాహృతము. గనుక ఆచార్యులవారి మతమందు 'వల్ల' సాధువే కాని అసాధువు కాదుగదా. వీరికి పూర్వమే చాలా కాలము క్రిందట పుట్టిన ఆంధ్రవ్యాకరణములు సంస్కృతమున రచించినవి రెండు మేము చూచి ఉన్నాము ఒకటి ఆంధ్రకౌముది, ఇది నాగరాక్షరముల ముద్రితమైనది. ఇంకొకటి అముద్రితముగా ఉన్న అథర్వణ వ్యాకరణము; మ. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు గారు గవర్నమెంటువారి పుస్తకాలయ మందున్న ప్రతిని బట్టి వ్రాయించినది. ఆంధ్ర కౌముదిలోని 117వ సూత్రము 'సుసునులు చేతకొరకు వల్లక్త్వందుష్—సుపవిత్స్యః' అనిన్ని, 126వ సూత్రము 'ఉంచి, కన్న, పట్టి, కంటె, నుండి, వల్ల, వలన, వంటోంద్వోః జసినః' అనిన్ని. మొదటిదానిలో సామాన్యముగా ఏడు విభక్తులను ప్రత్యయములచేత తెలియ జేసినప్పుడు పంచమీ విభక్తిని 'వల్ల' చేత నిరూపించి, రెండవదానిలో పంచమీ విభక్తి ప్రత్యయములు వివరించి, తక్కిన వాటితోపాటు వల్లతిరిగి చెప్పినట్లు ఉన్నది. అథర్వణ వ్యాకరణము చతుర్థకాండములో శ్లోకరూపముగా 'ఉంచి కుందావల్ల వలన వంకయుండితీ పంచమీ నిర్ధారణే కన్న కంటే దేశ్యేపారు ఙిరిష్యతే' అని సూత్రమున్నది. (చూ. అథర్వణుఁడు ఆంధ్ర విజ్ఞానసర్వస్వము) గణపవరపు వేంకట కవి రచించిన ద్విరూప కోశమందు 'వలన'కు 'వల్ల' రూపాంతర మని ఉన్నది.—

క. కల్లలు కళ్లెములన న, వహ్నన గళ్ళనఁగ వలన వల్లన యనఁగా (11)
నొల్లము వల్లము నాఁగను, కుల్లాయ కుళాయునాఁగఁ గొలులను పేంద్రా.

1834-వ సంవత్సరములో ముద్రితమైన రావిపాటి గురుమూర్తి శాస్త్రిల వారి వ్యాకరణములోను ఆ పిమ్మట పుట్టిన వ్యాకరణాలలోను తరుచుగా 'వల్ల'కు అనుశాసన మేర్పడి ఉన్నది.

104. ఇవి ఏవిన్నీ మన శాస్త్రిలవా రెరిగి ఉండరనుకొంటాము. వారు చదువుకొన్న కొంచెము లక్షణమే వారికి పరమ ప్రమాణమయినది. అందుచేతనే కాబోలు, 1910-వ సంవత్సరమందు వారు పరిష్కరించిన సారంగధర చరిత్రలో దిద్దుటకు వల్లపడినచోట్ల 'వల్ల' 'వలన' గా మార్చినారు. అయితే వల్లపడనప్పుడు, పద్యమంతా మార్చితే పాడవు తుందని అట్టే పెట్టినారు. ఉదా: 261 లో పూర్వ ముద్రణమున 'నుడువుల వల్లనే' అని ఉండి వీరి పరిష్కరణముచేత 'నుడువుల వలననే' అయినది; ii 278, iii 95, iii 155, వీటిలో, 'వల్ల' నిలిచి ఉన్నది. మను చరిత్ర—పూర్వ పరిష్కర్తలు కొన్ని చోట్ల పాడుచేయక పోలేదు—మన శాస్త్రిల వారే మొదట పరిష్కరించి ఉంటే, ఒక్క పద్యములో మాత్ర మున్నది గనుక,

అందున్న ఒక్క 'వల్ల' వేళ్ళతో పీకి పారవేసి, పెద్దన్న గారికి 'వల్ల' ప్రయోగించిన దోషము లేకుండా చేసి, పుణ్యము మూటకట్టుకొందురు. 'అల్పోపిదోషః ప్రమాదే నాప్యనుపేక్షవ్యః' అని గదా పండితుల భాషా శౌచవిధి. ఇట్టివారు వ్రాసిన కథాసరిత్సాగరము రెండు కూర్పులలోను 'వల్ల' ఎందుకు ఉన్నది? అంటే, మాకు తోచిన సమాధానము చెప్పుతున్నాము. ఈ గ్రంథమంతా ఉత్తరాంధ్రమందే మొదట వ్రాసి, ప్రాచీనాంధ్రములోనికి యథాశక్తి పరివర్తనము చేసి ఉంటారు, వేనవేలు కేవలము ఉత్తరాంధ్ర ప్రయోగములనదగినవి రెండవ కూర్పులో మారినవి ఈ 'వల్ల' మార్చడము మరచిపోయినారో, లేక, అప్పటికి 'ఎల్ల' అసాధువు కాదని తెలుసుకొన్నారో. తాము వ్రాసినవే ఇతరులు వ్రాస్తే, తప్పుపట్టి దూషించడమునకు ఈ శాస్త్రులవారు జంకేవారు కారని నేము రుజువు చేసివున్నాము. ఈ వల్లను గురించి పంతులవారిని ఆక్షేపించడము ఇంకొక దృష్టాంతము గదా. తాము అసాధువన్నది తాము వాడనట్టే నటించగలరు. ఈ కుచోద్యము వీరికి సాజముగా మొదటినుండి ఉన్నది. ఖలఃసర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యతి. ఆత్మనోబిల్వమాత్రాణి పశ్యన్న పిపశ్యతి

105. భారతాది ప్రాచీన గ్రంథములలో 'వల్ల' లేదు. ప్రాచీన భాషలో 'వలను' విశేష్యము, ఉదా. "కలహంస పలికిన పలుకులు గణియించు, వడి దానిపోయిన వలన చూచు" దీనికి బహువచన రూపము 'వలంకులు' ఇది ఛాపవిభక్తికము గనుక 'వలనన్' 'వలనికి' మొదలయిన ప్రథమేతర రూపములున్నవి 'వలనన్' హేత్వర్థకముగా వాడుటచేత క్రమక్రమముగా పంచమీ విభక్తి ప్రత్యయమైనది. ఉత్తరాంధ్రములో పెద్దన, పోతన, మొదలయిన వారికాలమందు 'వలన' 'వల్న' గాను, 'వల్న' 'వల్ల'గాను వాడుకలోనికి వచ్చిఉండును. తమ పూర్వులు వాడిన శబ్దములేకాని వాటికి భిన్నముగా ఉన్నా తమకాలమందు వాడుకలోనున్న శబ్దము ప్రయోగించకూడదన్న పిచ్చి నియమాలు ఆ కాలములో లేవు గనుక, పెద్దన పోతనలు 'వల్ల' వాడినారు. పోతన 'వలదు'కు బదులుగా 'వద్దు' అని తరుచుగా వ్రాసినాడు. నన్నయ తిక్కనలు ఇది వాడినట్టు మే మెరుగము * అనేక శబ్దములలో మధ్యాక్షరమందున్న అచ్చు—ఉకార, ఇకారములే కాక అకారముకూడా—లోపించినది. 'వలచు' 'వల్చు' అని నన్నయ కాలములోనే అయినది, మరికొన్నిటి

* మ త్రిపురానవేం. సూర్యప్రసాదరావు కవిగారు ద్రోణ, 5. 324 వ పద్యములో తిక్కన 'వద్దు' వాడినట్టు పూర్వముద్రణములం దున్నదని చెప్పినారు. ఆనంద ముద్రణములోనే తర్వాత పాఠము మార్చి పుట అడుగున మార్పు సూచితమయి ఉన్నది.

లోని మార్పు తిక్కన కాలములో అయినది. ఇట్లే ఏకాలముబట్టి రూపములు వ్యవహారములో ఉంటే అట్టి రూపములు కవులు యథేష్టముగా వాడేవారు, అదే సత్సంప్రదాయము. వలన—వల్న—వల్ల ఈ మూడురూపములున్ను వ్రాత ప్రతులలో కండ్లారా చూచిఉన్నాము. లకారనకారములు కలిసిపోయి 'వల్లఁ' అని కొంతకాల ముచ్చారణ ఉండినట్లు స్వరతత్వమును పట్టి ఊహించవలెను. నేటి తెలుగులో 'నెలనాళ్ళు' 'నెల్లాళ్ళు' అని అందరూ అంటారు. కొందరు 'నెల్లాంళ్ళు' అని ఉచ్చరిస్తారు, ఇదే మధ్యకాలములోనిది. సల్లాపము 'సంలాపము' నుండి పుట్టినది సంస్కృతమందు అముష్మిన్ + లోకే= అముష్మిల్లోఁకే అని నకార లకారములు సంయుక్త మయినప్పుడు న్ + ల్= ల్లఁ అని ఉచ్చారణ ఉంటుంది 'దానిలో' 'మనలో' అవి తొందరగా పలికినప్పుడు 'దాన్లో' 'మన్లో'—'దాంల్లో' 'మంల్లో' అని వినబడును. తెలుగు భాషాధర్మముచొప్పున లకారనకారములకు వర్ణవ్యత్యయము సంస్కారముగా కొన్నిటిలో నున్నది మన భాషపేరు 'తెలుఁగు', 'తెనుఁగు' అని ఉండడమే తార్కాణము మొట్టమొదట ఈ పేరులోనికి లకారమో నకారమో నిశ్చయముగా చెప్పలేము. ఉత్తరాంధ్రములో మాత్రము లకారము నకారము కావడము భాషా ధర్మమే * మధ్యాక్షరములోని అచ్చుపోయి పరమందున్న హల్లుతో సంయుక్తమయినప్పుడు, కొన్ని మాటలలో ద్విత్వము వినబడుతుంది ఉ. మరవు = మప్పు. సంయుక్తవర్ణములలో రెండవది మొదటిదానితో కలిసినందుకు ఉదా, అగ్ని = అగ్గి ; యజ్ఞన్న = యగ్గెన్న.

106. ఈచర్చ మా ప్రతిపక్షులకు ఇష్టమయినాకాకున్నా, 'వల్ల' యొక్క సాధుత్వము సాధించుటకు పండితులకు ప్రయోగములే ప్రమాణము; గనుక, కొన్ని ఈ దిగువను ఉదాహరిస్తున్నాము. ఇవి ఏ గ్రంథములనుండి వ్రాసినామో అవి అప్పకవ్యాదులాక్షణికులు ప్రమాణముగా అంగీకరించినవి. పండితులు 'వల్ల'ను పరిత్యజించినా, అదిమాత్రము వారిని పరిత్యజించదు. కంఠము పట్టుకొని ఉంటుంది లోకమంతా అల్లుకొని ఉన్నది; లోకమును పరిత్యజిస్తేనే

---

* కొలను-కొల్ను-కొల్లు అని 'పాలకొలను' అనే గ్రామ నామము 'పాలకొల్లు' అయినదట' ములుకోల=మును (ని) కోల 'మలనాడు' మల్లాడయినదని కిటిల్ కన్నడ నిఘంటువులో ఉన్నది. ఇట్లే 'కలను' కల్లు' అయిననేమో. 'పల్లు'కు మారుగా కొందరు 'పన్ను' అంటారు. వెలుతురు పల్లి = వెణుతురు పల్లి, పిలుగు=పిసుగు, గొలుగు = గొణుగు, ములుగు = మునుగు (అనికొంద రుచ్చరిస్తారు ) (పనస) తొల=తొవ; లాంగల=నాఁగలి, లింబ= నిమ్మ.

కాని ఎవరున్ను దానిని పరిత్యజించలేరు. ఇది దేశభాషాతత్త్వము. శిష్టులవాడుక చేత 'వల్ల' వలెనే అన్ని శబ్దములున్ను సాధువులనక తప్పదు. తప్పదు. తప్పదు.

1. ఆముక్తమాల్యద.

చ మబ్బులనిలముంచు నీలఘన పుంజమువల్ల బలాకమాలికల్.

(4. 120)

2. ఉ. రామా.

సీ. పా ఝళిపించు విద్యుకత్తులవల్ల దుళకించు (పు 326)

3. కువల.

సీ. గీ అదియు నావలఁ దెలసి ఋయ్యధిపవర్య (4.164)

4 చంపూ. రామా

సీ. గీ. యామినీచరవల్లభుఁ డనుచు నల్లగంధవహాత్మజుని వల్లఁగరము తలఁకె (7.54)

5. చెన్న బ

ఉ. చేడియ వల్ల నించుక ప్రసిద్ధి వహించెనుగాని నిల్చిమా (1, 84)

6. నిర్వ. విచి. రా.

ఉ తప్పునా వల్లను గర్గెనంచు జనవల్లభు దేవి నొసంగనైతిమీ కల్ల. (6. పు. 218)

7. పట్టాభి.

ఉ. కోపమువల్ల మీతపము గ్రుంగదెయోచనసేయరైతిరె. (6 పు 166.)

8. బహులా.

క, అల్లేమచనుహాళాహాశి, వల్లనె కాదల్ల వళివివాదావళిరా నల్లవళా వళిగలయా కల్లోలము లెనఁగ హల్లకల్లోలముగన్ (2. 56)

9. బిల్హా.

సీ, ఈకళానిధివల్లనే కదా దిక్కు దిక్కుల వారలెల్లను దెరివిగనుట;
యీవసుఖని వల్లనే కదా విబుధులు కోరికల్ దీరంగఁ గుడుపుగనుట;
యీమహాగ్నిఘ వల్లనే కదా సఖ్యులెన్నఁగ నిశాచరులెల్ల దిగులు గనుట
యీసత్పుత్రుని వల్లనే కదా మోదించి కువలయం బెచ్చుగాఁగూర్మి గనుట (2. 55)

10. భాగవతము.

ఆ.. ఎలమిఁ బుణ్యపాపముల శేషములవల్లఁ బుట్టుచుందు రవనిఁ బుణ్యచరిత. (5. 161)

11. సీ. గుణమువికారంబుఁ గోరికయును లేని నీవల్ల జగములు నెఱిజనించు
(13) 0. 1 21

12. మధువిల.
సీ. పా బహుళాపథానముల్ పలపి నాలుగునగల్ రేచి నందితి మల్ల
ధీరుపిల్ల(ఆ.కవులచరిత్ర 493)

13. మనుచరిత్రము.
చ. చలిమల వల్లనుల్లసిలు చల్లఁదనంబును నూనపుండినన్. (2. 10)

14. రామరాజీయము. వల్లను (ప్రాసస్థానమందుల్ల') 267.

15. ,, పల్లను ...(94)

పుస్తకము పోయినందున పద్య ముదాహరించలేదు.

16. రంగనాథరామాయణము.
నేరము నావల్ల నెమకిన లేదు (కిష్కి-)

17. రామాయణము.
తే. అధిపుఁడు కరంబుచాఁచి సూగారువల్లఁ, బాముఁబట్టంగ (4.163)

18. వెంకమా
సీ. పా. నీవు. చెప్పినమీఁద నావల్లనే రప్పు గలదని తోఁచె నిష్కర్ష
(6, పు. 183)

19. శశిరేఖాపరిణయము.
సీ. గీ. బలుఁడనీ వల్ల మాకింత బాధగలిగె. (పు. 72)

20. శివరహస్యము,
ఉ సీ, వల్లను సంభవించుమఱి వృష్టిని నీవఖిలంబు (1. పు. 15)

21. సీ గీ అందువల్లను భయమంది యనుదినంబు (1, పు 18)

22. ఉ. ఎవ్వానివల్లఁ బుట్టి జగమెల్లను సంతతముం బ్రవర్ధనం బెవ్వని వల్ల లీనమగు నెవ్వని యందు ధ్రువం బనుగ్రహం బెవ్వనివల్లఁ సర్వమిది యెవ్వనివల్ల దిరోహితంబునౌ (2. పు. 31)

23. సమీర.
తే కలిగె నావల్ల నేవల్లఁ బలుకు దాన (2. 115)

24. సారంగ. గీ... కల్ల నావల్లఁ గోరంత గలిగెనేని (2. 279)

25. ,, గీ. చెల్లఁబో నీకు సాధ్వీమతల్లి వైన తల్లి కీగతి యొదవెగా దన్నుఁగనుట వల్ల నీవల్ల ధారుణి వల్లభాజ్ఞ మీఱియీరీతి వచ్చుట మేరఁటమ్మ
(2 59)

26. ,, గీ ఈరమణివల్ల సంశయం బెఱుకపడక. (3. 155)
27. సురాభా.
చ మై. దొఱఁగుట యంతకంటె బలుదోషము గ్రక్కున నీని వల్లనే (పు. 19)

## గంధము

107. ఆంధ్ర ప్రసన్నరాఘవమునందు 'గందపుఁజెట్టు' (పుట 9), 'గందపుఁబూఁత (10), 'గందము' (70) అని చాలాచోట్ల 'దకారము వర్గ తృతీయవర్ణముగానే ఒత్తులేకుండా కనబడినశబ్దములు ఉపేక్షించి, 79వ పుటలో కనబడిన 'గంధపుఁజెట్టు' ఎత్తుకొని శాస్త్రులవారు "సంస్కృతమయిన గంధ శబ్దమునే వీరు చందన పరముగా ప్రయోగించినా"రని అధిక్షేపించినారు. ఇందు దోష మేమున్నదో! లోకములో చందన పరముగా గంధశబ్దము ప్రసిద్ధమై ఉన్నది. * కాపులు మొదలయినవారు కొందరు 'గందము' అని వాడుతారు గాని చదువుకొన్నవారందరూ గందమంటారు. ఇప్పటి కాపుల వాడుకే గ్రాంధి కాంధ్రమని శాస్త్రులవారు కథాసరిత్సాగరములో తరుచుగా 'గందము' (చూ. పు. 320), మంచి గందము కలయంపి (368), గందపుమ్రాను (467). ఎఱ్ఱ గందము (677), అని వ్రాసినారు, సరేకాని, ఒత్తు ఉన్నప్పుడు లేని అర్థము ఒత్తుపోగానే వచ్చునా? తెలుగులో 'అబద్ధము' అంటే, 'అసత్య'మని లోక ములో వాడుక వున్నది గాని ఆంధ్రకావ్యములలో మాకు కనబడలేదు: శబ్ద రత్నాకరమునందు దానికి అనర్థకము అని అర్థమున్నది. 'నిబద్ధి'వంటి వైకృత మున్నట్టే 'అబద్ధము' అని అర్థము ఉన్నదేమో మే మెరుగము. శాస్త్రులవారు కథాసరిత్సాగరమందు 'అబద్ధము' అసత్యార్థమందు 712 వ పుటలో వాడినారు. ఈవ్యాసము రెండవ భాగములో ఇట్టి శబ్దములను గురించి వివరముగా వ్రాయ దలచినాము. గనుక ఇప్పుడు ఈ చర్చ పెంచము.

## కర్మార్థక ప్రయోగము

108. "ఎక్కడఁబడదయ్యెడు" అని ప్రసన్నరాఘవమునందు 16 వ పుటలో కర్మార్థక ప్రయోగము పంతులవారు వాడినారని మన శాస్త్రులవారు తప్పుపట్టి, "ఆంధ్రభాషా స్వభావాననుగుణము" అని దానిదోషము నిరూపించి నారు. తమ విమర్శ, 139 వ పుటలో "కర్మార్థకము బెల్ల మేనికావింప బడియె

---

* స్మార్త బ్రాహ్మణులు నుదుటను 'గంధాక్షితలు' ధరిస్తున్నారు కారా? కొందరు పెట్టుకొనే అక్షితలు (అక్షింతలు) ఏకవచనము, నల్లగా ఉంటుంది! చిత్రము!

నని వ్రాయమని చెనకినారు. ఆంధ్రభాషా స్వభావానను గుణముగా శాస్త్రిల వారు వ్రాసిన వాక్యాలు ఎన్నివందలు కావలస్తే అన్ని ఉదాహరించవచ్చును. (ఈ వ్యాసము మూడవ భాగములో చూతురుగాని). "ఆంధ్రభాషా స్వభావము" అన్నప్పుడు ఏ ఆంధ్ర భాషయొక్క స్వభావమో? ఇప్పటి ఆంధ్రభాష వారికి గ్రామ్యమే అయెను, ఇక, ప్రాచీనాంధ్ర భాషయొక్క స్వభావము కావ్యములలో కొంత కనబడినా, అంతా కనబడదాయెను; అకనబడినంతమట్టుకైనా శాస్త్రిల వారివంటి కేవల లక్షణ పరాయణులకు పట్టు బడదాయెను. యోగసమాధికో కనబడేది కాదాయెను; తర్కముచేత సాధించ శక్యముకానిదాయెను. మరియెట్లు "ఆంధ్రభాషా స్వభావానుగుణముగా" వ్రాయడము? కర్మార్థక ప్రయోగము పంతులవారికి బెల్లమని వెక్కిరించిన శాస్త్రిలవారికి ఈ ప్రయోగము అమృత ప్రాయమయినట్లు మాకు కనబడుతున్నది. చూడండి మచ్చుకు రెండుమూడు వాక్యాలు కథాసరిత్సాగరములోనివి "ఆమూఢుడు క్రోధవర్మ భార్యతో సంగమించి అతనిచేత చూడబడి సముద్రములో వేయబడి చచ్చెను" (3.8) "మనము యీలోతు సుడిలో జలముచేత విసరివేయబడినారము" (21), "ఇదిగో ఆసన మలంకరింపబడునుగాక" (405); "ఈ సరస్సులో వేయబడిన వెదుళ్ళు" (4 8). ఏదో దేనినో అందముగా చేపని వెక్కిరించిన దని సామెత చెప్పుకొంటారు. ఆలాగున ఉన్నది, శాస్త్రిలవారు పంతులవారిని కర్మార్థక ప్రయోగము కోసము వెక్కిరించడము.

109. ఈ కర్మార్థక ప్రయోగమునుగురించి శాస్త్రిలవారు చేసే వాదములో ఒక వైచిత్ర్యమున్నది మావంటి వర్తమానాంధ్ర భాషాభిమానులు కొన్నాళ్ళక్రిందట ఈ కర్మార్థక ప్రయోగము ఆంధ్రభాషా స్వభావానుగుణము కాదని వాదించినప్పుడు మన శాస్త్రిలవారు తాము రచించిన గ్రామ్యాదేశ నిరసనములో (చూ. పుట. 20) ఆ వాదమును ఖండిస్తూ, కర్మార్థకప్రయోగవాదము ఎలాగున సిద్ధాంతీకరించినారో చూడండి,—

"ఇప్పటి గ్రామ్య వ్యవహారమందు కర్మార్థకరూపములు అరుదగుట వాస్తవమే. తొల్లియు ఇవి విరళమే అయెనేని, ఈ భాషను మించి దశకు దెచ్చిన యా సంస్కృత విద్వాంసులు దీనియందలి లోపముం దీర్చుటకై 'పొందుట' యర్థమగు 'పడు' ధాతువును అనుబంధముగా కల్పించి పొందెడి వానింజెప్పెడి యీ ప్రయోగమును సాధించుట కడుంబొందికగు యీభాషాభివర్ధనుల మహిమాతిశయంబును తద్వ్యవహార వైరళ్యము వ్యవహర్తల యజ్ఞానంబును సూచించుచున్నవి".

ఇట్లు కర్మార్థక ప్రయోగమును కొనియాడి, దానిని వాడినవారిని స్తుతించి, వాడనివారియందు అజ్ఞానము ఆరోపించిన వేదము వేంకటరాయ శాస్త్రిలవారు

వేంకటరత్నము పంతులవారిని కర్మార్థక ప్రయోగములు వాడినందుకు నిందించిన వేదము వేంకటరాయశాస్త్రిలవారే సుమండీ! అయితే, వారి మతములో ఇట్టి వైషమ్యము ఎందుకు కలిగినది? అంటే, ఒకటే సమాధానము కనబడు తున్నది. శాస్త్రిం వారికి తత్త్వజిజ్ఞాస లేదు, వివాద ప్రియులు. ప్రతివాదులు కాదన్నది అవుననిన్ని, అవునన్నది కాదనిన్ని సిద్ధాంతము చేయడమే వారికి కావలసినది. 'జంకు కళంకులేని' వారమని వారేగదా చెప్పుకొన్నారు. వారు గొప్పపండితులని వారిశిష్య బృందమునకు పరమ విశ్వాసమున్నది. వారేమన్నా 'బళాబళీ' అనేవారున్నారని వారికి బాగా తెలుసును. మరిజంకేల! కళంకుంటే నేమి? కవిచంద్రులు గదా శాస్త్రిలవారు, వారియందు కళంకు వారిశోభను వృద్ధిచేస్తుందనే వారికిన్ని వారిశిష్యులకున్ను సమ్మతము. ఏమదృష్టము!

## అఱవ తెలుఁగు

110 వెంకటరత్నము పంతులవారి తెలుగు 'అఱవతెలుఁ' గని (పుట 227) 'మదరాసు తెలుఁ'గని (80) 'చెన్నపట్టణపు తెలుఁ' గని (89) 'గుజరాతీపేట తెలుఁ' గని మాటిమాటికి ఎత్తి పొడిచినారు వాస్తవముగా శాస్త్రిలవారివంటి అఱవ తెనుగు పండితులవల్లనే మన తెలుగు భాషకు ఇప్పటి దురవస్థ సంభవించినది చెన్నపట్టణములో తెలుగుగ్రంథములు అచ్చుపడడము, అక్కడున్న అఱవ తెలుగు పండితులు గ్రంథములు పరిష్కరించడము, ఆంధ్ర గ్రంథాలు పాడు కావడమునకు ముఖ్యకారణము. ఎందునా పొందని నేటి అధ్వాన్నపు తెలుగు పరవస్తు చిన్నయసూరిగారి మూలముగా దాపరించినది. ఆయన కాలములో వచనాలు వాడుకభాషలోనే అందరూ వ్రాసేవారు. ఆయనమాత్రము వింతతెలుగు వ్రాసేవారు. ఇప్పుడు తెలుగువచనము వ్రాసేవారందరికిన్ని వారు మూలపురుషులట! వారి వచనములో బీజరూపమున మాత్రము ఉన్న రచనా దోషములన్నీ శిష్య పరంపరా ప్రాప్తములయి నేటివారియందు పరిణామము పొందినట్టున్నది అది అట్లుండనీయండి, వేరే వ్యాసములో వివరించి నిరూపించవలసిన విషయము. వారి నీతిచంద్రికలోని తెలుగు నిర్దుష్టము కాదు.

111. గ్రాంధికాంధ్రభాష లెస్సగా తెలియక నిర్దుష్టమయిన శబ్దము లనేకము దుష్టమని మనశాస్త్రిలవారు పంతులవారిని నిష్కారణముగా నిందించినారని దృష్టాంతములు చూపించే ఉన్నాము. అఱవ తెనుగని శాస్త్రిలవారు నిందించిన శబ్దము గ్రాంధికమయిన సుశబ్దమని రుజువు చేస్తాము, చూడండి ప్రసన్న రాఘవము 71-వ పుటలోని ఉత్పలమాల మూడవ చరణమందున్న 'రఘువంశపక్షమే' అనే శబ్దమును ఎత్తుకొని తమ విమర్శము 226 వ పుటలో ఇట్లు చెప్పినారు.

'పక్షపాతమునకు పక్షమనుట అఱవములో వాడుక. చెన్నపురి యఱవ తెనుగులోగూడ నీ వాడుక గలదు. ఆ ఫలమిట నీ రాఘవములో ప్రసన్నమైనది. కవితాతత్త్వములో నిట్లశిష్ట వ్యవహారానుగుణముగా ప్రయోగములు చేయవలసినదని యున్నది. కావున నౌత్తరాహులారా! ఆక్షేపింపకుఁడు.'

112. మేము ఔత్తరాహులమే, అఱవ తెలుగు మాకు అనిష్టమయినదే. అయితే, పంతులవారి గ్రంథాలలోగానీ, శాస్త్రులవారి గ్రంథాలలోగానీ మూలపురుషులయిన చిన్నయసూరిగారి గ్రంథాలలోగాని, వారిని అనుకరించిన ఇతరుల గ్రంథాలలోగానీ, 'పండిత విరచితము' 'పండిత సంస్కృతము' అని పుస్తకముమీద కనబడగానే, ఏ అచ్చు పుస్తకమైయినాసరే, అందున్న భాషలో తప్పులెన్నుటకు సామాన్యులు సాహసించగలరా? వాడుకలో లేని అపూర్వ శబ్దములుంటే, ఏవో గ్రంథాలలో ఉన్నవి గాబోలు అనుకొంటారు వాడుకలోనివే వాడుకకు విరుద్ధముగా కనబడితే, వాడుకభాష గ్రామ్యము గనుక దానికి విరుద్ధముగా ఉన్నవే తప్పరుండా గ్రాంథికములు అనుకొంటారు. బడులలోను కాలేజీలలోను విద్యార్థులు చదువుకొనే తెలుగు పుస్తకాలు అన్నీ తప్పుల కుప్పలు, పరిశీలనచేసే దిక్కులేదు. ఔత్తరాహులైతేనేమి? దాక్షిణాత్యులైతేనేమి? దేశభాషా స్వభావమునకు అనుగుణముగా గ్రంథాలలోని భాష ఉండవలసినదని విధి లేనప్పుడు, ప్రాచీన గ్రంథాలలోని భాష ఇప్పుడు వాడుకలో లేక అపరిచితమైనప్పుడు, పండితులయినా పామరులవలెనే తప్పొప్పులు కనుక్కోలేక, గ్రుక్కు మిక్కనకుండా ఊరుకోవలసినదే. తప్పులున్నవని తెలిసినవారయినా ఊరుకుంటారు గాని ఏమీచేయరు పాపము! ఏమిచేయగలరు? వారి ఏడుపు ఎవరు వింటారు? అరణ్యరోదనము! దిక్కులేక గ్రాంథికాంధ్రము రెంటికి చెడ్డ రేవడిలాగున్నది. ఆదరణలేక దేశభాష గ్రామ్యమన్న పేరు పొందినది ఎట్టిపండితులైనా, ఎట్టి తగుమనుష్యులైనా, ఎట్టి నాగరకులైనా తెలుగువారు గ్రామ్యమే మాటాడుతారుగాని సభ్యభాషలో సంభాషించలేరన్న అపకీర్తి అందరికిన్ని వచ్చినది. ఇందుకు ఎవరూ దుఃఖించరు. ఎందుకు ఈ సోదె? భాషాభిమానముగాని, స్వాభిమానముగాని లేనివారితో చెప్పుకొంటే లాభములేదు. ఎవరైనా ఎప్పుడయినా వినరా? అని మొఱ్ఱపెట్టుతున్నాము. ఇకను ప్రకృత మనుసరిస్తాము.

113. 'పక్షము' అనేశబ్దము ఈ పద్యమందు పంతులవారు 'పక్షపాతము' అనే అర్థమందు వాడిఉంటే శాస్త్రులవారు అన్నట్టు తప్పేనా? వారి శిష్యులు తప్పే అంటారు. వారిపేరు వినగానే జోహారు చేసేవారున్ను తప్పే అని తలకాయ ఎగరవేస్తారు. శ్రమపడ నక్కరలేకుండా విమర్శించేవారు శబ్దరత్నాకరము చూచి, అందులో 'పక్షము' కు 'పక్షపాతము' అర్థము చెప్పిఉండ

నందున పంతులవారు పొరబడ్డారనే సిద్ధాంతము చేస్తారు. ఐతే ప్రాచీన గ్రంథాలలో ఈ శబ్దము ఈ అర్థమందు వాడిఉన్నారేమో వెదకివెదకి చూడవలెను. ఎవరైనా వాడిఉంటే, అది గ్రాంథికమని రుజువవుతుంది. వెదకిన వారికి కనబడనంత మాత్రాన అది గ్రాంథికము కాదని సిద్ధాంతముకాదు, ఏమో? వారు చూడని గ్రంథమం దెక్కడైనా ఉన్నదేమో? ఏ శబ్దమయినా ప్రాచీన భాషలో లేదని రుజువు చేయడము కేవలము అసాధ్యము ఇప్పుడున్న గ్రంథములలో దేనిలోనూ లేదని రుజువు చేయడము చాలా దుష్కరము, ఏదయినా ఉన్నదన్నందుకు సాక్ష్యము తేగలముగాని లేదన్నందుకు సాక్ష్యము తేలేము. 'పక్షము' అంటే, 'పక్షపాతము' అనే అర్థము చెప్పక తప్పనట్లు ఎఱ్ఱన హరివంశములో రెండుచోట్ల ఆ శబ్దము వాడినాడని మేము జ్ఞాపక ముంచుకొన్నాము. గనుక, శాస్త్రులవారే పొరబాటుపడి నిష్కారణముగా పంతులవారిని తిట్టినారని చెప్పుటకు సాహసించినాము, చూడండి ఆ రెండు ప్రయోగములు —

(1) హరివంశములో, కృతిపతి వేమారెడ్డి కవినిగూర్చి చెప్పినవాక్యమిట్లున్నది.

తే. సకలభాషా కవిత్వవిశారదుఁడవు సాధుసమ్మతుఁడవు. నిత్య సౌమ్య
మతివి. భవ్యుఁడవు గాన నీమీఁదఁ బక్షమేను గలిగి యుండుదు నెప్డు
నెఱ్ఱ నార్య (పూ 1 38)

(9) అండే, యముడు సూర్యునితో ఛాయాదేవి కోపించి యిచ్చిన శాపమును గురించి చెప్పిన వాక్యము అచ్చులోనే ఇట్లున్నది,

ఉ. ఎందఱు గల్గినం బ్రజలకేక విధంబగు లాలనంబుఁ జే
యందగరే పవిత్రలు మదంబమునన్ ముగురన్ సహింపదే
చందమొ పిన్నవారలకుఁ జాలఁగఁ బక్షము సేయు దీనికిన్
డెందములోనఁ దాలిమి ఘటింపకయే నిటు తప్పుచేసితిన్.

(పూ. 1 183).

వ్రాతప్రతులలో కొంచెము పాఠభేదము లున్నను, ఈరెండు పద్యములలో 'పక్షము గలిగియుండుదు' 'పక్షముసేయు' అనే వాక్యములు అచ్చులోనున్నట్టే ఉన్నది. సందేహము లేదు, విమర్శించకుండా శాస్త్రులవారన్నమాట, వేదవాక్యముగా నమ్మి, పంతులవారిని లోకమంతా ఈ విషయములో దూషించినా, మేముమాత్రము శాస్త్రులవారిమాట తప్పనక వల్లగాదు. ఎఱ్ఱన ప్రయోగము చూచినతర్వాతకూడా శాస్త్రులవారిమాట చొప్పున పంతులవారిని దూషిస్తే ఎఱ్ఱనను దూషించినవార మవుతాము.

114 పంతులవారి తెలుగులో శాస్త్రిలవారు చూపించిన 'అలుపతెలుగు కన్న శాస్త్రిలవారి తెలుగులో మూరంటబడిన 'అలుపతెలుగు' ఔత్తరాహులమైన మాచెవులకు ఎక్కువ వింతగా ఉంటుంది. మచ్చుకు రెండుమూడు ప్రయోగములు చూడండి 'చెప్పిరాఁగానే' (పుట 4) 'చెప్పుకొనిన్నైనతర్వాత, (10) 'బయటవచ్చి' (72) 'పారణచేసిరాఁగానే (141)' మూపుడు నడమి బొక్క (158) 'వసులసాలమీద' (253) 'రెఁకొయ్యలు (కిర్రలు) నుండును' వెవ్వేలు (= వేలువేలు) (252) బాణములచెత యుద్ధముచేసెను (83) ఆకొండయడివారమున దివ్యమైనతోట వేయించెను (244) వీటిలో 'వెవ్వేలు' "అడివారము' శబ్దరత్నాకరమందులేదు. మే మెరిగినంతమట్టుకు తెలుగుదేశమందు పుట్టిన తెలుగు గ్రంథాలలో మాకు కనబడలేదు. అలుపతెలుగు మాట్లాడే మన శాస్త్రిలవారివంటివారు వ్రాసిన తెలుగులోమాత్రము చూచినాము. అడివారము కేవలము అరవము, 'మలైయడివారమ్'కొండ అడుగుభాగము సింహాచలము వద్దనున్న గ్రామమునకు అరవవైష్ణవులు పెట్టినపేరు. యిప్పుడు 'అడివ్వరమ్' అని వాడుకలో ఉన్నది, 'అడవిలో నున్న ఊరు' అని ఇప్పటివారు వ్యుత్పత్తి చెప్పుతారు గాబోలు.

## భావింపుచున్నాఁడు

115 ప్రసన్నరాఘవము 15వ పుటలో భావింపుచున్నావు అనిఉన్నది. ఇది తప్పట ఎందు చేతనో? చిన్నయసూరి చెప్పలేదని కాబోలు, వ్రాత ప్రతులన్నిటిలోను ఆంధ్రశబ్ద చింతామణికి టీక వ్రాసిన బాలసరస్వతి 'రక్షింపుచున్నాడు' అనేరూపము అనుశాసించినట్లున్నది. భారతాది ప్రాచీన గ్రంథముల వ్రాతప్రతులలో మేము చూచినవాటిలో 'పుచున్నాడు' అనేరూపమే ఉన్నది, 'చుచున్నాడు' అరుదు. భాషాతత్త్వము చొప్పున 'చుచున్న' సాధుభాషగా కనబడదు. తత్త్వము మాట కేమి? పోనీండి; ఆంధ్రశబ్ద చింతామణిక్రియా పరిచ్ఛేదము 15వ సూత్రమునకు టీక ఇట్లున్నది.

'అనుబంధ ప్రార్థన యోరిత్యాది సూత్రముచేతఁ బత్వము, పోషింపుచున్న; వ్యతిరేకార్థేల్పటిలటిత్యాది సూత్రముచేతడువర్ణకము, పోషింపుచున్నాడు వర్ణాగమో విశేషః అను సూత్రముచేత దీర్ఘము పోషింపుచున్నాఁడు. ఇట్లు నుతింపుచున్నాఁడు, జయింపుచున్నాఁడు. అనుభవింపుచున్నాఁడు, భరింపుచున్నాఁడు, వసింపుచున్నాఁడు ఇత్యాదులు

ఈ ప్రమాణము చొప్పున పంతులవారి వ్రాత ముమ్మాటికీ సాధువే.

## ఇ త్వ స ం ధి

నన్నయకాలమునుండి ఇత్వసంధి ఉన్నది చూ. రాతిరెల్ల (ఆది 6-160) చెతొక్క (ఉద్యో 1. 219), తిత్తొల్చి (నైష 7. 81). పూర్వము విరళమయినా అంతకంతకు ప్రచురమయినది శాస్త్రిలవారి కిది బోధపడక, తాను పట్టిన కుందేటికి మూడేకాళ్ళని వాదిస్తారు. నైషధము 3 202 'దీనంభ్రుఖులు అని ఉంటే దిద్దినారు. వరసుపాపాలీయములోని 'వానన్న' దుష్ట సంధి అన్నారు; జైమినిభారతములో 'వానరదము' అని ఉన్నది. (చూ. శ. ర. ఆవతిచ్చు) అనేకులు ఈసంధి అంగీకరించినారు. బాలకవిశరణ్యములో ఈ విషయము చర్చిస్తాము. ఇక్కడింతేచాలును

## క్త్వార్థ కే కా ర స ం ధి

117. శాస్త్రిలవారి దృష్టికి ఇది మహా పాతకము. బాలకవి శరణ్యములో కావలసినన్ని ప్రయోగాలు ఉదాహరిస్తాము ఒక్క చిన్నయసూరి తప్ప తక్కిన లాక్షణికులు ఇది అంగీకరించినారు. ప్రాచీనాంధ్రములో విరళమన్న మాట వాస్తవము భాషాతత్త్వముపట్టి అట్లు కాక తీరదు, గాని ఉత్తరాంధ్రములో పదాంతమందున్న అచ్చుల ఉచ్చారణమారుటచేత సంధి అవుతున్నది గనుక ఈ సంస్కారము ఒప్పుకోక తప్పదు.

## ముందుకు, ఎందుకు.

118. వేంకట రత్నము పంతులవారు తమ గ్రంథము 55 వ పుటలో 'ముందుకు జరిగి అనిన్ని 80 వ పుటలో 'ఎందుకు' అనిన్ని వ్రాసినారని మన శాస్త్రిలవారు నిందించినారు. ఈ రెండు శబ్దములు వారు అసాధువు లనడము వింతకాదు. ఎందుచేతనంటే, అభారతప్రయోగములు వారు అంగీకరించరట, ఇవి భారతములో లేవు అభారత ప్రయోగములు వారు అంగీకరించ మనడము వారి గ్రంథములలోని భాషను గురించి కాదుసుమండీ ఇతరుల గ్రంథములు విమర్శించినప్పుడే. వారు వ్రాసేభాష, ఇంచుమించుగా అంతా అభారత భాషే. ఇది వింతకాదు. 'ముందుకు, 'ఎందుకు' అసాధువు లనుటకు వారు చెప్పిన కారణము వింతగా ఉన్నది. వింతేకాదు; ఆ కారణము చూచి నిర్ఘాంతపోయినాము ఎంత పుచ్చిన మిరియాలైనా బొన్నలపాటి చేయవా? అనుకొనేవాళ్ళము. శాస్త్రిలవారి ఆంధ్రపాండిత్యములో ఇదివరకు ఎన్నిలోట్లు కనబడ్డా వెరసు మాట చెప్పవలసి వచ్చినప్పుడు, సగటుకు తీసిపోదు అనుకొన్నాము. 'ముందుకు' తప్పన్నందుకు వారు చెప్పిన కారణము చూచిన తర్వాత మాత్రము — నిజము చెప్పక తీరదు—వీరియందు ఏమీ ఆధిక్యమున్నట్లు ఒప్పుకోవడము

నకు మా మనస్సు ఒప్పకుండా ఉన్నది. నగాగమము లేనందున 'ముందుకు,' 'ఎందుకు, అసాధులట ! ఓహోహో ! గ్రాంథికాంధ్రభాషా పాండిత్య పరమావధి 'ముందుకు' అంటే తప్పట ! 'ముందునకు' అంటే సాధువట !! చదువుకోక మునుపు కాకరకాయ; చదువుకొన్న తర్వాత కీకరకాయ అన్నట్టున్నది. కుప్రత్యయమునకు పూర్వము నగామము తప్పకుండా ఉండవలెనట ! ఆంధ్ర శబ్ద చింతామణిలో 'నఃకౌ' అనే సూత్రము ఇక్కడ పట్టించవలెను ! పాండిత్యము ముదిరిపోయి, పండిపోయి, చివికి, ప్రిదిలి రసము కారిపోతున్నట్టు ఉన్నది. ఇట్టి పండితుని రసికుఁడని అంకెఁ జేర్చికొంటివపటే ! పీసీ అంధ్రీ' అని బ్రహ్మదేవుడు నాలుగుచేతుల తర్జనులున్ను నాలుగు ముక్కులమీద పెట్టుకొని ఉండడా ? అంధ్రవాణి సిగ్గుచే తలవంచుకొని ఉండదా ! బ్రహ్మసభలో నున్న నన్నయాది మహాకవు లందరున్ను మొగాలు వ్రేలవేసుకొని ఉండరా ? అని అనుకొంటున్నాము.

119. 'ముందుకు', 'ఎందుకు' అనేవి లోకములో ఇప్పుడు సుప్రసిద్ధములయిన శబ్దములు. శబ్దరత్నాకరమందు 'ఏల' కు 'ఎందుకు' అని అర్థమున్నది. ప్రాచీనాంధ్రములో ఇవి లేవన్నమాట నిజమే. గాని, ప్రాచీనాంధ్రములో 'ముందునకు' 'ఎందునకు' లేనేలేవే ! 'ముంటటికి', 'ముందటికి' అనేవి మాత్రము ఉన్నవి ఇవి నేడు కూడా మనమువాడుతున్నాము. యీ రెంటికీ అర్థములో కొంత భేదము నేటి వ్యవహారములో ఏర్పడ్డది. ఆ భేదము పూర్వములేదు. 'ఎందుకు' కు బదులుగా పూర్వులు 'ఎందులకు' వాడేవారు, గాని 'ఎందులకు' అంటే 'ఎక్కడికి' అని ప్రాచీనుల భాషలో అర్థము ? 'అందుకు' అంటే 'అక్కడికి', ఇందులకుఅంటే 'ఇక్కడికి', నేడుకూడా 'అందులకు' అనేశబ్దము మనము వాడుతున్నాము. ఉదా 'మీకు తెలియగలందులకు వ్రాసినాను' ఇట్టి సందర్భమందు నన్నయాదులు 'అందులకు' వాడలేదు. నేడు 'అందులకు' వాడుకలోఉన్నా, 'ఇందులకు', 'ఎందులకు' లేవు. అందుకు, ఇందుకు, ఎందుకు—ఇవి నాలుగయిదువందల సంవత్సరములై కవులు స్వేచ్ఛగా వాడుకుంటున్నారు. భోజరాజీయము, కేయూరబాహుచరిత్ర, మల్లన వరాహపురాణము, వసుచరిత్ర, చంద్రికాపరిణయము, రుక్మాంగద చరిత్ర, ప్రభావతీ ప్రద్యుమ్నము—ఇటువంటివాటిలోనే ఉన్నవి. ఇక ఇలాదేవీయము, కువలయాశ్వచరిత్ర, కృష్ణరాయ విజయము, చిత్రభారతము, దశావతారచరిత్ర, బిల్హణీయము, మిత్రవిందా పరిణయము, రాధామాధవసంవాదము, రామరాజీయము, రామ స్తవరాజము, విజయవిలాసము, వేంకటేశ్వరమహాత్మ్యము, శశాంకవిజయము, సారంగధర చరిత్ర మొదలయిన అనేక కావ్యములలో 'అందుకు' 'ఇందుకు' 'ఎందుకు' ప్రయుక్తమయిఉన్నవి. వీటిలోని ప్రయోగములన్నీ బాల

కవి శరణ్యములో 'రాజుకు' అనే శబ్దమును గురించి మేము ప్రకటించే ప్రసంగములో ఉదాహరిస్తాము. ఇక్కడ నాలుగు ప్రయోగములు మాత్రము మచ్చుకు చూపిస్తాము:—

మల్లన వరాహ.

మ. అశుభధ్వంసక మిందుకుం దగునుపాఖ్యానంబు (9. 8)

,, క సిద్ధించు నిందుకుం దగ (9. 86)

వసుచరిత్ర. మ పంచమశబ్ద మిందుకు సుదృగ్జాలంబు రాఁజేఁల్లునే (3, 141)

చంద్రికా. పరిణ సీ. గీ అందుకోర్వం జాల (4, 162)

వందలు వందలుగా తెలుగు కావ్యములలో ఇట్టి ప్రయోగము లున్నవే. ఇవి శాస్త్రిలవారికి తెలియనే తెలియవని ఊహించవలెనా ? తెలిసిన్నీ పంతుల వారియందు దోషము ఆరోపించినా రనవలెనా ? "ఎందుకు" తప్పనిన్ని "ఎందునకు" ఒప్పనిన్ని బడిపిల్లలకు బోధిస్తున్నారే ' ఎంత అవివేకము ! తెలియ వంటే శాస్త్రిలవారు ఆంధ్ర సారస్వతము పొలిమేరయినా ఎరుగరని చెప్పవలసి వస్తుంది. తెలుసునంటే, ఈ చెప్పిన కవులందరిభాష అసాధువనిన్ని వారికంటె వారు సాధుతరమైన తెలుగు వ్రాయగలవారనిన్ని చెప్పవలెను, లేదా, కేవలము ఈర్ష్యచేత పంతులవారిని నిందించినారని అయినా చెప్పవలెను ఏది సంభావ్యము ?

120 .'ముందుకు' అని నేటి వ్యవహారములో సిద్ధశబ్దము. వేంకటరత్నము పంతులవారి ప్రయోగము భాషాస్వభావానుగుణముగానే ఉన్నది; తప్పు కాదు, శాస్త్రిలవారు సాధువని విధించిన 'ముందునకు' కేవలము లోక విరుద్ధము. నేడు ఎక్కడా లోకములో వినబడదు; పూర్వకాలపు గ్రంథములలో మాకు ఎక్కడా కనబడలేదు. నన్నయ తిక్కనాది కవుల కావ్యములనే కాక ఉత్తరాంధ్ర కవుల కావ్యములలోకూడా తరుమగా ముందటికి, 'ముందటికి, కనబడ్డవి. ఇవి నేడున్ను లోకమం దున్నవి. కొన్ని ప్రయోగము లుదాహరిస్తాము, చూడండి'—

ద్రోణ. 1. 204. పాండవయోధులు ...యుధిష్ఠిరు ముందటికి వచ్చి.

,, 4. 822. క, పటురకముల మీఁదికి డాపటికిన్ వలపటికి నపర భాగమునకు ముందటికిఁ జదలనడపె నము ! తృటి రయమున శిరముఁ గందుక క్రీడగతిన్.

శాంతి 3 557, క....వీనినేల నాముందటికిం, గొనివచ్చితిరి.

పాండురంగ 4. 224 చ. బిల్కొ యదగఁ దొట్టి ముంపటికి లాగక
మల్లన వరాహ 3. 23. గీ. ముందటికి వచ్చి.

ప్రభావతీ. 2. 42. సీ. అంత నిశ్చల ప్రసారిత పరిసంబుగా, దిగుచుఁ
గాముని ముందటికిని గొంత.

సీతాసుంద 3. 64 క. అయిసెవె ముం. దటికినిఁ జని.

'ముందర' వాస్తవముగా సరే శబ్దము కాదు. 'మీదు' 'కిందు' శబ్దము లనుండి, 'మీఁదటి'కి, అనే రూపములు వచ్చినట్టే, 'ముందు' శబ్దమునుంచి 'ముందటి్కి', 'క్రింద'నుంచి క్రిందటి కి వచ్చినవి. 'అయితే' 'మీఁదికి' 'క్రిందికి' అనేవికూడా వాటినుంచి వచ్చినవి గాని, దీనినుంచి 'ముందికి' రాలేదు. ఉత్తరాంధ్రమందు 'అందుకు' 'ఇందుకు', 'ఎందుకు' వలెనే 'ముం దుకు' వచ్చినది.

121. ఆంధ్రశబ్ద చింతామణిలోని 'నఃకా' అనే సూత్రమున్ను బాల వ్యాకరణమందున్న 'కుపర్ణకంబు పరంబగునప్పుడు డుకారంబుకారంబునకు నగాగమంబగు' అనే సూత్రమున్ను, అయినదానికీ కానిదానికీ పట్టించి, లోక విరుద్ధమయిన శబ్దములు పుట్టించే వారికి వ్యాకరణమంటే ఏమిటో తెలియదని చెప్పవలెను ఆగమ శాస్త్రము నిత్యముకాదు ఉత్సర్గము కంటె అపవాదము బలీయము. అపవాదము లున్నప్పుడు వాటిని చెప్పకుంటే, శాస్త్రము అప్రమాణము గాని శబ్దము తప్పుకాదు. వ్యాకరణ శాస్త్రముయొక్క పదికట్టు తెలియని పండిత బ్రువులు లోకములో ప్రసిద్ధమయిన శబ్దములు శాస్త్ర విరుద్ధములని దూషించి, లోకవిరుద్ధమయినవి శాస్త్రముచేత సాధింప నెంచి స్వభావసిద్ధము యిన రూపములు మార్చి 'దిద్దుతున్నారు'. తమ బొల్లిభాష బడిపిల్లలకు నేర్పు తున్నారు. 'ఆనందవాచక పుస్తకముల'లో కూడా 'ముందునకున్ను' అట్టివే ఇంకా అనేక అపశబ్దములున్ను ఉన్నవి. మన శాస్త్రులవారు, వాడినవే ఇట్టి అపభ్రంశములు ఈ వ్యాసము మూడవ భాగములో ఉదాహరిస్తాము.